C

# భారతి

సాహిత్య మాసపత్రిక

ఆగష్టు 1978

* గెలుపు - దిలావర్ * యియాస - సంపత్కుమారాచార్య
* మహారోహణం - రామాచంద్రమౌళి * ఋతుగీతం - నాగభూషణం

*శాతవాహనులు - జాతి మత కులములు - శ్రీరామమూర్తి * కాళీపట్నం రామారావు కథలు-రాధాకృష్ణమూర్తి * తాజిరాజసం-ఇనాక్ *ప్రాచీన భారతీయ ఆర్థిక ఆలోచన - రావు

ఇంకా సదానంద, సిధారెడ్డి, జనార్ధన సూరిబాబు, చైతన్య, శ్రీనివాస్ వి. వి. న. మూర్తి ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



ఆగష్టు 1978

సంపుటము : 55 సంచిక : 8

విడిపత్రిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## ఆగష్టు 1978


| | | |
|---|---|---|
| మహారోహణం | శ్రీ రామచంద్రమౌళి | 4 |
| మౌనం మాత్రం వద్దు ! | "చైతన్య" | 6 |
| పల్లె - పట్నం బొమ్మ | శ్రీ కలువకొలను సదానంద | 7 |
| "బిందువులో ప్రపంచం" | శ్రీ నందిని సిధారెడ్డి | 8 |
| కళామయి — కాలయుక్తి | శ్రీ నాగూరి జనార్ధన | 9 |
| యియాస | శ్రీ వి. సంపత్కుమారాచార్య | 9 |
| అంతశ్చైతన్యం | శ్రీ ఓ. సూరిబాబు | 10 |
| ఋతు గీతం | శ్రీ దాసల నాగభూషణం | 10 |
| "హృదయంలో కొలిమి" | శ్రీనివాస్ | 11 |
| గెలుపు | శ్రీ దిలావర్ | 11 |
| శాతవాహనులు – జాతి మత కులములు | డా. కొర్లపాటి శ్రీరామమూర్తి | 12 |
| కాళీపట్నం రామారావు కథలు | శ్రీ సూరపరాజు రాధాకృష్ణమూర్తి | 20 |
| గుంటుపల్లి గుహలు బ్రాహ్మీ శాసనములు | శ్రీ ఇంగువ కార్తికేయశర్మ | 26 |
| అందరూ నిద్రపోతున్నారు ! | శ్రీ కలువకొలను సదానంద | 33 |
| ప్రాకృత వాఙ్మయంలో రామకథ-3 | శ్రీ తిరుమల రామచంద్ర | 38 |
| మరల మధ్య మందారం | శ్రీ వి. వి న. మూర్తి | 44 |
| సంక్షేమ రాజ్యాన్ని కోరుతున్న ప్రాచీన భారతీయ ఆర్థిక ఆలోచన : మను, శుక్ర, కౌటిల్యుల ఆర్థిక దృక్పథాలు : విధానాలు : పాశ్చాత్య ఆలోచన పోలికలు | డా. బి. ఆర్. కె. రావు | 49 |
| తాజీ రాజసం | డా. కొలకలూరి ఇనాక్ | 55 |
| కలగూరగంప | | 58 |
| గ్రంథ విమర్శలు | | 68 |

4

# మ హా రో హ ణం

శ్రీ రామచంద్రమౌళి

మార్చురీ గదినుంచి ప్రశ్నలు దూసుకొస్తున్నాయి తుపాకీగుళ్ళలా
గాజు తలుపుల వెనుక
ఆ నిశ్శబ్ద శవప్రపంచం సంఘాన్ని విశ్లేషించి విస్తృతించి
వికృత విశ్వరూపాన్ని పుక్కిలిస్తోంది
మౌన శర ప్రపాతాలనుంచి పరుగెత్తుతూ...పరుగెత్తుతూ
రోడ్ల అడవులపై
జీవితంలోనుంచి కాలాన్ని పారబోసుకుంటూ ఒకటే మహావరోహణం —
ఎవడో దీపాన్ని వెలిగించి పోతాడు
గుండె గూట్లో మంటను బ్రతికించుకోడానికి
నిరంతర ఉదయాస్తమయ క్రీడలా ఎడతెగని పోరాటంలో కనలి కనలి
ఎప్పుడో కొమ్మపై ఒంటరి పక్షిలా
ఓ నిట్టూర్పు శరీరాన్ని నిమురుతుంది
కర్రబెత్తం ... ప్రక్కన పుస్తకం
భయపెట్టే బడి...
పరికిణీ సువాసనలు ... గులాబీ కొప్పులు
పైటను జార్చుకునే పరువపు ఆవలింతలు ...
నిశ్శబ్దంగా నువ్వు ఆమెను మంచంపై దగా చేసిన తీయని జ్ఞాపకాలు
ఆ జ్ఞాపకాలనుంచి మళ్ళీ నువ్వు కుంచెలో పుట్టించిన జీవితాలు
జిడ్డు దీపం వెనుక ... మసక వెలుగులో
ఏవో చిన్నారి ఏడ్పుల నీడలు ...,
పరుగు ... పరుగు ... మళ్ళీ పరుగు
ఆమె ఏది,
నీ హృదయాన్ని మెత్తని స్తనాలతో ఒత్తి నీ జీవితానికి సరిపోయే స్మృతుల ఇంధనాన్ని దానం చేసిన ఆమె ...
వెదుకుతున్నావు లోయల్లో ... శిఖరాగ్రాలపై ... చుక్కల రెక్కల్లో
వెనుకనుంచి నిన్ను చొక్కాపట్టుకు లాగుతున్నారు
నువ్వు పొందిన సుఖాల్లోనుంచి పుట్టి నీ బాధ్యతను నీపై కుమ్మరించేవాళ్ళు
చూరునీళ్ళక్రింద తడుస్తూ ఎంతసేపు
గుండెమంట ఆరదు నీటి తడితో —

ఐతే ఎండిపోయిన చెట్టు ఎదుట కూర్చుని
అది పూచే ఘడియదాకా నిరీక్షిస్తానంటే ... నువ్వు భగీరథునివి కావు...భ్రష్టుడవౌతావు
సర్కస్ బోనులో పులిని చూస్తూంటే
నీకేం జ్ఞాపకమొస్తూందో చెప్పనా ...
నీకు నువ్వే గుర్తొస్తావు !!
నీ చుట్టూ వున్న కటకటాలు
నీకు తప్ప యింకెవరికీ కనిపించడం లేదు ... అదే నీ ధీమా
ఎవరికి వారే ఒక్కో పంజరాన్ని చుట్టుకుని రోడ్లపై పోతూంటే
ఎంత వికృతంగా వుందో చూడు
... యీ రోడ్డుకు ఎప్పుడు విశ్రాంతి వుందని
రోగినీ, భోగినీ, త్యాగినీ ... అందరినీ భరించి భరించి అలసి ...
అది వున్నపుడు నువ్వు గుర్తించవు దాని విలువను
ఒక్కనాడు అది పాడైతే ... నీకే తెలుస్తుంది నీ సంగతి
నువ్వు బ్రతుకులో ఎన్ని సమస్యలకు భర్తవో
నువ్వు నీలోనుంచి విముక్తం కావాలనుకున్నప్పు డర్థమౌతుంది
నువ్వీ నగరారణ్యాలనుంచి ఉరికొచ్చి ఉరికొచ్చి
సాగర తీరాన కూర్చుని అస్తమయందిక్కు చూస్తూ
బద్దలయ్యే కెరటాలతో తాదాత్మ్యం చెందుతున్న క్షణంలో
నీ కళ్ళు ఎంత ప్రశాంతమైపోతాయో నీకు తెలుసా
అప్పుడు నీ మనసు ఒట్టి నీలాకాశమైపోతుంది
నీ కిటికీ అవతలి ఫెరన్ మొక్క మెదులుతుంది మనసులో
సమస్యల ఆకులతో —
ఐనా అందంగానే అనిపిస్తుందది లోకానికి
మొక్కలు ... వృక్షాలు
ఎందుకు కొన్ని మొక్కలైనాయి
ఎందుకు కొన్ని వృక్షాలైనాయి
అన్నీ మొక్కలో ... అన్నీ వృక్షాలో ఎందుకు కాలేదు
ప్రశ్నలు మళ్ళీ మార్చురీ గదిలోకి పరావర్తనం చెందుతూ ...
నేను
గడ్డి పరుపుపై వెల్లగిలా పడుకుని
కొమ్మపై పిచ్చుక ఎగురుతూంటే చూస్తూ
మనసులో విశ్వసందర్శనం చేస్తూంటాను.

# మౌనం మాత్రం వద్దు!

## "చైతన్య"

మౌనంవద్దు నేస్తం
  ఏదో ఒకటి మాట్లాడు !

చెట్లూ—చేమలూ
మౌనం పాటిస్తే
తనువుకాక ద్రవపరీక్ష ...

నదీ ప్రవాహాలు
స్తంభించిపోతే
మళ్ళీ సాగర నిరీక్ష ...

కనుక
మౌన మొద్దు
ఏదో ఒకటి చెప్పు !

నిన్నూ, నన్నూ కలిపే
మమతల మాట

మల్లెపువ్వుల్నీ; చంద్ర నిప్పుల్నీ
చెరిసగమనుభవించే
చెలిమి తరగ
ఏదైనా చెప్పు

రాయిచూడు !
పాపం ! శిలాయుగం నుంచీ మూగది
సురుచిర సుందర శిల్పమైనా
స్వరపేటిక నోచుకోంది
ఎత్తైన శిఖరం సైతం
కుత్తుక లేనట్టిది.

*   *   *

గుండె ఘోష
విప్పుకునే 'భాష'
ఒక్క 'మనిషి' కే దక్కింది.

అందుకే
మనమధ్య అగాధంలాంటి
ఈ మౌనమెందుకు ?
ఏదైనాచెప్పు ! మిత్రమా ! చెప్పు !
సరిహద్దుల్ని తుడిచేసి
పరివ్యాప్తమైపోయిన
గాలి — సంకల్పం

మతాల్ని విడిచేసి
మానవతను తలదాల్చే
ఆకాశం — మాట
ఏదైనా చెప్పు !

కానీ
మౌనం మాత్రంవద్దు సుమా !
అది — నీకూ నాకూ మధ్య
దూరాల్ని పెంచుతుంది
మనసుల్ని కలిపి కుట్టలేదు
ఉపరి "కత్తెరలు" ప్రయోగిస్తుంది.



# పల్లె - పట్నం

ముందున్నవి ఇవిగో,
రెండు నజరానాలు!

ఒకటి —
కొండ కోనలలో గోవుల్నికాచే
గోపాలుడు.

రెండు —
జాతరకు బండికట్టే
జల్సారాయుడు.

గోపాలుడిది ఎంత చల్లని బ్రతుకు!
గోవులతో బాసలాడుతూ,
పచ్చని కొండకోనలలో విహరిస్తాడు.
పిల్లంగోయి వాయిస్తూ
కానగచెట్టు నీడలో చల్లగా కూర్చుంటాడు.
పంట పొలాల్లోని పచ్చదనం,
నీలాకాశంలోని నైర్మల్యం,
నీడలలోని చల్లదనం,
సెలయేళ్ళలోని తీయదనం,
మూగజీవాలతోడి అనుబంధం...
అన్నీ వాడివే!

జాతరలో ఏముందుంది?
రద్దీ,
త్రొక్కిడి,
త్రోపుడు,
విసుగు,
అలసట!
కొండంత ఆనందం వున్నట్లు హంగామా తప్పితే
గోరంతకూడా దొరకదు.
మనుషులందరూ చూచేలా
మనసులోలేని ఉత్సాహాన్ని
ముఖం మీద ప్రదర్శించాలి.
అంతా హుళక్కి!

ఆ గోపాలుడంటేనే నాకు యిష్టం!
పల్లె ఒక్కటే
కానగచెట్టు నీడలాంటిది
తక్కిన ప్రపంచమంతా
అంతూ పొంతూలేని తిరణాల!

---

# బొమ్మ

కళ్ళుప్పగించి చూస్తే
కనిపించిన దృశ్యం ...
అత్యున్నత వర్గానికి చెందిన స్త్రీ పురుషులు
ఒక్కచోటచేరి తప్పతాగుతున్నారు,
సుష్టుగా తింటున్నారు,
నీడలో నీడ కలిసిపోయినట్లు
ఒకరి నొకరు పెనవేసుకుని
తైతక్కలాడుతున్నారు.

విందారగిస్తున్న వాడొకడు
చియ్యి వొలుచుకు తిని,
ఎముకను కిటికీలోంచి బయటికి విసిరేశాడు.
వీధిలో
గాలిమేస్తూ బ్రతుకుతున్న కుర్రవాడొకడు
ఆ ఎముక కోసం పరుగెత్తుకొచ్చాడు.

వాడికంటే ముందు గజ్జికుక్క ఒకటి
దాన్ని లటుక్కున నోట గరచుకొని
దౌడు తీసింది
వాడు దీనంగా
గడపకు అవతల నిలబడిపోయాడు.

గడపకు యివతల —
మద్యపానం,
మాంస భక్షణం,
ఉన్మాదం,
పైశాచికత్వం !
ఆ కుర్రవాడి ముఖంలోని దైన్యంలోకి
తొంగిచూచిన కళ్ళన్నీ
చెమ్మగిల్లాయి ! ...
ఎక్కడ ?
సినిమా హాలు బయటకాదు;
లోపల !
అలాంటి దృశ్యాల్ని బయట చూసినపుడు
ఆ కళ్ళు చెమర్చవేం ?
బొమ్మల్నిచూసి జాలిపడటం
మన అలవాటు !
వాస్తవదృశ్యాలంటావా ?
మన కళ్ళకు
అవి బొమ్మల కొలువులు !
నటించడానికి మూడ్స్ అవసరమైనట్లు,
ఏడవటానికి గ్లిసరిన్ కావలసివచ్చినట్లు,
జాలిపడటానికి
ఇక్కడ నేపథ్య సంగీతం లేదు !

శ్రీ కలువకొలను సదానంద

---

# 'బిందువులో ప్రపంచం'

శ్రీ నందిని సిధారెడ్డి

ఆశ్చర్యమా ? అనుభవమా ?
ఈ మామూలు బిందువులో
మహత్తర ప్రపంచాన్ని చూడగల్గటం !
కిందినుంచి పైకివెళ్ళే
ఆవిరి బిందువు మాట తీసెయ్ —
నా దార్శనిక స్థానం
పైనుంచి కిందికి రాలే బిందువే
నాకు గొప్పగా ఉంటుంది !
ఆకాశం రాల్చిన బిందువును
ఆకాశ స్ఖలనంగా అనుకున్నప్పుడు ...
ఈ బిందువులో,
మొలకెత్తే జీవిత పిండాల నిలయమై
భూగర్భం కనిపిస్తుంది.
ఆకాశం రాల్చిన బిందువునే
ఛాతీ మీంచి విరిగిన చెమటగా అనుకున్నప్పుడు...
ఈ బిందువులో,...
పిడుచ కట్టిన గుండెల్లో నా వర్గం కనిపిస్తుంది
ఆకాశం రాల్చిన బిందువునే
కనుకొలనుల్లోంచి ఉబికిన కన్నీరుగా
అనుకున్నప్పుడు ...
ఈ బిందువులో
వ్యవస్థ వధ్యశిలమీద ఇరుక్కున్న
కళ్ల అమాయకత్వం కనిపిస్తుంది.
ఆశ్చర్యం కానే కాదు,
అనుభవమే !
మామూలు బిందువులో
మహత్తర ప్రపంచాన్ని దర్శించటం గొప్ప అనుభవం!
బిందువు పొందిన ఆవిరే
శాశ్వత మనుకునే వాడికి —
అదే వేదాంతంగా ఫోజుపెట్టేవాడికి —
వాడికేం తెలుసు ? ?
ఆ ఆవిరే మేఘమవుతుందనీ,
ఆ మేఘమే భూమిలో మొలుస్తుందనీ;

# అంతశ్చైతన్యం

శ్రీ బి. సూరిబాబు

ఏమిటా వెలుగు ?
చుట్టూ ఉన్న చీకటిని
విలీనం చేసేస్తూ
ఎక్కడివా రశ్మిరేఖలు !

దిశదిశలా, నలుదెసలా
ప్లావితమై పోతూ

రేఖ రేఖకో రాగాలాపన
మానస స్పందనలో
మధురగీతంలా

ఆ విషాద మాధుర్యంలో
ఏదో హాస్యం మేళవింపు

జపా కుసుమాలు
కాగితంపూలను గేలిచేసినట్లు

ఆ నవ్వులు
ఆ జ్వలిత హృదయాల మురళీ స్వనాలు

ఈ గుడ్డి లోకాన్ని పరిహసిస్తూ
ఈ పిచ్చికాలాన్ని అపహసిస్తూ
పరుచుకు పోతున్నాయి
బాధాతప్త హృదయాలపై

ఆ ధవళ కాంతులు
ఆ స్వర సంచయాలు

ఆ లలిత లాస్యాలు
ఆ తరళ స్వప్నాలు

కాలతీరాలను పగలకొడుతూ
నూత్న సౌరభాలను పంచిపెడుతూ
మూగ హృదయాలను పలికిస్తూ
స్వేచ్ఛగా
అనంతదూరాలకు సాగిపోతున్నాయి

అవగాహనలో పుట్టిన
ఈ భావనలు
ఆత్మలో లీనమై పోతున్నాయి.

---

# ఋతుగీతం

శ్రీ కాసల నాగభూషణం

ఈ శైశిర శీర్ణవాటికలో నిలిచి
నేనీ రోజున
అవిశ్రాంత హిమాశ్రువుల్ని
జారవిడుస్తున్నమాట నిజం !
అనుభవానికి చేరువగా
అందివచ్చిన మందార మాలని
నిట్టూర్పు గాడ్పులతో
మలమల మాడ్చివేస్తున్నమాట నిజం !
చిల్లులు పొడిచే శీతవాయువుల
చిత్రమైన హాళాహళిలో
నిలువు నిలువున
నీరయిపోతున్నమాట నిజం !
కాని ... కాని ... ఈ నేనే
కన్నీళ్లతో నిండిన
కష్టాల పాదులనుంచి
కలలుగన్న వసంతాల పందిళ్లమీదికి
ఆశయాల పూలతీవల్ని
అల్లిబిల్లిగా అల్లిస్తాను !
అవి పూచిన నవ్వుపువ్వుల
నవరసాల సౌరభాలని
అమందానంద చామీకర చాలనంతో
అన్ని దిశలకూ వెదజల్లిస్తాను !

డా. కొర్లపాటి శ్రీరామమూర్తి

# శాతవాహనులు - జాతి మత కులములు

శాతవాహనులు ఆంధ్రులు—కాని, ఆంధ్రభృత్యులు, ఆంధ్రులు కారు అని చరిత్రకారుల అభిప్రాయములు కలవు. అసలు శాతవాహనులు ఆంధ్రభృత్యులు అని ప్రథమతః అందిచ్చినవారు కీ. శే. ఆర్. జి. భండార్కర్‌గారు.[1] ఆంధ్రులు కాని ప్రథమతః అందిచ్చినవారు డాక్టర్ వి. యస్. సూక్తంకర్‌గారు.[2] అది ప్రధ్వస్తము వేసినవారు ప్రొఫెసర్ గోర్తి వేంకటరావుగారు.[3] ఇక మిగిలినది ఆంధ్రభృత్యులు. ఇది నేటికిని అలేఖ్యమానము. పాఠ్యమానము. అంతేకాదు ఆంధ్రభృత్య పదబంధము విశేషణపూర్వపద కర్మధారయ సమాసమా ? విశేషణోత్తరపద కర్మధారయ సమాసమా ? షష్ఠీ తత్పురుష సమాసమా? అని తర్జన భర్జనలు కలవు. అనగా ఆంధ్రులైన భృత్యులా? భృత్యులైన ఆంధ్రులా? ఆంధ్రుల యొక్క భృత్యులా? అని మీమాంస శాతవాహనులు ఆంధ్రభృత్యులు అని పురాణములందు కలదని గతానుగతిక విశ్వాసము వాయు, మత్స్య, విష్ణు, బ్రహ్మాండ, భాగవత, భవిష్యోత్తర పురాణములలోని భావిరాజ వర్ణనములందు శాతవాహనులకు సంబంధించు విషయము కలదు. ఒక్కొక్క పురాణమున ఏమి కలదో పరిశీలనావశ్యకము.

భవిష్యోత్తర పురాణమున ఆంధ్రరాజులు అని కలదు

'శిముకః శాతకర్ణిస్తు యమాహుర్బ్రాహ్మణం జనాః
భోక్ష్యత్యన్ధ్రో మహీం రాజా త్రయోవింశతి వత్సరాన్'

ఇందు శిముక శాతకర్ణి ఆంధ్రభూమిని పాలించునని కలదు అనగా శిముక శాతకర్ణి ఆంధ్రరాజు. కాబట్టి - శాతవాహనులు—ఆంధ్రరాజు లనియే కాని, ఆంధ్రభృత్యులని భవిష్యోత్తర పురాణమున లేదని స్పష్టము.

భాగవతమున ఆంధ్రజాతీయులు అని కలదు.

'హత్వా కాణ్వం సుశర్మాణం తద్భృత్యో వృషలో బలీ
గాం భోక్ష్యత్యాన్ధ్ర జాతీయః కంచిత్కాలమసత్తమః'—
శ్లో. 22, అ. 1, స్కం. 12.

ఇందు కాణ్వుడైన సుశర్మకు భృత్యుడు, వృషలుడు, ఆంధ్ర జాతీయుడు అయిన బలి కాణ్వుడైన సుశర్మను చంపి కొంతకాలము పాలించునని కలదు.అనగా ఆంధ్రజాతీయుడైన బలి కాణ్వభృత్యుడని అవగాహకము. అంతేకాదు. ఆంధ్రజాతీయులు అనగా ఆంధ్రులు లనియే అర్థము. కాబట్టి -శాతవాహనులు — ఆంధ్రులు, కాణ్వభృత్యులు అనియే కాని, ఆంధ్రభృత్యులని భాగవతమున లేదని స్పష్టము.

బ్రహ్మాండ పురాణమున ఆంధ్ర జాతీయులు, ఆంధ్రులు అని కలదు.

'సిన్ధుకో హ్యాన్ధ్ర జాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరామ్
త్రయో వింశత్సమా రాజా సిన్ధుకో భవితా హ్యథ'

'ఇత్యేతే వై నృపా స్త్రింశ దన్ధ్రా భోక్ష్యన్తి వై మహీమ్'—
శ్లో॥లు 161, 170; అ 74; తృతీయపాదమ్.

ఇందు మొదటి శ్లోకమున సింధుకు డను ఆంధ్రజాతీయుడు పాలించునని రెండవ శ్లోకమున ఈ ముప్పదిమంది రాజులు ఆంధ్రులు పాలింతురని కలదు. ఆంధ్రజాతీయులన ఆంధ్రులే. కాబట్టి--శాతవాహనులు - ఆంధ్రులనియే కాని ఆంధ్రభృత్యులని బ్రహ్మాండ పురాణమున లేదని స్పష్టము.

విష్ణుపురాణమున ఆంధ్రజాతీయుల అని కలదు.

'సుశర్మాణాంతు కాణ్వం తద్భృత్యో బలిపుచ్ఛకనామా
హత్వాన్ధ్ర జాతీయో వసుధాం భోక్ష్యతి'—'
శ్లో. 43, అం. 4, అ. 24

ఇందు కాణ్వుడైన సుశర్మను అతని భృత్యుడు, ఆంధ్రజాతీయుడు అయిన బలిపుచ్ఛకుడు చంపి పాలించునని కలదు. అనగా ఆంధ్రజాతీయుడైన బలిపుచ్ఛకుడు కాణ్వభృత్యుడని అర్థము. కాబట్టి—శాలివాహనులు—ఆంధ్రులు, కాణ్వభృత్యులు అనియే కాని, ఆంధ్రభృత్యులని విష్ణుపురాణమున లేదని స్పష్టము.

మత్స్య పురాణమున ఆంధ్రులు అని కలదు —

'ఏతే ప్రణతసామన్తా భవిష్యా ధార్మికాశ్చయే
యేషాం పర్యాయకాలేతు భూమిరాన్ధ్రాన్ గమిష్యతి' —
శ్లో. 36; అ. 271

'కాణ్వాయనాస్తతో భూపాః సుశర్మాణః ప్రసహ్యతాన్
శుఙ్గానాంచైవ యచ్ఛేషం క్షపిత్వాతు బలీయసః
శిశుకోన్ధ్రః సజాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరామ్

త్రయోవింశత్ సమా రాజా శిశుకస్తు భవిష్యతి' –
శ్లో॥లు 1; 2; అ. 272

'పులోమా సప్తవర్షాణి అన్యస్తేషాం భవిష్యతి
'ఏకోనవింశతిర్హ్యేతే ఆన్ధ్రా భోక్ష్యన్తి వై మహీమ్' –
శ్లో. 16, అ. 272

ఇందు కాంవపర్యాయమున భూమి ఆంధ్రుఁడు పొందునని, కాణ్వాయనరాజు సుశర్మను ఒణచివేసి, శుంగుల శేషమును నాశనముచేసి, ఆంధ్రుడైన శిశుకుడు జాతీయులలో కూడి పొందునని, ఈ ముప్పదిమంది ఆంధ్రులు పాలింతురని కలదు. కాబట్టి – శాతవాహనులు – ఆంధ్రులనియే కాని, ఆంధ్రభృత్యులని మత్స్య పురాణమున లేదని స్పష్టము.

వాయుపురాణమున ఆంధ్రజాతీయులు అని, ఆంధ్రులు అని కలదు.

'కాణ్వాయన మథోద్ధృత్య సుశర్మాణం ప్రసహ్యతమ్ '
శృఙ్గాణాం చాపి యచ్ఛిష్టం క్షయయిత్వా బలంతదా
సిన్ధుకోహ్యన్ధ్ర జాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరామ్'
శ్లో. 342, అ. 37

'పులోవాపి సమాః సప్త అన్యేషాం భవిష్యతి
ఇత్యేతే వై నృపాం స్త్రింశ దన్ధ్రా భోక్ష్యన్తి మహీమ్'
శ్లో. 351, అ. 37, ఉత్తరార్ధమ్

ఇందు కాంత్యాయనుని ఉద్ధరించి, సుశర్మను ఒణచివేసి, శృంగుల శేషమును నాశనముచేసి, ఆంధ్ర జాతీయుడైన సింధుకుడు పొందునని, మొత్తము కూడ ముప్పదిమంది ఆంధ్రులు పాలింతురని కలదు. కాబట్టి – శాతవాహనులు ఆంధ్రులనియే కాని, ఆంధ్ర భృత్యులని వాయుపురాణమున లేదని స్పష్టము. ఇట 'కాణ్వాయన మథోద్ధృత్య' కంటె 'కాణ్వాయనం తతో భృత్యః' సరియైన పాఠము (పార్జిటరు పాఠము) ఈ పాఠమున సింధుకుడు కాణ్వభృత్యుడు.

ఇట్లు శాతవాహనులు ఆంధ్రుల. వాయు, మత్స్య, విష్ణు, బ్రహ్మాండ, భాగవత, భవిష్యోత్తర పురాణములందు కలదు. ఇతర పురాణములందు మృగ్యము. అయినను శాతవాహనులు ఆంధ్రభృత్యులని పురాణము లందు కలదని పునరుద్ఘాటించుట కేవలము పూర్వాభిప్రాయ పునస్మరణము. పూర్వాభిప్రాయము భ్రాంతి మూలకము

శాతవాహనులు కాని అభీర ప్రభృతులు ఆంధ్ర భృత్యులని విష్ణుపురాణమున కలదు

ఆ శ్లోక మిది –

'ఆన్ధ్రభృత్యా స్సప్తాభీర ప్రభృతయః
దశగర్దభినశ్చ భూభుజో భవిష్యతి' –
శ్లో. 51, అం. 4, అ. 24

ఇందు 'ఆన్ధ్రభృత్యాః' అను మాట కలదు. అది పూర్వశ్లోకమును పురస్కరించునది కాదు. ప్రత్యేక వివక్షయును కాదు. అయిన సంఖ్యా నిర్దేశము ఉండును. కాని లేదు. కాబట్టి సప్తాభీర ప్రభృతులు ఆంధ్ర భృత్యులని స్పష్టము. శాతవాహనులు ఆంధ్రు లయిన వదనంతర పాలకులు తద్భృత్యులైన, ఆంధ్రభృత్యు లగుట నిరాఘాటము.

ఇదే విషయము బ్రహ్మాండ పురాణమున ఇంకొక విధముగ కలదు.

'ఆన్ధ్రాణాం సంస్థితాః పఞ్చతేషాం వంశ్యాశ్చ యే పునః
సప్తైవతు భవిష్యన్తి దశాభీరాస్తతో నృపాః
సప్త గర్దభినశ్చాపి తతో థ దశవై శకాః'
— శ్లో. 171, అ. 74, ఉ. పా.

ఇందు ఎవరో చెప్పని ఏడుగురు ఆంధ్రవంశీయులని కలదు.

ఇదే విషయము వాయుపురాణమున ఇట్లే కలదు.
'ఆన్ధ్రాణాం సంస్థితాః పఞ్చతేషాం వంశాః సమాః పునః
సప్తైవతు భవిష్యన్తి దశాభీరాస్తతో నృపాః
సప్త గర్దభినశ్చాపి తతో థ దశవై శకాః''
శ్లో॥లు 352, 353; అ. 37, ఉ. అ.

ఇందుఎవరో చెప్పని ఏడుగురు ఆంధ్రవంశీయులని కలదు.

ఇదే విషయము మత్స్యపురాణమున ఇంచుక భేదమున కలదు.

'అన్ధ్రాణాం సంస్థితా రాజ్యే తేషాం భృత్యాన్వయే నృపాః
సప్తైవాన్ధ్రా భవిష్యన్తి దశాభీరా స్తథా నృపాః
సప్తగర్ద భలశ్చాపి శకాశ్చాష్ట దశైవతు'

శ్లో॥లు 17, 18; అ 272. ఇందు ఎవరో చెప్పని ఏడుగురు ఆంధ్రులు, ఆంధ్రుల యొక్క భృత్యులని కలదు. అంతే కాదు. 'ఆన్ధ్రాణాం.. తేషాం భృత్యాన్వయే' అనగా ఆంధ్రుల యొక్క భృత్యాన్వయము నందని సమాసరహితముగ స్పష్టముగ కలదు. కాబట్టి విష్ణుపురాణములోని ఆంధ్రభృత్య పదబంధము, విశేషణ పూర్వపద కర్మధారయ సమాసము, విశేషణోత్తరపద కర్మధారయ సమాసము కాక కేవలము షష్ఠీతత్పురుష సమాసమని మత్స్యపురాణమునుబట్టి నిర్ధారకము.

విష్ణుపురాణములోని సప్తాభీర ప్రభృతులు పదివది బ్రహ్మాండ, వాయు, మత్స్యపురాణములందు దశాభీరులయిరి. దశగర్దభినులు సప్తగర్దభినులయిరి.

ఇక భవిష్యోత్తరపురాణమున ఇతోధిక విశేషము కలదు.

తేషాంతు సంస్థితే రాజ్యే భూమిర్గుప్తాన్ గమిష్యతి
శ్రీ పర్వతీయాన్ధ్రభృత్యా ఇత్యాఖ్యాం యాన్తియే నృపాః'

ఇందు శాతవాహనుల తదుపరి భూమి గుప్తులను పొందునని, వారు శ్రీపర్వతీయాంధ్ర భృత్యులని వ్యవహరింపబడుదురని స్పష్టము.

కాబట్టి విష్ణుపురాణములోని సప్తాభీర ప్రభృతులు, అనగా వాయు, మత్స్య, బ్రహ్మాండ పురాణములలోని దశాభీరులు ఆంధ్ర భృత్యులని, భవిష్యోత్తర పురాణమును బట్టి గుప్తులు శ్రీపర్వతీయాంధ్రభృత్యులని నిర్ధారకము.

ఇంతకు శాతవాహనులు ఆంధ్రులని ఇదమిత్థము.

కాని శాతవాహనులు ఆంధ్రులని శాసనములందు లేదు. అంతేకాదు. మరొకరని కూడా శాసనము లందులేదు. పురాణములు స్వతః ప్రమాణములు కానిమాట నిజము. అయినను శాసన ప్రమాణాభావమున ఆరు పురాణముల ఏకగ్రీవాభిప్రాయము పూత్కార యోగ్యము కాదు. ఆమోదయోగ్యమే అనగా శాతవాహనులు ఆంధ్రులే. 'పదారణాల' ఆంధ్రులే.

అయితే శాతవాహనుల కులము మరొక అవాంతర సమస్య.

అసలు శాతవాహనులకు ఆదిమ పురుషుడు శిముక శాతవాహనుడు. లేక శిముక శాతకర్ణి. అతని సోదరుడు కృష్ణుడు లేక కృష్ణశ్రీ శాతకర్ణి. ఇతని శాసనమున ఇతడు శాతవాహన కులమున పుట్టినట్లు కలదు. ఆ శాసన మిది. 5

## ప్రాకృతము :

'1. సాదవాహనకు [లే] కన్హే రాజాని నాసికకేన
2. సమణేన మహామాతేణ లేణా కారిత'

## సంస్కృతచ్ఛాయ :

'శాతవాహనకులే కృష్ణో రాజాని నాసికకేన
శ్రమణేన మహామాత్రేణ లయనం కారితమ్'

ఇట 'శాతవాహనకులే కృష్ణో రాజాని' అనగా 'శాతవాహన కులజస్య కృష్ణస్య రాజత్వకాలే' అని డాక్టర్ డి. సి. సర్కార్ అర్థ వివరణము.[6] అనగా కృష్ణుడు శాతవాహన కులజుడని స్పష్టము. కాబట్టి కృష్ణశ్రీ శాతకర్ణి శాతవాహన కులమున జన్మించినట్లు నిర్ధారకము. ఇక వాసిష్ఠీపుత్త్రపులుమావి నాసిక శాసనమున గౌతమీపుత్రశాతకర్ణికి;

## ప్రాకృతము :

'సాతవాహనకుల యసపతిథాపన కరస'

## సంస్కృతచ్ఛాయ :

'శాతవాహన కుల యశః ప్రతిష్ఠాపనకరస్య'

అను విశేషణము కలదు.[7] అనగా గౌతమీపుత్రశాతకర్ణి శాతవాహన కులయశః ప్రతిష్ఠాపకుడని అర్థము. కులయశః ప్రతిష్ఠాపనము స్వకులవిషయము కాని, అన్యకుల విశేషము కాదు. కాబట్టి కృష్ణశ్రీ శాతకర్ణి శాతవాహన కులమున జన్మించినట్లును, ఆ కులమునందే పుట్టిన గౌతమీపుత్రశాతకర్ణి స్వకులమైన శాతవాహన కులమునకు యశఃప్రతిష్ఠాపనము చేసినట్లును శాసన ప్రమాణము కల శాతవాహనుల కులము శాతవాహన కులమని నిర్ధారకము

మఱి, శాతవాహన కులము క్షత్త్రియకులమా ? బ్రాహ్మణ కులమా ? అన్నది మఱొక ఉత్థాపిత సమస్య

అసలు శాతవాహన కులము క్షత్త్రియకులమని అందిచ్చిన వారు ప్రొఫెసర్ డి. ఆర్. భండార్కర్‌గారు.[8] బ్రాహ్మణ కులమని ప్రథమతః అందిచ్చినవారు కె పి. జయస్వాల్‌గారు, ప్రొఫెసర్ హెచ్. పి. రాయ్‌చౌదురిగారును.[9] తదుపరి అందిచ్చినవారు శ్రీ జోగేంద్రచంద్రఘోష్‌గారు.[10] ఆమీద నందిచ్చినవారు ప్రొఫెసర్ ఓరుగంటి రామచంద్రయ్యగారు.[11] కారణము, వాసిష్ఠీపుత్త్ర పులుమావి నాసిక శాసనమున గౌతమీపుత్త్ర శాతకర్ణి ఏకబ్రాహ్మణుడని ఉండుట మాత్రమే. అంతేకాదు. ద్వాత్రింశత్ పుత్తళిక అను ఒక అర్వాచీన గ్రంథమున శాతవాహనుడు బ్రాహ్మణుడని ఉండుట కూడ ద్వాత్రింశత్ పుత్తళిక అన సింహాసనద్వాత్రింశిక. అది కట్టుకథల పుట్ట. అట్టి గ్రంథమును పట్టికొని ఇట్టి నిర్ణయము చేయుట చారిత్రిక పద్ధతికే విరుద్ధము

మఱి వాసిష్ఠీపుత్త్రశాతకర్ణి నాసిక శాసనమున గౌతమీపుత్త్ర శాతకర్ణికి –

## ప్రాకృతము :

'ఏక బమ్హణస'

## సంస్కృతచ్ఛాయ :

'ఏక బ్రాహ్మణస్య (యద్వా బ్రహ్మరాయస్య)'

అను విశేషణము కలదు.[12] ఇందు వాచకమును వదలిన, గౌతమీపుత్త్రశాతకర్ణి ఏక బ్రాహ్మణుడగును. గౌతమీపుత్త్ర శాతకర్ణి 'ఖతియదపమాన మదన' అనగా క్షత్రియ దర్పమాన మర్దనుడని అదే శాసనమున కలదు. ఈ రెండు విశేషణములనుబట్టి గౌతమీపుత్త్ర శాతకర్ణి పరశురాముని వంటి బ్రాహ్మణుడని కల్పనము ! పరశురాముడు 'ముయ్యేడు మారులు శత్రువులైన క్షత్త్రియులను చంపిన' వాడు. గౌతమీపుత్త్ర శాతకర్ణి శత్రువులైన క్షత్త్రియుల దర్పమును, అభిమానమును అణచినవాడు. మానదర్ప మర్దనము మారణహోమము సమానముకాదు. కాబట్టి గౌతమీపుత్త్ర శాతకర్ణి పరశురాముని వంటి బ్రాహ్మణుడు కానక్కఱలేదని స్పష్టము.

ఇక 'ఏక బ్రాహ్మణుడు' బ్రాహ్మణకులస్థుడైనచో, దేవ బ్రాహ్మణుడు విశ్వబ్రాహ్మణుడు బ్రాహ్మణకులస్థు లగుదురు. విశ్వ, దేవ శబ్దముల వలె 'ఏక' శబ్దమును గమనార్హము. అది విశేషణము విశేషణము నిరర్థకము కాదు. ప్రత్యేకార్థ ప్రతిపాదకము. అతడు ఒక్కడే బ్రాహ్మణ కులస్థుడు అని ఏవార్థము చెప్పి ఇతరులు బ్రాహ్మణ కులస్థులు కారని. గొప్ప బ్రాహ్మణ కులస్థుడని మహార్థము చెప్పిన కొందఱు అల్పబ్రాహ్మణకులస్థులని విపరీతార్థములు స్ఫురించును ధ్వనించును. కనుక అది కాదు అర్థము. ప్రకృత శాసనమున ఏకబ్రాహ్మణ పదబంధముతోపాటు, ఏకశబ్ద విశేషణములు కల పదబంధములు ఇంకను అదే పంక్తిలో అగ్రశ్రేణిని కలవు. తదితర స్థలములందు ఏకశబ్దము వలన ఏది అర్థమో, ప్రకృత స్థలము నందును ప్రత్యేకార్థ మదియే అగును. ప్రకరణమును వదలిన ప్రత్యేకార్థమే కాదు; సామాన్యార్థమును సాక్షాత్కారము కాదు. ఆ ప్రకరణ మిది.[13]

## ప్రాకృతము :

'ఏక కుసస ఏకధనుధరస ఏకసూరస ఏకబమ్హణస'

## సంస్కృతచ్ఛాయ :

'ఏకాంకుశస్య ఏక ధనుర్ధరస్య ఏక శూరస్య ఏకబ్రాహ్మణస్య'

ఇందు గౌతమీపుత్త్ర శాతకర్ణి ఏకాంకుశుడు, ఏకధనుర్ధరుడు, ఏకశూరుడు, ఏక బ్రాహ్మణుడు అని నాల్గు విశేషణములు కలవు నాలుగు స్థలము లందును ఒకేపంక్తిలో 'ఏక' శబ్దము విశేషణముగ కలదు. గౌతమీపుత్ర శాతకర్ణి ఏకాంకుశుడు. సాధారణముగ పాలకులు నిరంకుశులు సాంకుశులు కారు. అయినను గౌతమీపుత్త్ర శాతకర్ణి ఏకాంకుశుడు. ఏకాంకుశుడు అనగా ఒక టే అంకుశము కలవాడని అర్థము చెప్పవచ్చును. అట్లు చెప్పిన మహారాజైన గౌతమీపుత్త్ర శాతకర్ణి మావటీనివలె అంకుశధారి అగును. అదొక ప్రత్యేక చిహ్నమనుటకైన ఆధారములేదు. ప్రతిబంధకమనుట ప్రకరణోచితము కాదు. ఇవియెల్ల విపరీతార్థములు. అంకుశము మావటీని ఆయుధము అథవా సాధనము. ఎందుకు ? మత్త చలచిత్తమైన మత్తేభము మత్తు వదలించుటకు. స్వాధీనము చేసికొనుటకు. అట్లు మత్తచలచిత్తమైన శత్రువర్గము మత్తు వదలించుటకు, స్వాధీనము చేసికొనుటకు మహారాజునకు ఆయుధము లేక సాధనము అధికారము. అంకుశ శబ్దమునకు అభిధార్థము కాక ఔపచారికార్థము అధికారమని నిష్పన్నమగును. కనుక గౌతమీ పుత్త్రశాతకర్ణి ఏకాంకుశుడన మహాంకుశుడు అనగా మహాధికారి అని తాత్పర్యము అదే శాసనమున గౌతమీ పుత్త్రశాతకర్ణి సర్వరాజలోకమండల ప్రతిగ్రహీత శాసనుడ'ని ముందే కలదు. అతడు మహాధికారి అయిననే ఇది సాధ్యము. ఇక ఏక ధనుర్ధరుడన మహాధనుర్ధరుడని, ఏకశూరుడన మహాశూరుడని స్పష్టము. ఇట 'జగదేక సుందరి' అనుసంధేయము. అట్లు ఏక బ్రాహ్మణుడన మహాబ్రాహ్మణుడని అర్థము. అధికారిత్వము, ధనుర్ధరత్వము, శూరత్వము వలె బ్రాహ్మణత్వము గుణము. కులము కాదు. గుణవాచకమైన బ్రాహ్మణ శబ్దమునకు బ్రాహ్మణ మతమని అర్థము. శాతవాహనులు బౌద్ధమతమును ఆదరించినను, బౌద్ధవిహారములు నిర్మించినను, బౌద్ధులకు దానములు చేసినను బౌద్ధమతస్థులు కారు. అయిన శ్రీ శాతకర్ణి భార్య నాగానిక 'దీర్ఘవ్రతయజ్ఞదీక్షిత, అగుట, భూరిదక్షిణ లొసగుట, నానాఘాట్ శాసనమును ప్రకటించుట పొసగదు. శ్రీశాతకర్ణి అశ్వమేధ రాజసూయాది యాగములు చేయుట కుదురదు. అంతేకాదు. వాసిష్ఠీ పుత్త్రపులుమావి నాసికశాసనము నందే గౌతమీపుత్త్ర శాతకర్ణికి —

'వినివతిత చాతువణ సంకరస'

అను విశేషణము కలదు. అనగా వినివర్తిత చాతుర్వర్ణ్య సంకరుడు. చాతుర్వర్ణ్య సాంకర్యమును తొలగించినవాడని అర్థము. మఱి చాతుర్వర్ణ్యసాంకర్య వినివర్తనము బౌద్ధమత ధర్మము కాదు. బ్రాహ్మణ మత ధర్మము. అనగా గౌతమీపుత్త్ర శాతకర్ణి బ్రాహ్మణ మతస్థుడని నిర్ధారకము. వేదమతమునకు వైదిక మతమను వ్యవహారము ఆధునికము. బ్రాహ్మణ మతమను వ్యవహారము ప్రాచీనము. శాతవాహనులకు సమీప పూర్వకాలము లోని, ఆసేతు హిమాచల పరివ్యాప్తమైన అశోకుని ధర్మశాసనము లందు బ్రాహ్మణ శబ్దము ఏతదర్థమున బహుధా ప్రయుక్తము. ఒక నిర్ధారక ప్రయోగమిది [14] —

## ప్రాకృతము :

'యే తత్ర వసతి బ్రహ్మణ శ్రమణవ అ[ ] జేవ ప్రషండవ'

## సంస్కృతచ్ఛాయ :

'యేతత్ర వసన్తి బ్రాహ్మణాః వా శ్రమణాః వా అన్యేవా పాషణ్డాః వా' ఇందు 'బ్రాహ్మణులు కాని, శ్రమణులు కాని, ఇతరులు కాని, పాషండులు కాని అక్కడ నివసించుచున్నట్లు' కలదు. అనగా బ్రాహ్మణ కులస్థులు, శ్రమణ కులస్థులు, ఇతర కులస్థులు, పాషండ అని కాదు కదా అర్థము! బ్రాహ్మణ మతస్థులు, బౌద్ధమతస్థులు, ఇతర మతస్థులు, పాషండ మతస్థులు అనియే అర్థము. కాబట్టి బ్రాహ్మణ శబ్దము వైదిక మతమునకు వాచకముగ శాతవాహనులకు ముందే కలదని స్పష్టము. అందువలన గౌతమీపుత్త్ర శాతకర్ణి ఏకబ్రాహ్మణుడనగా మహా బ్రాహ్మణ మతస్థుడనిఅర్థము. ఇది ప్రకరణోచితము. ఒక్క గౌతమీపుత్త్ర శాతకర్ణియే కాదు; శాతవాహను లందఱును మహాబ్రాహ్మణ మతస్థులని శాతవాహనుల శాసనములనుబట్టి నిర్ధారకము.

శాతవాహనులు మహాబ్రాహ్మణమతస్థులు కనుక స్త్రీలకు సహితము గౌతమి, వాసిష్ఠి వంటి ఆర్షనామములు కలవు.

ఇక వాసిష్ఠీ పుత్త్ర పులుమావి నాసిక శాసనమున గౌతమీ పుత్త్ర శాతకర్ణి తల్లి గౌతమీబాలశ్రీ గురించి ఇట్లు కలదు.[15]

## ప్రాకృతము :

'రాజరిసి వధు సద మఖిల మను విధియ మానాయ'

## సంస్కృతచ్ఛాయ :

'రాజర్షి వధూ శబ్ద మఖిల మను విదధిత్వా'

ఇందు గౌతమీబాలశ్రీ రాజర్షి వధూశబ్దయోగ్యురాలని స్పష్టము. అనగా గౌతమీ బాలశ్రీ భర్త, గౌతమీపుత్త్ర శాతకర్ణి తండ్రి రాజర్షి అని సుస్పష్టము. విశ్వామిత్రుడు రాజర్షి. వసిష్ఠుడు బ్రహ్మర్షి. వశిష్ఠుడు బ్రాహ్మణ కులస్థుడు కనుక బ్రహ్మర్షి.

విశ్వామిత్రుడు క్షత్త్రియ కులస్థుడు కనుక రాజర్షి. అట్లు గౌతమీపుత్త్రశాతకర్ణి తండ్రి క్షత్త్రియ కులస్థుడయిన రాజర్షి అగును. కనుక శాతవాహనులు క్షత్త్రియులు అని భ్రాంతి కలుగుటకు అవకాశము కలదు. కాని పాలకత్వముచేత రాజు అయిన వాడును ఋషి అయిన, రాజర్షి కాగలడు. కాబట్టి శాతవాహనులు క్షత్త్రియులు కావలసిన ఆవశ్యకము లేదు.

మరి, వాసిష్ఠీపుత్త్రపులుమావి నాసికశాసనమున గౌతమీ పుత్త్రశాతకర్ణికి సాదృశ్య కల్పనములు కలవు.[16]

## ప్రాకృతము :

'రామకేసవాజున భీమసేన తుల పరకమస'

'నాభాగ నహుస జ న మే జ య సకర యఃయాః తి రామాబరీసతేజస'

## సంస్కృతచ్ఛాయ :

'రామకేశవార్జున భీమసేన తుల్యపరాక్రమస్య'

'నాభాగ నహుష జనమేజయ సగర యయాతి రామాంబరీష సమతేజస్య'

ఇందు గౌతమీపుత్త్రశాతకర్ణి రామకేశవార్జున భీమసేన తుల్య పరాక్రముడని, నాభాగ నహుష జనమేజయ సగర యయాతి రామాంబరీష సమతేజస్వి అని స్పష్టము. రామకేశవుల బలరామ కృష్ణులు. నాభాగాద్యంబరీషులమధ్యరాముడు శ్రీరాముడు. బలరాముడు పరాక్రమహీనుడు, శ్రీరాముడు తేజోరహితు కారు బలరామ కృష్ణార్జున భీమసేనులు, నాభాగ నహుష జనమేజయ సగర యయాతి శ్రీరామాంబరీషులు క్షత్త్రియులు. కనుక శాతవాహనులు క్షత్రియులను భ్రాంతి బలపడుటకు అవకాశము కలదు. కాని అక్షత్త్రియులైనరాజులకుక్షత్త్రియులతోడిసాదృశ్యము విపరీతము కాదు. బ్రాహ్మణకులస్థులకు మాత్రము క్షత్రియులతోడిసాదృశ్యము విపరీతము. గౌతమీపుత్త్ర శాతకర్ణి బ్రాహ్మణ కులస్థుడైనచో, ద్రోణాశ్వత్థామ పరశురామ సాదృశ్యము సాపేక్ష్యము. అది పక్కృతి శాసనమునలేదు. ఇతర శాసనము లేదు. పదమామే శాతవాహనులు బ్రాహ్మణ కులస్థులు కారనుటకు భంగ్యంతర సాధనము.

ఇక భాగవతమున బలి వృషలుడని కలదు. ఆ శ్లోకము పూర్వోదాహృతము. ఒక భాగవతమునందేకాదు; బలవంతుడైన శిముకుడు వృషలుడని భవిష్యోత్తర పురాణమునందును కలదు.

'సింహకస్వాతి కర్ణాఖ్యః శిముకో వృషలో బలీ'

ఇందు సింహకస్వాతికర్ణుడు పేరిటి శిముకుడు బలవంతుడు. వృషలుడు అని స్పష్టము. వృషలు డనగా శూద్రుడు వృషల శబ్దము సంజ్ఞావాచకముకాదు. కులవాచకము. 'శూద్రాశ్చావర వర్ణాశ్చ వృషలాశ్చ జఘన్యజాః' అని అమరము. 'శూద్రులు రాజులు కాగలరు కాని బ్రాహ్మణులు కాలేరు. శూద్రరాజులకు మౌర్యచంద్ర గుప్తుడు ప్రథమోదాహరణము. చంద్రగుప్తుని రాజ్యస్థీకరణమును అధికరించు విశాఖదత్తుని ముద్రారాక్షస నాటకమున అమాత్య శేఖరుడైన చాణక్యుడు రాజైన చంద్రగుప్తుని ప్రత్యక్షమున, పరోక్షమున వృషలుడని వ్యవహరించుట ప్రసిద్ధము.

'సోఽహ మిదానీ మవసిత ప్రతిజ్ఞాభారోఽపి వృషలాపేక్షయా శస్త్రం ధారయామి.' ఇది చాణక్యుని స్వగతము.

'యథా వృషలః సమాజ్ఞాపయతి'

ఇది శిష్యునితోడి చాణక్యుని సంభాషణము.

'అయే సింహాసన మధ్యాస్తే వృషలః సాధు సాధు విజయతాం వృషలః'.

ఇది సింహాసనమును అధిష్ఠించిన చంద్రగుప్తునికి ఆర్యచాణక్యుని లశీర్వచనము.

వృషలుడైన చంద్రగుప్తుడు ఒక గ్రామాధికారి అయిన మయూర పోషకుని దౌహిత్రుడని జైనుల పరిశిష్టపర్వమున, క్షత్రియుడని బౌద్ధుల మహాపరినిర్వాణ సూత్రమున, శూద్రుడని, నందరాజునకు మురఅను శూద్ర స్త్రీ యందు జన్మించినవాడని బ్రాహ్మణుల పురాణ గ్రంథమున కలదు.[17] క్షత్రియునికి శూద్ర స్త్రీ యందు జన్మించినవాడు ఉగ్రుడని అమరము. 'శూద్రా క్షత్త్రియయోరుగ్రః'. చంద్రగుప్తుడు వృషలుడనియే కాని, ఉగ్రుడని ముద్రారాక్షసమునలేదు. కాబట్టి చంద్రగుప్తుడు క్షత్రియునికి శూద్ర స్త్రీయందు జన్మించినవాడు కాడు అని చెప్పి వృషలుడు క్షత్రియుడు కాలేడు. కాబట్టి చంద్రగుప్తుడు శూద్రుడు. అటులే వృషలశబ్ద వ్యవహృతులైన శాతవాహనులు శూద్రులు.

అయిన శూద్రులకు యజ్ఞాధికారము కలదా? అను ధర్మ సందేహము కలుగుటకు అవకాశము కాలమహిమవలబట్టి కలదు. ఒక్క శూద్రులకు మాత్రమేకాదు; సర్వవర్ణములకు సర్వ యజ్ఞాధి

కారము కలదని మాత్రమేకాక, విధాయకమని వేదవ్యాసకృతమైన, పంచమవేదమైన మహాభారతమున కలదు.

'యతోహి సర్వవర్ణానాం యజ్ఞస్తస్యైవ భారత
అగ్రే సర్వేషు యజ్ఞేషు శ్రద్ధా యజ్ఞో విధీ తే'—
శ్లో. 40, అ 60, శాం. ప.

ఇందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవర్ణములకువలె సర్వవర్ణములకు యజ్ఞాధికారము కలదని స్పష్టము. కాని శ్రుతిలో శూద్రో యజ్ఞేన విక్లిప్త' అని కలదని అశంకించుకొని, సర్వవర్ణము లనగా బ్రహ్మ క్షత్రియ వైశ, త్రివర్ణములని అర్వాచీనుడైన నీలకంఠ దీక్షితుని వ్యాఖ్యానము. ఆయన వ్యాఖ్యానము 'తస్యైవ' అను వేదవ్యాసుని విపక్ష అంతర్ధానమైనది. ప్రత్యంతరములందు పాఠాంతరముస్తమైనది. అతఃపూర్వుడైన తిక్కన ఆంధ్రీకరణ మును మూలచ్ఛేదము. ప్రకరణవిరుద్ధము.

'ఈ మూడు వర్ణములకును
దా మంచిగ పనులుసేత ధర్మువు కురుధా
త్రి మహేశ్వర శూద్రున
కా మెయి జీవనము వాని కజుఁడు విధించెన్'
ప. 226, ఆ. 2, శాం. ప.

ఇందు మూడు వర్ణములకు పనులుసేయు జీవనమును శూద్రునకు బ్రహ్మ విధించెనని స్పష్టము. అని బ్రహ్మ విధించెనో వేదో భగవంతునికి తెలియవలయును కాని ఇట విరించి బ్రహ్మ విధించుట మాత్రము కరతలామలకము. అర్వాచీనుడైన నీలకంఠ దీక్షితుని కంటె, వ్యాసునాదికుడైన తిక్కనకంటె, అసలు మహాభారత సృష్టికర్త మాత్రమే కాక, వేద విభాగము చేసిన వ్యాసుడు ప్రమాణము. మహాభారత కథాకాలముకంటె ముందే అతి ప్రాచీన కాలమున శూద్రుడైన పైజవనుడు యజ్ఞము చేసినట్లు వ్యాస ప్రోక్తము.

'శూద్రః పైజవనోనామ సహస్రాణాం శతం దదౌ
ఐన్ద్రాగ్నేన విధానేన దక్షిణామితి నః శ్రుతమ్'
శ్లో. 39, అ. 60 శాం. ప.

ఇట ప్రత్యంతరమున శ్లోకాంతరము కలదు.

'పైజవనామ శూద్రః పాకయజ్ఞేన
ఇష్టవాన్ బహుదానం చ దదౌ'

ఇందు శూద్రుడైన పైజవనుడు ఐంద్రాగ్న్య విధానమున శత సహస్ర దక్షిణ లొసగుట యజ్ఞ విషయము. శ్లోకాంతరము పైజవనుడు చేసిన పాకయజ్ఞము కాల్పనిక సంప్రాప్తము. అట్టి 'ఇష్టవాన్' అనగా యజ్ఞము చేసినవాని అర్థము. ఇటు తిక్కన మూగనోము, నీలకంఠదీక్షితుని మూలచ్ఛేద పాండిత్య ప్రసార ఆహోపురుషి వ్యవహార్యము. ఈ మిట్టమెల్ల నాంధ్రకరించుట తిక్కన వెనుకసేతకు తీరని లోపము. అంతేకాదు. ధర్మవిచికిత్సకు అప్రమాణము. నీలకంఠదీక్షితుని వ్యాఖ్యానము అంతే. అసలు వేదములందు వర్ణభేదములేదని చారిత్రికాభిప్రాయము.[18]

'బ్రాహ్మణాది వర్ణభేదము ఋగ్వేదములో నొక్క 'పురుష సూక్త'మునందు మాత్రము పేర్కొనబడి యున్నది. ఈ పురుషసూక్తము ఋగ్వేదముయొక్క పదవ మండలము లోని తొంబదవ సూక్తము. ఇది శుక్ల యజుర్వేద వాజస నేయ సంహిత: ౩౧ ౧ ౧౬ లోను, కృష్ణయజుర్వేదా రాణ్యకము : చిత్తి : లోను, అధర్వవేదము : ౧౯—౬ : లోను కూడ కొంత మార్పుతో గనబడుచున్నవి... ఇందలి భాషాభేదము మొదలయిన వానినిబట్టి వేద వేదార్థములను నిపుణముగా పరిశీలించి వారీ పురుషసూక్తము ఋగ్వేదము లోని పురాతన సూక్తములకంటె చిరకాలమునకు తరువాత చేయబడినదని సహేతుకముగా నిర్ణయించియున్నారు' అని కీ. శే. కందుకూరి వీరేశలింగముగారు తెలిపిన సంగతి. అంతేకాదు—

'కాన : వేద : యుగములు ప్రవృత్తిని బట్టి గాని జన్మమును బట్టిగాని వర్ణవ్యవస్థ లేదనుటయే నిశ్చితము ఇటులే జాతు లాయుగము లేక అర్వాతిః బుట్టినవని విష్ణుపురాణము, వాయుపురాణము, హరివంశము అను పురాణములు గూడ జెప్పుచున్నవి. కాని జాతుర్వర్ణ్య వ్యవస్థ మధ్య బుట్టినదని చెప్పెడిమాట క్రొత్తగాదు. పురాణ కారులు కూడ నొప్పుకొన్న విషయమే'.

అని కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు వివరించిన విషయము.[19] వేదకాలమున వర్ణవ్యవస్థయే లేదు కాబట్టి, నీలకంఠ దీక్షితుని లంకకు కాలదోషము పట్టిన కల్పనమని స్పష్టము. వర్ణవ్యవస్థ వ్యవస్థితమైన కాలమున వ్యాసభగవానుని మహాభారతమే ప్రమాణము.

ఇంతేకా మహాభారత గ్రంథమున మాత్రమేకాదు; మహా భారతదేశమున సహితము మహాయజ్ఞములు చేసిన శూద్రులు చరిత్రలోనే కలరు. శాతవాహనుల అనంతరము ఇక్ష్వాకుల అశ్వమేధయాగ పర్యాకము చిమిదాంతికుడు [20] అనగా అశ్వమేధ యాగము చేసెనని అర్థము. అతడు శూద్రుడు.[21] అర్వాచీన కాలమున ప్రోలయ వేమారెడ్డి అనవరత పురోహితర్వాని సామపాన బిరుదాంకితుడు.[22] అనగా అనేక యజ్ఞములు చేసెను తాత్పర్యము. ఇతడు శూద్రుడు. ఇట్లు శూద్రస్త్రీ అయిన నాగానిక దీర్ఘ వ్రత యజ్ఞ దీక్షిత అగుట, శూద్రుడైన శ్రీశాతకర్ణి అశ్వమేధ రాజ సూయాది యాగములు సేయుట నిరాక్షేపము. కాబట్టి శాత వాహనులు శూద్రులనుట నిర్బాధకము. అని నా సిద్ధాంతము.

పురాణములనుబట్టి శాతవాహనులు ఆంధ్రులని పురణించు చున్నది. ఆ పురాణములను బట్టియే శాతవాహనులు శూద్రులని అంగీకరింపవలయును లేనిచో అర్ధజరతీన్యాయదోషదుష్టమగును. అంతేకాదు. వాశిష్ఠీపుత్ర పులుమావి నాసిక శాసనమున కుంవారిక బ్రాహ్మణ శబ్దము లేదు. కులబోధక క్షత్రియశబ్దములేదు. క్షత్రియమానదర్ప మర్దనము క్షత్రియత్వమునకు భంజకము కాదు గాని, శూద్రత్వమునకు వ్యంజకము. కాబట్టి శాసనావరాణము

బట్టి, భాగవత భవిష్యోత్తర పురాణములనుబట్టి, సూర్య చంద్ర సంబంధము, కాని, సూత్ర గోత్ర సంపర్కము కాని, లేని శాత వాహన కులము శూద్రకులమని స్పష్టము.

అసలు శాతవాహన శబ్దమునకు అర్థము బహు విధములుగ చెప్పట కలదు. నూరు ఏనుగులు లేక గుఱ్ఱములు కలవారని కల్పన సేయవచ్చును. జవనాశ్వములు కలవారని కూడా కవిత్వము చెప్పవచ్చును. ముండభాషలో సద అనగా గుఱ్ఱము, కోన్ అనగా కొడుకు అని కలదని అశ్వపుత్రుడని కథ కట్టవచ్చును. శాతవాహనుల నాణెముల మీద గుఱ్ఱము కలదని కథను రక్తి కట్టించవచ్చును. ఏవం విధమైన గీర్వాణ గిరాంధురంధరతలు, ద్రావిడ ప్రాణాయామములు నిరాలంబనప్రక్రియలు. నేలవిడిచిన సాములు; కసరత్తులు.అసలు శాతవాహన శబ్దము పురాణరాజనామా వళు లందు లేదు. శాతవాహనుల శాసనము లందు లేదు. పరంపరా గతమైన ప్రసిద్ధ వ్యవహారమున లేదు. ఆధునిక వ్యవహారమున మాత్రమే కలదు. ఇది గమనార్హమైన విషయము. తదుపరి ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథములందు, అర్వాచీన సంస్కృ తాంధ్ర శాసనములందు, అనూచాన సంప్రదాయము నందు శాలివాహన శబ్దము కలదు. ఇది కూడ మర్మమైన విశేషము. ఇక సిముక శాతవాహనుని నానాఘాట్ కుడ్య చిత్రమున సాతవాహన శబ్దము కలదు. కృష్ణుని నాసిక శాసనమున సాదవాహన శబ్దము కలదు. మఱల వాసిష్ఠీ పుత్త్రపులుమావి నాసికశాసనమున సాతవాహన శబ్దము కలదు శ్రీపులుమాని మేకదోని శాసనమున సాతవాహన శబ్దము కలదు. ఒకచో సాదవాహన శబ్దము, మూడు చోట్ల సాతవాహన శబ్దము కలదు. అంతేకాదు ఈ శబ్దములు కల శాసనముల భాష, ప్రాచీన మహారాష్ట్ర ప్రాకృతము. కాబట్టి సాదవాహన లేక సాతవాహన శబ్దము ప్రాచీన మహారాష్ట్ర ప్రాకృత భాషా శబ్దమని స్పష్టము. అది శాతవాహన శబ్దముగ ఆధునికముగ సంస్కృతీకరింపబడినది. ఒక భాషా పదమునకు మఱొక భాషాపదమునుబట్టి అర్థమును కల్పించుట అక్రమము. ఆ భాషా పదములను బట్టి అర్థమును నిర్ణయించుట సక్రమము. కాబట్టి ప్రాచీన మహారాష్ట్ర భాషలోని అర్థము — అనగా తజ్జన్యమైన నేటి మరాటి భాషలోని అర్థమే శాతవాహన శబ్దమునకు సరియైన అర్థము కాగలదు. నేటి మరాటి భాషలో సాద, సాత, సాతు, వాహన శబ్దములు కలవు. వాని అర్థము లివి:23

'సాద— ఏడు Seven or several

సాత—ప్రతిధ్వని An echo, a hollowing or calling to

సాతు — ధాన్యవిశేషము Barley

వాహ(ణేం) — ప్రవహించు, ప్రవహింపజేయు to flow, to ooze, to let flow

,, — విత్తనములు చల్లు : to sow : దున్ను, పండించు, వ్యవసాయముచేయు : to till

,, - to carry, to convey

,, - to blow, to move

,, - to offer, to move'

పయి అర్థ పట్టికను సరిగా పరిశీలించినచో శాతవాహన శబ్ద సంపుటికి 'ధాన్యమును పండించువారు' అని ప్రాచీన మహారాష్ట్ర ప్రాకృతభాషలో అర్థమని స్వయం వేద్యమగును. అంతేకాదు. ఇది శాలివాహన శబ్దమునకు సంవదించునది.

'శాలవాహన వంశేచ రాజానో దశ చాభవన్
రాజ్యం పఞ్చాశతాబ్దం చ కృత్వా లోకాన్తరం యయుః'
శ్లో. 1, అ 3, తృ ఖం.

అని భవిష్యత్పురాణమున ప్రయుక్తమైన శాలివాహన శబ్దము సంస్కృత భాషాపదము.

'నూనూగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి'

అని కాశీఖండమున శ్రీనాథుడు ప్రయోగించిన శాలివాహన శబ్దము ఆంధ్రభాషా పదము. అంతేకాదు. సప్తశతి సాతవాహనరాజు మహారాష్ట్ర ప్రాకృతభాషలో సంకలించిన గ్రంథము. సంస్కృత భాషలో 'శాద' శబ్దమునకు బాలతృణవిశేషమని అర్థము ఇది ప్రాకృతమున 'సాద' 'సాత' 'సాతు' అగును. శాద శబ్దమునకు శాద్వల శబ్దము జ్ఞాపిక అర్థ విపరిణామము సహజము. ఇక 'వహ ప్రాపణే' అని శబ్దరత్నావళి. వహధాతువునకు producing — అని to produce — ఉత్పత్తిసేయు అనెడి అర్థము సంస్కృత నిఘంటు సంఘటితములు. శాలి అన ధాన్యము. సుప్రసిద్ధము. కాబట్టి సంస్కృత భాషా జన్యమైన ప్రాచీన మహారాష్ట్ర ప్రాకృత భాషలో సాదవాహన లేక సాతవాహన శబ్ద సంపుటికి కల 'ధాన్యమును పండించువారు' అనెడి అర్థము. సాతవాహన శబ్దమునకు ప్రాచీన సంస్కృత రూపమైన శాలివాహన శబ్దమునకు సుసంగతము. ఇట్టి సంస్కృత భాషలోని శాలివాహన శబ్దమును శాత వాహన శబ్దమునకు ప్రాకృత రూప మనుట అవిచార మూలకము. ప్రాకృత సాతవాహన శబ్దమునకు సంస్కృత శాలివాహన శబ్దము సరియైన సంస్కృత రూపము. 'సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య భాషా పరిజ్ఞాన పాటవము' కల శ్రీనాథుడు 'శాలివాహన సప్తశతి' అనుటలోని రహస్య మిదియే. ఇట ప్రాకృతమన ప్రాచీన మహారాష్ట్ర ప్రాకృతమే. కాబట్టి శ్రీనాథుని శాలివాహన శబ్ద ప్రయోగము, శాసనములలోని, పంచాంగములలోని అనూచాన సంప్రదాయమైన శాలివాహన శక వ్యవహారము ప్రాకృత సాతవాహన శబ్దమునకు అర్థసంగతి కల సరియైన సంస్కృత రూపమని స్పష్టము. సాతవాహనులు లేక శాలివాహనులు అనగా ఆధునిక వ్యవహారములోని శాతవాహనులు ధాన్యము పండించువారు అనగా కర్షకులు అని నిష్కర్ష కల అర్థము. కర్షకులు సాధారణముగ శూద్రులు. అనగా శాతవాహనులు శూద్ర కులస్థులని, శాతవాహన కుల మనగా కృషీవల కులమని, కృషీవల కుటుంబమని నిర్ధారకము.

పం॥ పునఃపరిశీలనకు ఫలితాంశము లివి -

1. వాయు, మత్స్య, విష్ణు, బ్రహ్మాండ, భాగవత, భవిష్యోత్తర పురాణములను బట్టి – శాతవాహనులు ఆంధ్రులు.

2 భాగవత, విష్ణు, బ్రహ్మాండ, వాయు మత్స్య, భవిష్యోత్తర పురాణములను బట్టి (వరుసగ) బలి, బలిపుచ్ఛకుడు, సింధుకుడు, శిశుకుడు, సింహక స్వాతికర్ణుడు, శిముక శాతకర్ణి ఒక్కడే. అతడే శాసనములోని సిముకశాతవాహనుడు. అతడు శాతవాహనుల ఆదిమ పురుషుడు.

3. (వాయు) విష్ణు, భాగవత పురాణములనుబట్టి శాతవాహనులు కాణ్వభృత్యులు.

4. విష్ణుపురాణమును బట్టి సిద్ధాంతకముగ, వాయు, మత్స్య, బ్రహ్మాండ పురాణములనుబట్టి నిరూపకముగ, ఆభీర ప్రభృతులు మాత్రమే ఆంధ్ర భృత్యులు.

5 మత్స్య పురాణమును బట్టి ఆంధ్రభృత్య పదబంధము షష్ఠీతత్పురుష సమాసము. కాబట్టి ఆంధ్ర భృత్యులు అనగా ఆంధ్రులయొక్క భృత్యులు

6. భవిష్యోత్తర పురాణమునుబట్టి సుప్తులు శ్రీ పర్వతీయాంధ్ర భృత్యులు.

7. నాగానిక నానాఘాట్ శాసనమునుబట్టి, వాసిష్ఠీపుత్రు పులుమావి నాసిక శాసనమునుబట్టి, అశోకుని ధర్మశాసనములలోని బ్రాహ్మణ శబ్దప్రయోగ బాహుళ్యమునుబట్టి, శాతవాహనులు బ్రాహ్మణ మతస్థులు.

8. శాసనాధారమునుబట్టి, భాగవత భవిష్యోత్తర పురాణములనుబట్టి శాతవాహనులు శూద్రకులస్థులు.

9. సాతవాహన, శాలివాహన శబ్దార్థములనుబట్టి శాతవాహనులు కృషీవలులు. శాతవాహన కులమనగా కృషీవల కులము.

సమిష్టిపై శాతవాహనులు ఆంధ్రులు, బ్రాహ్మణ మతస్థులు, శూద్ర లస్థులు, కృషీవల కుటుంబులు అయిన పాలకులని సిద్ధాంతము.

# అధోజ్ఞాపికలు

1. Early History of the Deccan, pp. 40, 41.
2. ABI, 1 21 ff.
3. The Early History of Deccan, Part I–vi, p. 72
4. మత్స్యపురాణములోని 'ఆన్ధ్రాః సజాతీయాః' అను వ్యస్త పదములను 'ఆన్ధ్రసజాతీయాః' అను సమస్త పద బంధముగ గ్రహించి శాతవాహనులు ఆంధ్ర సజాతీయులని వ్రాయుట చింత్యము. అట్లు గ్రహించిన ఛందోభంగము అనగా మూలచ్ఛేదము. అంతేకాదు. 'సజాతీయాః' అనగా 'సజాతీయులతో కూడి' అని 'ఇతర సజాతీయులతో కూడి' అని వివరించుట కూడ విపరీతము: – సాతవాహన సంచిక, పు. 24: 'సజాతీయాః' అనగా జాతీయులతో కూడినవారు అనిగాని, సదృశుడైన జాతీయుడు అనిగాని మాత్రమే అర్థము. 'ఆన్ధ్రాః సజాతీయాః' అన్నస్థలమున ఆంధ్రశబ్దమే జాతివాచకము. కనుక 'సదృశమైన జాతీయుడు' అనెడి అర్థము సందర్భోచితము కాదు. 'జాతీయులతో కూడి' అనెడి అర్థమే ప్రకరణోచితము.
5. Select Inscriptions, p. 3
6 Select Inscriptions, p 3
7 Ibid, pp. 196-200
8. Epigraphia Indica, Vol xxi: pp 32-6
9. B.O.R S J. Vol. xvi pp. 265-266 & P. H. A. I. III Ed., pp. 280-1
10. Indian Culture, Vol. 5, July 1238 to April 1939; pp. 17-24
11. Journal of Indian History (Diamond Jubilee No. )
12. Select Inscriptions, pp. 196-200
13. Select Inscriptions, pp 196-200
14. Select Inscriptions, pp. 35-40
15. Select Inscriptions, pp, 196-200
16. Select Inscriptions, pp 196 200
17. A History of India, p 75
18. కందుకూరి వీరేశలింగకవి కృత గ్రంథములు ... సంపుటము; పుటలు 292 95.
19. హిందూమహాయుగము, పుటలు 39, 40.
20. A History of India, p. 114
21. హిందూమహాయుగము, పు. 199
22 South Indian Inscriptions, Vol. VI, No. 243
23. మరాఠీ వ్యుత్పత్తి కోశ, పుటలు 776, 777, 700.

శ్రీ సూరపరాజు రాధాకృష్ణమూర్తి

# కాళీపట్నం రామారావు కథలు

ఈనాటి అభ్యుదయ రచయితలు — యీనాడు రచయిత లందరూ అభ్యుదయ రచయితలే, కానని చెప్పుకునే సాహసం చాలా మందికి లేదు — మనుషులను ఉన్నవారు, లేనివారు అని రెండు వర్గాలుగ విభజించారు. ఉన్నవారు ఒక్క మంచి గుణమూ లేని వారుగా, లేనివారు మంచి గుణాల మూటగా చిత్రించడం యీనాటి పరిపాటి. మంచివాడై యుండవలెనంటే వాడు పేదవాడే అయి వుండవలసనే నమ్మకం యీ రచనలకు మూలంగా కనిపిస్తుంది పేదలు మంచి వారయినపుడు నిరుపేదలు మరీ మంచివారు కాక తప్పదు కదా. కా. రా. (కాళీపట్నం రామారావు) కథల పద్ధతి వేరు. కా. రా పేదల కంటె నిరుపేదలైన జనాన్ని గురించి వ్రాస్తాడు. అయితే మనుషులను మంచి వారుగా గాని చెడ్డవారుగా గాని, చూపడం అతని కథా ప్రయోజనం కాదు. మనిషి చెడుగా గాని మంచిగా గాని ఎట్లా మలచబడుతున్నాడు, మారుతున్నాడు అన్నది అతని కథా వస్తువు. అతని కథల్లోని మంచికి చెడుకు వ్యక్తులు కాక సమాజ వ్యవస్థ బాధ్యత వహిస్తుంది. ఇతని కథల్లో ఏ పాత్రనూ దుష్టపాత్రగా చెప్పడంకష్టం. సమాజ దౌష్ట్యానికే ప్రాధాన్యం.

ఒక దృష్టితో చూచినపుడు మొత్తం సాహిత్యంలో రెండు విధానాలు కనిపిస్తాయి. ఒక విధానం మంచికీ చెడుకీ జరిగే సంఘర్షణను చిత్రించడం. రెండవది మంచికీ మంచికీ జరిగే సంఘర్షణను చూపడం. మొదటి రకం సంఘర్షణ జీవితంలో దొరకదు. (అంటే కల్తీలేని మంచీ చెడూ జీవితంలో దొరకవు). సాహిత్యంలో పుష్కలంగా లభిస్తుంది. రెండవది జీవితం, కాని అటువంటి సంఘర్షణగా జీవితాన్ని గుర్తించడం కష్టం. చూపించడం చాలా కష్టం. అందుకే సాహిత్యంలో ఎప్పుడో కాని కనిపించదు. అన్యాయం, అధర్మం, క్రౌర్యం స్పష్టంగా కనిపిస్తుంటే వాటితో పోరాడటం సులభమే కావచ్చు. అసలు కష్టం వాటిని గుర్తుపట్టడమే న్యాయం అన్యాయంగా. ధర్మం అధర్మంగా, కరుణ కరడు గట్టిన క్రౌర్యంగా మారిపోయే సరిహద్దుల వరకు వెడతాడు కా.రా. అక్కడ చిక్కించుకుంటాడు వాటిని. ''యజ్ఞం'' లో అప్పలరాముడిది అప్పేనని లెక్కలు ఒప్పుకుంటుంటే అది అప్పుకాదనే వాడి వాదం అన్యాయంగా కనిపించే న్యాయం. అప్పలరాముడు ఉన్న కొంచెపు మడి చెక్క నీ అమ్మి తన వంశాన్ని తరతరాలకు బానిస వంశంగా చేసైనా అప్పు తీర్చవలసిందేననే శ్రీరాములు నాయుడి తీర్పు ధర్మ పక్షపాతంగా కనిపించే అధర్మం, అప్పలరాముడు అప్పు తీర్చకపోతే ఆ అప్పు తనే తీరుస్తానని శ్రీరాములు అనటం కరుణ కప్పవేసిన క్రౌర్యం. సీతారాముడు తన కొడుకు బానిసగా పెరిగి బ్రతకడం చూడలేనని వాడిని నరకడం రాక్షసత్వంగా కనిపించే పుత్రవాత్సల్యం.

. సమాజ దౌష్ట్యంపై వెలుగును గుప్పించి దాన్ని స్పష్టంగా చూపడం కోసం కా. రా. ఎక్కువగా తన పాత్రలను, అన్ని వర్గాలవారిని ఆదర్శ మూర్తులుగా, తప్పు పట్టలేనివారుగా చూపిస్తాడు ''యజ్ఞం'' లో వ్యక్తులుగా మనం ఎవరినీ తప్పు పట్టలేము. అందరూ ఆదర్శ వ్యక్తులే. మంచితనం మారుపేరైన వారే. గోపన్నకు అప్పలరాముడు వడ్డీతో సహా రెండువేల అయిదు వందలు అప్పు ఇవ్వతేలాడు ఇద్దరూ పరమ సాత్వికులు. కలిసి వ్యాపారం చేశారు కొన్నాళ్ళు. గోపన్న పూర్తిగా చితికిపోయి ఉన్నాడు. అతని కొడుకులే అతన్ని దగా చేశారు. అతనిపట్ల పాఠకుల సానుభూతిని ఏ మాత్రము తగ్గించడు కథకుడు. అప్పలరాముడు ఆ వూరి పంచాయితీలో హరిజన మెంబరు. మాలలే కాక వూరిలోని మూడొంతుల మువ్వాతిక మందికి అతడంటే సదభిప్రాయం. మాటకు నిలబడేవాడూ, మర్యాదగా బతకాలను కొనేవాడూ మాలల్లో అతనొక్కడేనని అందరూ చెప్తారు. వీరిద్దరి మధ్య తీర్పు చెప్పవచ్చిన శ్రీరాములు నాయుడు పంచాయతీ ప్రెసిడెంటు. ఊరందరికీ ''ధరమరాజు''. ఈ ముగ్గురిలో ఎవరినీ వ్యక్తులుగా మనం వేలెత్తి చూపలేము. అంతకన్నా మంచితనం మనుషుల్లో మనం ఊహించలేము ''భయం'' లో సత్తెయ్య మరొక ఆదర్శపాత్ర. సత్తెయ్యకు పాములను పట్టి చంపడం ఒక దీక్ష. అయితే యిందుకు కారణం తన తండ్రి పాముకాటు వలన చనిపోవడం కాదు. వ్యక్తిగతమైన ప్రతీకార వాంఛతో చేసే సర్పయాగం కాదిది. సమాజ శ్రేయస్సు కొరకు చేసింది. సత్తెయ్య లోని సహానుభూతి పాఠకులను ఆర్ద్రం చేస్తుంది. అటువంటిదే ''చావు'' లో అప్పారావు పాత్ర. అయితే యీ మంచితనం పెంచిన పాత్రలు ఒక్కోచోట అసహజంగా తోస్తాయి ''యజ్ఞం'' లో సీతారాముడు తనను చంపవచ్చే ఊరిపెద్దలతో చంపవద్దంటాడు. ఎందుకు ? ప్రాణం మీది ప్రేమతో కాదు. ''నాకు సావో నెక్క కాదు. నన్ను కొడితే మీరు ఉరిలో పడతారు. మీ బిడ్డ పాపల ఉసురు నాకేల తగలాల ?'' అంటాడు 1 అట్లాగే అప్పలరాముడి అమాయకత్వమూ ఒక్కోచోట దొంగ ముసుగులా కనిపిస్తుంది.

''సూరెంబాబు యిరవై యేలు యిరాలం యిచ్చినాడు — పున్నానికే ఇచ్చినాడు. అందుకు మెచ్చే బగవంతుడు రైను మిల్లెట్టించినాడు. ఇప్పుడు డబ్బొస్తున్నదంటే ఆ బాబేం సేయ గలడు.

ఆదే మాదిరి అచ్చెంనాయుడు బాబున్నూ పున్నానికే బేరానికొచ్చినాడు. ఆయిన్నూ కాలొచ్చినాక - సుట్టూ బూవులు ధరలు పెరిగిపోనాయి. యిళ్ళజాగాలకమ్మితే నష్టం పూడి లాబం వొచ్చింది. ఆ జాగాలు కొనుక్కున్నోళ్ళకు బలవంతాన గాని అంట గట్టినాడా ?'

అలాగని కూకలేసినాను.

దానికో గుంటపాపడన్నాడు గదా—

'ఓరి రాతోయ్! మనవూ యిచ్చినాం శమదానం. మన పున్నేనికి బవుమతేదన్నాడు

'నీకూ కాల్లుదొరకనేదా', అన్నాను.''

'నీ కూకాల్లు దొరకనేదా' అన్నమాటల్లో వ్యంగ్యం తోచకుండా ఉండడం కష్టం. తోచడం కథనంలో లోపం. అప్పల్రాముడి మాటల్లో ఒక అంతస్సంఘర్షణ కనిపిస్తుంది. అతడు ఇన్నాళ్ళూ మన్నించిన పాతకాలపు విలువలకు ఈనాడు తను ఎదుర్కొంటున్న వాస్తవానికి మధ్య జరుగుతున్న సంఘర్షణ అది.

కా. రా. కథల్లోని శిల్పపరిణతిని పరిశీలించాలంటే అతని పెద్ద కథలు చూడవలసి ఉంటుంది. అతని చిన్న కథలు శిల్ప దృష్టిలో కూడా చిన్నవే. ఈ చిన్నకథల్లో కా. రా. ప్రధానంగా **Allegory** (అర్థాంతరం)ని ఆశ్రయిస్తాడు. ''యజ్ఞం'' కథల సంపుటిలో రెండు పెద్దకథలమధ్య యిరుక్కుపోయిన చిన్నకథ ''తీర్పు''. అది వాస్తవ కథనంగా మనల్ని ఆకట్టుకోదు. ఒక సమస్యను సూచించి పరిష్కరించడానికి కథకుడు ఊహించిన పాత్రలు ఆ కథలోవి. పాత్రలు వ్యక్తులుగా కాక సమస్యలుగా కనిపిస్తారు. వారి ప్రతిమాటా మరేదో అర్థంవైపు (అర్థాంతరం) మనదృష్టిని ప్రక్కకు త్రిప్పుతుంది. ఇటువంటివే 'జీవధార' 'వీరుడు — మహావీరుడు' వంటి కథలు. అనేక భారతీయ భాషల్లోకి అనువాదమై అతనికి అఖిలభారత ప్రచారం తెచ్చిన అతని ''నోరూమ్'' అన్న కథ కా. రా. ప్రాథమిక దశలో వ్రాసినది అయి ఉండవలె. ఆ కథ కా రా యే వ్రాయక్కర్లేదు. ఓహెన్రీ కథలకు పేలవమైన అనుకరణ అనిపిస్తుంది.

కా. రా. కథన శిల్పం క్రమంగా పరిశీలించడానికి అయిదు పెద్ద కథలు చాలు. 'ఆర్తి', 'యజ్ఞం', 'భయం'. 'చావు', 'కుట్ర' — యీ అయిదు కథల్లో కా. రా. అయిదు ప్రధాన సమస్యలను ఆవిష్కరించడమే గాకుండా అయిదు విధాలుగ కథ చెప్పాడు 'ఆర్తి' నిరుపేదల నికృష్ట జీవితాలను డాక్యుమెంటరీ చిత్రంలో వలె చూపుతుంది. ఆ నిరుపేదల్లో సద్గుణాలు ఉండటానికి ఎట్లా వీలులేదో కూడా చూపుతుంది. పేదరికం యిట్లా ఉంటుందని చూపడమే 'ఆర్తి' చేయగలిగింది. 'యజ్ఞం'లో సమస్యను ఆవిష్కరించడమే ప్రధానం. ఇందుకు కా. రా. **Allegory**ని, అర్థాంతర కథన విధానాన్ని, ఆశ్రయించాడు. అయితే వాస్తవికతకు ఎక్కడా దెబ్బ తగులకుండా, పాత్రలు, సంఘటనలు వాస్తవంగా కనిపిస్తూనే, ఒక సమస్యా విష్కారానికి సృష్టింపబడిన సూక్ష్మీకరణాలుగా నిలుస్తాయి. ఈ కథలో ఆలోచనకు అనుభవానికి మధ్యనున్న అగాధాన్ని స్పష్టంచేస్తాడు కా. రా. కంబారిగా జీవితాంతం బ్రతకడమంటే క్షణక్షణ మరణమన్న ఆలోచన అందరూ ఎరిగినదే. కాని ఆ ఆలోచనను అనుభవించడం సామాన్యంగా జరుగదు. ఆలోచనవేరు, అనుభవంవేరు. కనుకనే సీతారాముడు తన పసికూనను నరికి చూపవలసివచ్చింది.[2] ఈ అనుభవమే ప్రధానం 'భయం'లో, 'భయం' **allegory** నుండి **symbolism** వైపు సాగుతుంది.

పాములు రకరకాలు. పాములెన్ని రకాలో భయాలు అన్ని రకాలు. ఈ పాములన్నిటినీ ఏరిపారెయ్యడమే, లోకంలో పాపభయం లేకుండా చెయ్యడమే సత్తెయ్య దీక్ష. ఈ పాములను, పాపమనస్తత్వాన్ని అర్థంచేసుకోడంలో సత్తెయ్యకు, గురవడికి ఎదురైన అనుభవాలు వారి జీవితాలలో మార్పుతెస్తాయి. యుగాల ఆలోచనకన్న క్షణ కాలపు అనుభవం మనిషిని మారుస్తుంది. 'చావు'లో కా. రా. **Allegory**ని గాని, ప్రతీకలను గాని ఆశ్రయించలేదు. ఈ రెంటి అవసరం లేకుండానే మనల్ని కథలో నేరుగా నిలబెడ్తాడు. కథ చదివినంతసేపూ ఎముకలు కొరికే చలిగాలి మధ్యనే ఉండిపోతాం మనం. 'చావు'లో జీవితాన్ని అనుభవంగా అందిస్తాడు కా. రా. శవం తగులబడుతుంటే ఆ మంటల కాంతుల్లో ఎరకయ్య ముఖం ఒక అపూర్వ ఆనందంతో వెలిగిపోతుంది. ఇదొక గొప్ప జీవచిత్రం.

'కుట్ర' యీ నాలుగు కథల్లో చేరదు. అతని కథలన్నింటిలోకి వేగంగాసాగే కథనం 'కుట్ర'. కా. రా. సామాన్యంగా శైలితో పాఠకుణ్ణిఆకట్టుకోడు. ఆ ప్రయత్నమూ చెయ్యడు.'కుట్ర'లో అతని శైలి పాఠకుణ్ణి సునాయాసంగా అతనికి తెలియకుండానే ముందుకు లాక్కెడుతుంది. ఇందులో కా. రా., రా.వి. శాస్త్రి శైలిని అనుకరిస్తున్నాడనిపిస్తుంది. కా రా. కథల్లో కల్లా 'కుట్ర'లోనే **quotes** ఎక్కువ. 'కుట్ర'ను కథ అనడం కష్టమే. కరపత్రం అనడమూ అంతకష్టమే. ఇందులో కథ చెప్పడంకంటె యీనాటి ఆర్థిక సామాజిక వ్యవస్థను విశ్లేషించడమే ప్రధానం కా. రా. మొదటినుండి సమస్యను వివరించడమే తన లక్ష్యంగా పెట్టుకున్నాడు. తన కథలోని చిక్కులన్నీ తనే విప్పుతాడు. అస్పష్టత, అనిర్వాచ్యత అతనికి సాహిత్యగుణాలుకావు. స్పష్టమైన అభిప్రాయాలతో, విస్పష్టమైన వివరణతో కథ చెప్పడం అతని పద్ధతి. కథనంలో బిగువుకోసం అవివక్షితంగా వదిలేసిన చిక్కులుకూడా కథ ముగిసేలోపల ఎక్కడో స్పష్టంగా వివరించక మానడు కా. రా. ఈ వివరణే అతని ప్రధాన లక్ష్యం. 'ఆర్తి'లో యిెయ్యపురాళ్ళ తగాదా. 'యజ్ఞం'లో అప్పల్రాముడి అప్పు. 'భయం'లో గొరేసు పాముకరిస్తే చావక పోవడానికి కారణం. ఇవన్నీ సహేతుకంగా స్పష్టంగా వివరిస్తాడు. వీటి అతుకులు ఎక్స్—రే ఫోటోలోవలె చూపిస్తాడు. ఈ విధమైన వివరణాత్మక విధానం 'కుట్ర'లో ప్రధానమై కథను మింగేసింది. మన దేశంలోని యీనాటి ఆర్థిక వ్యవస్థకు పట్టిన జబ్బునుచూపే ఎక్స్—రే ఫోటో అది. పోర్ట్రేట్ ఫోటోగ్రఫీ కాదు.

ఒక ప్రత్యేకమైన సందేశం యివ్వాలనీ, ఒక ప్రబోధం చెయ్యాలనీ, పాఠకుల్లో కార్యోన్ముఖత కలిగించాలనీ కా. రా. కథలు వ్రాస్తాడన్నది స్పష్టమే. ఈ సందేశం తన కథల్లో ఎట్లా చేస్తూ వచ్చాడో చూస్తే అతని కథనంలో మరొక రకమైన క్రమ పరిణామం తెలుస్తుంది. అతని కథల ముగింపులు సందేశాత్మకంగా హెచ్చరిస్తూ ఉంటాయి, 'ఆర్తి'లో ఈ సందేశం వాచ్యం చెయ్యడు. ''మోచేతి కూడు'అనే ఎంచితే, ఎంచడానికి లేనిదేవుందా గుడిసెలో? సన్ని కంచం తెచ్చి పక్కను పెట్టింది. పైడయ్య చెయ్యి కడిగేసుకున్నాడు.'' కథలో ఈ మోచేయి ఎక్కువగా కనిపించదు. కాని కథ చివరి ఈ మాటలు చదివిం తర్వాత కథ మొత్తం కొత్తగా మళ్ళీ మన కళ్ళముందు తిరుగుతుంది. ఆ అదృశ్యహస్తం నీడ స్పష్టంగా కథమీద కనిపిస్తుంది.'యజ్ఞం'లో చివరి మాటలు : 'ధర్మ పన్నాలెంత వరకు? ... అంతా నువ్ చెప్పినట్టు వినే వరకూ. ఆ తరవాత...!' ఇవి కథకుని మాటలు. రచయితగా తాను చేస్తున్న హెచ్చరిక. కథకు ఏ మాత్రము అవసరంలేని, కథలో ఏ మాత్రము అతకని, కనుకనే కథను ఏ విధంగానూ చెడగొట్టలేని మాటలు. 'భయం' చివరి మాటలు : 'ఆ పాపవు ఆలోచనలూ వూహలూ, ఆతను కోరి తెచ్చుకున్నవి కావు ఇతరులు అతని తలలోకి ఎక్కించినవీ కావు. జీవితం మనిషిలో మార్పు తెస్తుంది. అందుకు అనుభవం కారణం అవుతుంది.'' మెదడును ఉతకడం (brain washing, indoctrination) వల్లకాదని అనుభవంవల్ల జీవితంలో కొన్ని పొరలు తొలగి మనిషి మరో మనిషి అవుతాడని కా. రా. అంటున్న / మాటలు. కథలో తను చూపింది ఈ అనుభవమే కాని అనుభావం కాదని తను వివరించుకున్న మాటలు కూడా. 'చావు'లో కథకుని ప్రబోధం కథను ఎక్కువగానే ఆక్రమించింది. మూరయ్య, కన్నయ్య, కరనం భామ్మ రిది వీరంతా వారిభాషలోనే అయినా కథకునిగొంతుతో మాట్లాడుతున్నట్టు కనిపిస్తుంది. ''పెళయం తప్ప ఈ బూమ్మీది మురికిని మరేదీ కడగనేదు పోతే అన్నీపోతాయి. మనుషులూవూ పోతాఁవు.'' 'చావు'లో ప్రబోధం కథ నిండా ఎంత పరచుకున్నా, 'కథ మొదటి నుండిగుండెలోనిల్చిపోతుంది. కథలో చివరిమాటలుహెచ్చరికకాదు, సందేశమూకాదు,అనుభూతి.''ముసిల్ది నిన్న పోయింది. నిన్నపోతే ఇవాల్టికిరెండు.కాని సంధికాలంలో తెలివేసిఉన్నవాళ్ళకి అలా అనిపించదు. నిన్నా నేడూ అంతా ఒక్కలాగే అలికేసిఉంటుంది'. కాలేసి జారుకునే చావుకాదు బ్రతుకునంతా 'అలికేసి' నట్లున్న చావు. 'కుట్ర' మొత్తం ప్రబోధమే. అందులోనూ చివరి మాటలు హెచ్చరిస్తూనేఉన్నాయి. అయితే అవహేళన స్వరంతో. ''ప్రెస్సూ ప్లాట్‌ఫాం చేతిలో ఉంటే ఎన్ని బుకాయింపులేనా బుకాయించొచ్చు. కాని నిజం ఎప్పటికీ నిజమే. గాంధీగారి కోతులు కళ్ళూ చెవులూ నోరూ మూసీసుకోవాలని మూసీసుకోండని చెప్పె — ఇంకా ఇనప్పోతే బలవంతాన మూసీడానికి ప్రయత్నించొచ్చు. కాని— ???[3]

కా. రా. ఒక్కొక్క కథలో ఒక్కొక్క ప్రాథమిక ప్రశ్నను ఆవిష్కరిస్తాడు చివరకు తేలే ప్రశ్న ఒకటే అయినా ఆ ప్రశ్న యొక్క విభిన్న రూపాలు వివిధ కథల్లో కనిపిస్తాయి. 'ఆర్తి' లో మాత్రం ప్రశ్నలున్నా ఏది ప్రధానమైన ప్రశ్న అనేది చెప్పడం కష్టం. ఈ కథలో ప్రశ్నను రూపించడంకంటే మాలల నికృష్ట జీవితానికి అద్దం పట్టడమే ప్రధానం అనిపిస్తుంది. ఈ కథ మూడు పేటల గొలుసు. ఒకటి ఎర్రెమ్మ, బంగారిల యియ్యపు రాళ్ళ తగాదా. పండక్కు కూతుర్ని పుట్టింటికి తీసుకెళ్తానంటుంది ఎర్రెమ్మ. కోడల్ని పండక్కి పుట్టింటికి పంపను, పండు గెళ్ళాక తీసుకెళ్ళమంటుంది బంగారి. ఇద్దరిదీ ఒకే ఊరు. ఒకతె కన్నతల్లి, ఇంకొకతె కడుపులో పెట్టుకోవలసిన అత్త. ఎవరిని తప్పు పట్టడం? ఇద్దరిదీ తప్పుకాదు. 'పండుగుముందు నెల్లాళ్ళ ముమ్మరంగా వరికోతలు. పండుగెళ్ళాక పొలకరిస్తేగాని బతుకుల్లేవు. అందుకే పండుగు ముందు తీసుకెళ్తానని తల్లి, పండుగెళ్ళాక తీసుకెళ్ళమని అత్త.కోడలైనా,కూతురైనా సన్ని ఒంటేఒక మనిషికూలి. మరొకపేట, మధ్యలో నలిగి వస్తున్న సన్ని మొగుడు పైడయ్య. పట్నంనుంచి పండక్కని ఊరికొచ్చాడు. సెళ్ళాన్నికలుసుకునే విలులేదు. పక్క వూరెల్తే రావయ్య కోడలు కన్ను పట్నం నుంచి దిగిన తనపై పడిందని పైడయ్య అనుమానం. ఆశ ఊగింది. కాని మనిషి అట్లాంటిది గాదని తెలిసింది. నిరాశగా ఊరి ముఖం పట్టాడు. చాటుగా కలుసుకోమని పెళ్ళానికి కబురుచేశాడు. దొంగచాటుగ మొగుణ్ణి కలియడానికి సన్నెమ్మకు అభిమానం అడ్డొచ్చింది. పైడయ్య దాహంతో దెయ్యాలు గంగమ్మ పాకలో ప్రవేశించాడు. మరేడేళ్ళ క్రితం ఒకసారి ఇలాగే వచ్చాడు. అప్పటికి సన్ని కాపరానికి రాలేదు. ఇంకోసారి అడగనంటే ''అలాగే కాని''మ్మంది. మళ్ళీ యిప్పుడొచ్చేను పైడయ్య పైడయ్య అన్న నారాయుడు పెళ్ళాం పోయినప్పటి నుండి దాహానికి గంగమ్మ దగ్గర కొస్తాడు. 'నా నిప్పుడు నీకొదెన్నవుతాను' అని, పైడయ్య అసహాయస్థితిని చూసి తల్లిలా జాలిపడి దగ్గరున్న సారాసీసా ముందు పెట్టింది గంగమ్మ. తాగి తన వమనంలోనే పడ్డాడు పైడయ్య. కథలో మూడవపేట, యియ్యపురాళ్ళ తగవు తీర్పు. నాయుడు తీర్పు చెప్పాడు; అల్లుణ్ణే అత్తగారింటికి పంపమని. తీర్పుకు అనుపానంగా తనింట్లో మిగిలిపోయిన కూరా కూడూ పంపుతాను నాయుడు. సన్ని ఆ రాత్రి పైడయ్యకు అన్నం పెడుతున్నది. 'ఆ రాత్రి తొమ్మిది గంటలకు ఒంటాడ్చి యీడ్చి తన్నిన పశువులా వున్నాడు పైడయ్య'. నాయుడి తీర్పుతో కలిగిన సంసారంలో అతనికి సారం తోచలేదు. తినకుంటే ఆకలి. తిందామంటే ఆ మోచేతికూడు దిగదు.

ఈ వ్యాసంలో ఎన్నుకున్న తక్కిన నాలుగు కథలు గొప్ప కథలని ఎవరూ చెప్పక్కర్లేదు. వాటి మోహన్నే స్పష్టంగా వ్రాసి ఉంది.[4] అయితే 'ఆర్తి' మాత్రం అట్లా కనిపించదు. కనిపించే ప్రయత్నమూ చెయ్యదు. అందుకు కారణం అందులో కా. రా. 'కథ' చెప్పడానికి ప్రయత్నం చెయ్యకపోవడమే. తక్కిన కథల్లోలాగ యిందులో ఒక ప్రధానమైన సమస్య, దాన్ని ఉత్సుకతను రేకెత్తించే విధంగా

ఆవిష్కరించడమూ, ఒక పతాకస్థాయికి నడిపించడమూ, ఒక భయంకరమైన తీర్మానమూ, యివేవీలేవు. ఒక ఉప్పెననో, భూకంపాన్నో, అగ్నిపర్వతం బ్రద్దలవడాన్నో చూపడంలేదు. నేలలో, గాలిలో తేమకూడా క్రమంగా ఆరిపోతున్న కరువు ప్రాంతంలో ఆరిన పెదాలపై, ఎండిన కళ్ళపై మువీకేమేరాను మూగగా త్రిప్పుతూ వెళతాడు కా. రా. దేహమంతా దహిస్తూ నించే ఆ దాహం చెప్ప లేనిది. చెప్పకోలేనిది. ప్రాణం తీసేదీకాదు, బ్రతుక నిచ్చేదీకాదు. మరణ మృదంగం మూగగా పడిఉన్న దృశ్యం అది.

"యజ్ఞం"లో కథ చెప్పడంకంటె సమస్యను ఆవిష్కరించడం ప్రధానం ఇందులో ప్రశ్న "కల్ని ఏవడు సెప్పిన దరమం? ఏటా దరమం?" వితికిపోయిన గోపన్న అప్పలరాముడు తన బాకీ తీర్చాలని కోరడం అధర్మమా? లెక్కలన్నీ సరిచూసి, అన్యాయపు వడ్డీని కాదని, ప్రభుత్వపు వడ్డీరేటుకే అప్పు మొత్తం నిర్ణయించి, అప్పు తీర్చడానికి మూడేళ్ళు గడువిచ్చిన పెద్దమనిషి శ్రీరాములు నాయుడిది అధర్మమా? లెక్కల నొప్పకుంటూనే అప్పు తీర్చవలసిన అవసరంలేదనే తీర్పును ఆశించిన అప్పలరాముడిది అధర్మమా? ఎవరిదీకాదు ఈ అధర్మం ఆర్థిక వ్యవస్థలో ఉంది. అప్పలరాముణ్ణి గోపన్న. గోపన్నను పట్నంలో షావుకారు, వాణ్ణి పై షావుకారు యిట్లా చిన్న చేపను పెద్దచేప దిగమింగే ఆర్థిక వ్యవస్థలో ఉంది అన్యాయం ఇటువంటి వ్యవస్థలో సాధించిన అభివృద్ధి అంతా ఉన్నవాళ్ళకే అభివృద్ధి. లేనివాళ్ళు యింకా లోనికి వెళ్లేగొయ్యి. ఊళ్ళకు విద్యుత్తువచ్చింది 'దేశమంతటా చిక్కంలా పరచుకుంటున్న తీగెలు' అంటాడు కా. రా దేశం పచ్చగానే ఉంది పేదల నోటికి 'చిక్కం' మాత్రం విడదు ప్రగతికై సాగే యజ్ఞంలో బలిపశువులే పేదలు. యజ్ఞఫలం యజమానులదే

ఈ కథలో సాగిన ధర్మతత్త్వ విచారము రాజ్యధర్మం కంటె సమాజధర్మం ఎంత కఠోరమైందో చూపుతుంది గుడి కెదురుగా, తలుపులన్నీ తెరుస్తే దేవుడు కనిపించేటట్టు న్యాయ మండపం కట్టుకున్నారు ఊరివారు. 'ఏనాడైతే యీ మండపంలో న్యాయం దొరక్క, దాని కోసం యీ వూరివాడు పై వూరు పోతాడో, ఆనా దాన్ని కట్టిన మన యీ చేతులతోనే దాన్ని కూల్చివేతాం' అని నిర్ణయించుకున్నారు ఊరి పెద్దలు. న్యాయం కొరకు కోర్టుల కెళ్ళడాన్ని గూడా సహించరన్నమాట ఊరివారు. కోర్టుకెళితే పేదవాడికి పొరపాటున న్యాయం జరిగే ప్రమాద మున్నది.[5] 'మీరు కోర్టుకు వెళ్ళి వాదించి గెలవచ్చు. అంత మాత్రాన మీరు ఆ రుణాన్నిండి తప్పించుకోగలరనుకోవడం కల్ల. ఈ జన్మలో కాకపోతే యింకో జన్మలోనైనా మీరు దాన్ని తీర్చడం తప్పదు' అంటాడు శ్రీరాములు నాయుడు

ఈ కథలో కా. రా. రాజ్యం సమాజంలోని తక్కిన అంగాలను ఎట్లా తెలివిగా వాడుకుంటుందో చూపుతాడు. మతమూ, పంచాయతీ పరిపాలన మొదలైనవి రాజ్యం యొక్క చేతికి అందకుండ స్వేచ్ఛగా వ్యవహరించగలవనే ఆభాసను కా. రా. యీ కథలో తొలగిస్తాడు. మునసబు, కరణము రాజ్యం యొక్క ప్రతినిధులు. శ్రీరాములు నాయుడు పంచాయతీ పాలనకు ప్రతినిధి. గ్రామంలోని గుడి, ఆ గుడి కెదురుగా నిలబెట్టబడ్డ న్యాయ మండపం మమతా, మానవతాలేని రాజ్యానికి చట్టానికంటె మనిషికి దగ్గరి వ్యవస్థలుగా కనిపిస్తాయి. కాని రాజ్యము,చట్టమూ తమకుగా తాము చేసుకోలేని పనులను పంచాయతీ పాలన ద్వారా, మత ప్రవచనాల ద్వారా చేయించుకుంటాయి. అంటే 'చట్టం' పనిచేయనపుడు 'ధర్మం' సహాయం కావాలి దానికి. ఈ ధర్మం ఆ చట్టానికి దాని పనిచేసిపెడుతూ తానేదో వెలగబెట్టినట్టు సంబరపడిపోతుంది. తను వాడుకోబడుతున్నట్టు ఆ 'ఎర్రిపీరు' కు తెలీదు. మునసబు, కరణము, కోర్టులు అప్పలరాముడిది అప్పేనన లేనప్పుడు వారికి శ్రీరాములు నాయుడి న్యాయస్థానపు అవసరం కలిగింది. అదే అంటాడు సీతారాముడు నాయుడితో:

'ఈ రాజ్యాన్నీ నిన్నూ ఏలే దొరలెవరో యెరుగుదువా — అదిగో ఆ బాబులిద్దరు. దిగో ఆ కరణమయ్య. అదిగో ఆ మునసయ్యి. ఆళ్ళకు ఆళ్ళు సేసుకోలేని మంచిని నువ్ సేసి సంతకాలమే సి రాజ్యం — ఆ తరవాత ఆళెవరో, నువ్వెవరో'.

'భయం' లో పాములు మనిషిలో అర్థంలేని భయాలు కల్పించే వివిధ శక్తులకు ప్రతీక. పేదల బ్రతుకులు గుప్పిట్లో ఉంచుకుని ఆడించే ధనికులు, పేదల అజ్ఞానాన్ని డబ్బుగా, అధికారంగా మార్చుకునే మతాచార్యులు, ప్రజల మూఢ విశ్వాసాలను వాడుకుని వాళ్ళ ప్రాణాలు, ఆస్తులు కాజేసే నాటు వైద్యులు వీళ్ళందరూ ప్రజల పాలిటి పాములు. ఇలాంటి

పాముల్ని ఏ విధంగా చంపడానికీ ఎటువంటి మీమాంసా పన్నేరు! వాటిని దయతలచేవాళ్ళూ ఉంటారు ''అయ్యో! పాపం ఎర మింగిన పావురా! అలాంటి పాముని చంపకూడదు!' అన్నారు భూతదయాపరులు.''[6] పాములంటే సత్తెయ్యకు ద్వేషం లేదు. అసలు పాములే లేవు. లేనిదాన్ని ద్వేషించడమెట్లా? 'పూర్తిగా తెలివొచ్చిచూస్తే ఏ పామూ కనిపించదు. ఏ మాయా అగుపించదు.''

'భయం' లో మూడు దశలున్నాయి. గౌరేసు పారెమ్మల చావు, సత్తెయ్య సర్పయాగం, గురవడికి జీవితం తెలియటం. మొదటిది మూఢనమ్మకాలల్లోని ప్రమాదాన్ని చూపడానికి కాని తరువాతి కథతో దీని అతుకు సరిగా చేయలేదనిపిస్తుంది. సత్తెయ్య సర్పయాగం అతని తల్లిదండ్రుల చావుకు ఒక పాము కారణమవడం చేత అని చెప్పడానికైతే గౌరేసు, పారెమ్మల కథ అవసరంకాకున్నా కొంతవరకైనా సార్థకమయ్యేది. కాని కా.రా. అటువంటి ప్రయోజనాన్ని ఉద్దేశించలేదు. సత్తెయ్య సర్పయాగం ప్రతీకార వాంఛా దుష్టంకాదు, లోక కళ్యాణ కారకం. అయినపుడు గౌరేసు, పారెమ్మల కథ ఎందుకు? పాము కరచిన గౌరేసు చావలేదు. కరవని పారెమ్మ చచ్చింది. పాముకాటు కంటె పాము భయం ప్రాణాంతకమైందని చెప్పదలచుకున్నాడా? కాదు. పారెమ్మ చనిపోయింది భర్తను పాము కరచిందన్న షాకువల్ల కాదు. ఆ షాక్ వల్ల జరిగిన గర్భస్రావంలో 'నాటు మంత్రసాని మోటు సుళువులు వికటించి' చనిపోయింది. అట్లానే పాముల రావులయ్య నాటు మందులు — పాము కాటు కాదు — గౌరేసు ప్రాణం, ఆస్తీ కాజేశాయి. కనుక గౌరేసు, పారెమ్మల చావు కథ 'నాటు' తనం యొక్క ప్రమాదాన్ని చెప్పడానికనుకోవాలి.[7] దానివలన సత్తెయ్యలో కలిగిన హేతువాద దృష్టిని ప్రతిపాదించటానికి. కాని తరువాతి కథలో ఈ హేతువాదం కథావస్తువుగా మళ్ళీకనిపించదు. తరువాత కనిపించే మానవతావాదానికి యిది ఎట్లా పునాది అవుతుందో కూడా స్పష్టం కాదు. 'తన భయం ఎలా తొలిగిందో ఏ చైతన్యం అందుకు కారణమో గ్రహించగలిగే వూహ సత్తెయ్యకి లేదు.' తరువాతి కథలో వస్తువు భయాన్ని జయించడమెట్లా? 'జనంవేటనుకుంటారంటే అప్పుడెప్పుడో మా యయ్యని పావు కరిసిందని — ఆ కసికొద్ది పావుల్ని సంపుతాననుకుంటారు. పావంటె నాకు పగకాదు ...పావు మడిసిని కుడతాది. మడిసికి పావంటె భయం. పావుని సూస్తె సావుని సూసినంత బయిం. సావుకి బయపణ్ణోడు ఒక్కడే, పావుకి బయపడ్డు. సిన్నప్పుడు కండసీవని సూసి బయపడినావు పెద్దైనాక పావు...సీవైనా, పావైనా,సావైనా నాకొక్కటే. అదెప్పుడోకాటేస్తదో యెయ్యదో, దాని బయ్యం మనిసిని తినేస్తుంటది పురుగులాగ! ఎదురు తిరిగితే యేటీ నేదు.' చావుకి భయపడక పోవడం తనకి చావులేదని తెలుసుకున్నప్పుడే సాధ్యం. 'ద్వితీయాద్వై భయం భవతి' అన్న ఉపనిషద్వాక్యాన్ని గుర్తుకు తెస్తాయి సత్తెయ్య మాటలు. లోకమంతా తననే చూసుకుంటున్న సత్తెయ్యకు చావులేదు, భయమూ లేదు.

ఈ ఆత్మీయత ఎంత భయంకరమైనదో సత్తెయ్య భార్య రత్నాలు మాటల్లో కనిపిస్తుంది. ''నువ్—, మీరంతా నాకైనట్టు ఈ లోకవంతా నీ కొద్దా?'' ''అవుద్ది.'' అంత తడుపుకోకుండా వచ్చిన జవాబుకి రత్నాలువద్ద ఎదురు మాటలేదు,''అయితే సరే!'' అంటూ తలతిప్పేసింది.' ఆమెకు కళ్ళంబడి నీళ్ళొందుకువచ్చేయో, వాటినిఆపడంవెలాగోఅతనిక్కాని, ఆమెక్కానితెలీలేదు. 'నీవేనా కం, లోకం ఏమైతే నాకేం' అని సత్తెయ్య అనలేకపోవడం రత్నాలు కన్నీళ్ళకుకారణం. భర్త పరస్త్రీలోలుడైనా భార్యసహించగలదుగాని, జ్ఞానియై ఆత్మవత్సర్వభూతాని అనడం ఏ భార్యా భరించలేదు. మానవతావాదాన్ని దాని అంచులవరకు వూహించాడు కా. రా. అది అక్కడ అద్వైతపు అంచులను తాకుతుంది.

'చావు' మనసును తాకదు. మనసుద్వారా తాకదు. సూటిగా హృదయాన్ని తాకుతుంది. దీన్ని కథలా చదవలేం. జీవితంలా అనుభవిస్తాం. అంటే ఈ కథలో వాస్తవికత, ప్రతీక విడిగా తెలియలేనంతగా కలిసిపోయాయి. కథా శిల్పం చేరుకోవాలని కోరుకునే శిఖరం యిది. ఈ కథలో యితివృత్తం యించుమించు లేనట్టే. మాలవాడలో ఒక ముసలది కన్ను మూసింది, బతికినంత కాలం చలితో తీసుకున్న ముసలిది. దాన్ని కాల్చడానికి కావడి కట్టెలు ఎక్కువ. అరవై పేజీలు మించిన ఈ కథ ఆ కాసిని కట్టెలకోసం ఆ మాలలు పడేపాట్లు. అంత చలిలో, ఆ రాత్రివేళ ఊరిలోని ఏ పెద్దమనిషి నిద్రాభంగం సహిస్తాడు. సహించవచ్చు సహించక పోవచ్చు. అసలు లేపడానికి ఎవరు సాహసించగలరు? కొనడానికి ఊళ్ళో ఎవరూ అమ్మరు. ఊరికే యివ్వరు. శవాన్ని పాతెయ్యొచ్చు. కాని దయ్యమవుతుందనే భయం. మాల పెద్దలంతా పాతెయ్యడమే మార్గమని అనుకుంటుంటే కుర్రకారు కొందరుఎక్కణ్ణుండో ఆరు కట్టెలమోపులు తెచ్చిపడేశారు. పాతేద్దామనుకున్న పెద్దవాళ్ళంతా అదిరిపడ్డారు. కుర్రవాళ్ల ఈ లఘాయిత్యం తెల్లారితే ఎట్లా సమర్థించడం,కాల్చడమాకాదా అన్నమీమాంసలోఉంటే ఒక కుర్రగొంతు అన్నది: 'శవాన్ని అందలేసి కాలుస్తారో నేప్పోతే ఆల్లనే అందలేసి కాల్సమన్నారో అడగండి'.కుర్రవాళ్ళ పట్టుదలవల్ల శవం కట్టెలపై కెక్కింది. చచ్చినదాని కొడుకు ఎరకయ్యకు ఎంతగానో బాధగా ఉండింది తల్లిని పాతెయ్యవలసి వస్తుందేమోనని. ''ఒక్కోపాలి మా యమ్మఅనీది. అయ్యా నానెప్పుడేనా యీ సలికే సచ్చిపోత్నా. ఈ సలి సంకటంతోనే సచ్చిపోతాను. సీతాకాలం కర్రలెక్కడా దొరకవు. కర్రల్దొరకవని కప్పెట్టేకేమి — ఎక్కడైనా, కసింత అడుక్కానో, సివరికి దొంగతనవేసేనా సరే, నన్ను కాల్సెయాల. బండెడు కర్రలెత్చి కాల్చి, నా యిన్నాళ్ళసలీ కష్టమ్మీనైనా కాలిపోవాల' అనీది మాయమ్మ...తరవాత ఏటన్నా కానీ యిప్పిడీ కర్రలు తెచ్చినారా—ముందీ శవాన్ని కాల్చడవైపోనాది. నేప్పోతె నాను బతికున్నంతకాలం కుల్లుతునే ఉందును. బైటకి అన్లేను. అయినా కుల్లుతాను.''

'బతికున్నంతకాలం కుల్లుతునే' బతకవలసిన బతుకులు కథలో వస్తువు. 'చావు' ముసలిదాని చావుకాదు. బ్రతికున్నవారి

చావు. 'నా ఏడుపిల్ల బతికున్న శవాల సురించే' అంటాడు అప్పారావు. ఈ కథలోని చలి, చలిలోని శవ జాగరణ, ఆ నిక్కష్టాల చావని చావువంటిదే. 'జీవుడకి ఎండాకాన్దే, ఓనా కాన్దే— అయితే ఆటి దెబ్బ ఎదురుగా కనబడతాది. మంచు, సలి అలా కాదు. సల్ల సల్లగా జీవుడిని తినేస్తాయి' అనే రాజయ్య మాటలు, 'ఒక్కసారి సావడమంటె మనకి బెదురు. కసింత కసింత సావడం మనకిశవానగుంటాద,' అనేఅప్పారావుమాటలు, చలి వంటి చావును చెప్పేవే. మనిషి బ్రతికున్నపుడు వాళ్ళమనిషి, వీళ్ళ మనిషి. చనిపోయిన తరువాత ఆ శవం అందరిదీ. దాన్ని సాగనంపే బాధ్యత సంఘానిది. మనిషి ప్రాణంపోయినా చలించని సంఘం 'చావు'లోని సంఘం. చలించనిది అంటే ప్రాణంలేనిది. 'చావు' సంఘానిది.

కొన్ని కథలు కమ్మగా కర్పూరపువిడెంలా బుగ్గన గుబాళిస్తుంటాయి కా. రా. కథలు గుండెలో ముల్లులా ఉండిపోతాయి.

కా. రా. సూచించే పరిష్కారాన్ని పాఠకుడు ఒప్పుకున్నా లేకున్నా అతని సమస్యా విష్కారాన్ని ఒప్పుకోక తప్పదు. మార్క్సిజమైనా మరోతత్త్వమైనా రచయితకు గుడ్డిగా నమ్మవలసిన సిద్ధాంతం కారాదు. ఆ తత్త్వం జీవిత సత్యాన్ని దర్శింప చేయగలిగేదిగా ఉండాలి. ఆ దర్శనమే రచనలో ప్రతిబింబించాలి. కా. రా కేవల తాత్త్వికుడుకాడు. అతడు ఋషి. అందుకే అతని కథలు కావ్యాలు కాగలిగినాయి.

కా. రా. తన కథల్లో ఆదర్శ సమాజాన్ని కలగంటాడు. లోకమంతా తననూ, తనలో లోకమంతటిని చూడగలిగినవారే అట్టి వంటి సమాజంలోని వ్యక్తులు. అటువంటి వ్యక్తులు నిడిగా వికసించరు. సమాజ సుమంగా వికసిస్తారు. ఆర్చిబాల్డ్ మెక్లీకిష్ పద్యమెట్లానో కా.రా.కు సమాజ మట్లా.'A Poem should be wordless' అంటాడు మెక్లీష్. పద్యంలో పదాలు కనిపించవు. పద్యమే కనిపిస్తుంది. నేను అన్నది పూర్తిగా రూపరి, రేకులు రేకులుగా ఆకర్షించని ప్రపంచాబ్జం కా. రా కల. అది ఎన్నటికీ కలగానే ఉండవచ్చు. కానీ ప్రతివాడూ కనవలసిన కల. సమాజాన్ని ముందుకు నడిపించే కల.

# అ థో జ్ఞా పి క లు

1\. వాల్మీకి నిషాదుని శపించిన శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ ఒకరన్న మాటలు గుర్తొస్తాయి. జంటలోని ఒక పక్షిని బోయ కొట్టినపుడు ప్రాణాలు విడుస్తున్న జంటను చూసి పక్షి శోకించింది. అయితే ఆ శోకం ఎందుకు? జంట చనిపోతున్నదని కాదు, ఆ వియోగాన్ని తానెట్లా సహించగలనా అని చనిపోతున్న పక్షి పడే ఎవరి వేదనను తలచుకొని. (వేదాల తిరువేంగళాచార్యులు : ఆంధ్రధ్వన్యాలోకము)

2 'చావు'లో అప్పారావుయిదేఅంటాడు.''ఒక్కసారిసావడమంటె మనకి బెదురు. కసింత కసింత సావడం మనకి శవాన గుంటాది.''

3 (పెన్నూ ప్లాట్‌ఫాం గాంధీగారి కోతుల చేతిలో కంటె, ఇందిరా గాంధీగారి కోతుల చేతిలో కంటె కమ్యూనిస్టు రాజ్యాల చేతిలోనే ఎక్కువగా ఉంటాయన్నది యిప్పటికే చరిత్ర చూపింది. 'బలవంతాన మూసీదానికి' గాంధీగారి కోతుల కంటె కమ్యూనిస్టు కోతులకు ఎక్కువ బలం ఉంటుందని అనుకోనక్కర్లేదు. బహుశా కా. రా. యిప్పటి వరకు వచ్చిన కమ్యూనిస్టు రాజ్యాలను సమర్థించ లేదను కోవాలె. Stateless Society ని ఊహించుకొని చెప్పి ఉంటాడు.

4 ఎంత స్పష్టంగా వ్రాసి ఉన్నా చదవలేనివారు చాలా మంది ఉన్నారు. కా.రా. కథలు చదివించవు అనే రచయితలు, విమర్శకులు చాలామంది ఉన్నారు. పైకి అట్లా అనలేక పోయినా, ఎందుకంటే రా.వి. శాస్త్రి మెచ్చుకున్న కథకుడు కనుక. రా. వి. శాస్త్రి కథలకు అలవాటుపడ్డ వాళ్ళకు కా. రా. కథలు ఎడకపోవడంలో ఆశ్చర్యంలేదు. కా. రా. కథలు పాఠకుడి ఎందు ఒళ్ళు పెంచుకోవు. పాఠకుడు బుజంమీద చెయ్యివేస్తాడేమోనని బెరుగ్గా ముడుచుకుపోతు న్నట్లనిపిస్తుంది. కాని నిజంగా స్నేహం చెయ్యగలిగితే చిరంగా నిలిచే స్నేహమది

5 కోర్టుకెళితే ఏం జరుగుతుందో రా వి. శాస్త్రి కథలు చెపుతాయి.

6 'అయ్యో పాపం రథ చక్రం నేలలో క్రుంగిపోయింది. అతడు రథం దిగి చక్రాన్ని పైకి లాగుతున్నా . అలాంటప్పుడు అతనిపై బాణం వెయ్యరాదు' అన్నట్టు.

7 నాటు మంత్రసానిని నమ్ముకోవద్దు. నొప్పులు కనిపించగానే దగ్గరలో ఉన్న ప్రభుత్వ ఆసుపత్రికో, ప్రైవేటు నర్సింగ్ హోమ్‌కో వెళ్ళవలెను (ఈ రెంటిలో ఎక్కడకు వెళితే ఏమవుతుందనేది వేరే కథ.) అని చెప్పడం ఈ కథా భాగం యొక్క ప్రయోజనం. పిల్లను ఏ విధంగా తోమవలెను, నొప్పులు కనిపించగానే గర్భిణి తీసుకొనవలసిన జాగ్రత్తలేవి మొదలైన విషయాలు హేతువాద దృష్టితో వివరించవలసిన అవసరం సమాజం కా. రా. కు కలిగించకుంటే అతని కథలు యింకా లోతులకు వెళ్ళడానికి అవకాశముండేది.



శ్రీ ఇంగువ కార్తికేయశర్మ

# గుంటుపల్లి గుహాలు బ్రాహ్మీ శాసనములు

*(గత సంచిక తరువాయి)*

## శాసనము - 8

(చిత్రము 10)

ఈ శాసనము ఐదు పంక్తులలో నున్నది. ఇదియును మండప స్తంభముపైననే కలదు. అక్షర శైలిపై శాసనము బోలి యున్నది.

### పాఠము :

1. సేటగిరిబ గహపతి పుతస నంస్థగ
2. యప ధదక పవకస ఘస గగన
3. (గ) జహాసయా ఇమం యచ దేణో జిల
4. పతకానం మహానాగ పవతె ల (మ)
5. (థ) వెతభో దేయధమా సఘస దాన

రెండు దానముల వివరణము గలదు. మొదటిది ఛందక పర్వత సంఘమున శిల్పపటము. ఈ పటము శాసనమున గగన గజ హాసుయా ఇమం అని వర్ణింపబడినది. ఇది బహుశ శ్వేత హస్తి ఆకాశమునుండి దిగుచున్నట్లు చూపు పటమని యూహింప నగును. రెండవది మహానాగపర్వత సంఘమున మండప స్తంభమునకు చిత్రితమైన పతాకము. ఇది ధ్వజమన్నమాట. సంఘము యొక్క లాంఛనము గల్గియుండెను కాబోలు. ఇట్టి యాచారము చాల ప్రాచీనమైనది ముఖ్యముగా హిందు దేవాలయముల గర్భ గుడికి నేరుగా ధ్వజస్తంభము, దీపస్తంభములుండుట పరిపాటి.

## శాసనము 9

(చిత్రము—11)

ఈ శాసనము నేల పరుపురాతి పైని యున్నది. మొదలు చివరన గూడ యక్షరములు శిథిలమైనవి.

"———పవత నివాసిస ఘరణి అఘహిలానస్ది నావికానం అయుధమ్మ సేనాని అతెవాస ·———"

ఈ దానము నాగపర్వతమున వసించు అఘహిత సన్దియను గృహిణి; నావికుడైన ఆర్య ధర్మ మరియు నొక సేనాని గావించి నది. ఈ శాసనలిపి దరువాతి సాతవాహన లిపికి చేరువగా నున్నది. అక్షరముల కొనలు, వంపులు తీర్చుకొనుచున్నందున (శాసనము—10వలె), 2వ శతాబ్ది మొదటి భాగమునకు చెందినదై యుండు నని చెప్పనగును

## శాసనము 10

(చిత్రము—12)

ఈ శాసనము మరియు 12వది ఒకే మండప స్తంభముపై నుండుట విశేషము. మొత్తము ఆరు పంక్తులున్నది. శాసనలిపి చక్కటి వరుసలలో, నలు చదరములైన, చక్కటి యక్షరములు, చివరల వొంపులతో కూడుకొని యున్నది.

### పాఠము :

1 సిద్ధం గహపతినో హంఘస
2. ధరి యు ఉపాసికాయ బుధ (ధి)
3. య దెయధమ ఇనం మి మహా
4. సేల మథవేజస ఖంభా
5. మహానాగపవతె అరియసం
6. ఘస పటి ధపిత

శుభం! ఈ శిలాస్తంభమును మహా నాగపర్వతముపై నున్న ఆర్య సంఘముయొక్క మహాశైల మండపమున గృహపతి హంఘుయొక్క భార్య వుపాసిక బుధ్య దేయ ధర్మమునకుగా ప్రతిష్ఠించెను.

## శా స న ము 11

విరిగిపోయిన నేలరాతిపై నున్నది. శాసన పాఠము పూర్తిగా లేదు. సాతవాహన–ఇక్ష్వాకు కాలపు ప్రాకృత లిపి గల్గియున్నది. క్రీ. శ. 2 3వ శతాబ్దికి చెందినది.

———"దుహుత యాచ సంఘిదా (సం)"–

———కూతురైన సంఘిచే దానము.

పై దాన శాసనము లన్నింటిని సమన్వయపరచి పరిశీలించిన కొన్ని ముఖ్య ప్రదేశములు, అప్పటి వృద్ధిలోనున్న సంఘముల గూర్చి మొట్ట మొదటగా తెలియుచున్నవి.

గుంటుపల్లి గుహలయములు, బౌద్ధ స్తూపములున్న పర్వతము, ప్రాచీనముగ మహానాగ పర్వతముగా ఖ్యాతిలో నుండెను. ఇప్పటికిని ఏలకర్ర గూడెము నాసుకొని పశ్చిమముగా నాగులవల్లి యను శివారు గ్రామమున్నది. ఇప్పటున్న శిథిలములు "నాగ దేవుల పా"నా పేర్కొందురు రోడ్డునానుకొనియే పెంచోట్ల చిన్న స్తూప కట్టడములు–పునాదులు, చెక్కిన రాళ్ళు కానవచ్చుచున్నవి వేరువగాని నొక మూడు పడగల నాగ శిల్పము నొకగదిలో ఉంచి గ్రామదేవతగా పూజించుచున్నారు. గుంటుపల్లియే పెటుంద్ర యను వాదము నిరాధారము. అమరావతి శాసనములు ఆర్య ఆచిర్య అను బౌద్ధ భిక్షు నాగపర్వతముపై చెక్కు పెట్టడము నాపించెననియు, బాగు వేయించెననియు తెలుపుచున్నవి. (నాగపవతే మహా నవకాముకస అకియ ఆదితస)

## సే ట గి రి :

ఈ పర్వతము నాగార్జున కొండలో నుండెనని సిద్ధులది. ఇక్ష్వాకు రాజుల కాలమున యిచ్చట బౌద్ధారామము యుండినది



చిత్రము – 10 : శా స న ము – 8

అంతకు పూర్వమున గూడ ప్రసిద్ధిగా నుండినదుల గౌతమీపుత్ర సాతకర్ణి నాశిక శాసనములో 'సేటగిరి'కి ప్రస్తావన కలదు ఇక్ష్వాకుల యనంతరము, యిచ్చట నొక విశాలమైన అష్టభుజస్వామి దేవాలయ సముదాయము వెలసియుండెను.

## వేధగిరి లేక వేటగిరి :

ఇది బహుశ జగ్గయ్యపేట బౌద్ధారామమున్న కొండ వేటగిరి యై యుండవచ్చును. లేక వేదశైలరే నేదపర్వతముగా ఖ్యాతి బడసిన పక్షితీర్థము కొండ గావోలు. ఈ చోటు తమిళ నాడులోని చెంగల్పట్టు సమీపమునగల తిరుకళు కున్రం గా తెలుసు కోనగును. తెరుయన శ్రీ 'కళిర' యను గ్రంథము; పుణ్యక్షేత్రము పర్వతము; ఈ కొండ కి పేరు బౌద్ధ మునుల వలన వచ్చినట్లు తోచుచున్నది. రాజగృహ పురోని గృధ్రకూట పర్వతము పెట్లు పవిత్రమో, బౌద్ధులకు దక్షిణమున బహుశ యిది కూడ నట్లే యుండెను కాబోలు. పరియును ఆంధ్ర ప్రాంతమును సున్న విహారముల కంటె పక్షి తీర్థమునందున్న బౌద్ధారామమునకు క్రీ. శ. 1–2వ శతాబ్దిలో యెక్కువగా సంబంధమున్నట్లు చెప్పవగును. ఇట్టి మత వ్యాపార సంబంధ ముండుటలో యెట్టి యనుచితము కానరాదు. ఇది లనాదిగా ఒకరినొకరి కాలమునుండి వచ్చుచున్న సాంఘిదాయముగా గమనింపవలెను

## ఛందక పర్వతము :

ఈ నామము సిద్ధార్థుని సారథియైన ఛందకుని నామం తెలుపు గల్గియున్నది. నాగార్జున కొండలో నొక గొప్పదానశ్రేష్ఠి కుమారుడు ఛందక పర్వత వాసిగా పుని నిరువురిసును. అమరావతి శాసనము గూడ ఛందక పర్వతవాసి స్తూపదానము దాని నిప్పటికుం పేర్కొనబడియున్నది. ఈ పర్వత మెచ్చటనున్నదో నిర్ధారణగా చెప్పజాలము కాని నాగార్జునకొండ – అమరావతి ప్రాంతములకు చేరువగా నుండవలె.

## సు ర క :

'సూర్పరక' లేక 'సోపార', రాణాజిల్లా బొంబాయికి 60 కిలోమీటర్ల దూరమున పశ్చిమ కోస్తా రేవు పట్టణము. సాతవాహనుల కాలము ప్రపంచ ఖ్యాతి చెందిన నౌకాయాన వ్యాపార కేంద్రము. ఇచ్చట వ్యాపారులు బౌద్ధమతానకుల్తులు.

## మహానావిక : నావిక :

శాసనముల వీరిని గూర్చి ఎరుదుగ తెలియుచున్నవి. ఈ నావిక, మహానావికులు గొప్ప ఓడల నడుపువారు. వీరు బౌద్ధ మతమును హిందూ ధర్మమును పలుచోట్లకొనిపోయిరి. ముఖ్యమైన ప్రాచీనరేవుపట్టణములమై సోలియ(మచిలీపట్టణము),కంట

కోస్యల (ఘంటసాల), పితుండ (పెదవేగి), ధాన్యకటక(అమరావతి) మొదలగునవి. ఘంటసాలలో లభ్యమయిన ఆయక స్తంభ శాసనము మహానావికుని భార్య యొసగిన దానమును గూర్చి తెల్పుచున్నది. ఈ నావికులు విదేశ యానములోనుండ, వారి భార్యలు బౌద్ధము నుద్ధరించుచుండిరి. ఒరిస్సాలోని రత్నగిరి యనుచోట ప్రాచీనమైన రక్తమృత్తిక విహారము గలదు. ఇచ్చటినుండి ఒక మహానావికుడు మలయా ప్రయాణించినటుల క్రీ. శ. 3–4వ శతాబ్ది శాసనము తెలుపుచున్నది. గుంటుపల్లిలోని మహానాగ పర్వతము దేశీయ, విదేశీయ బౌద్ధక్షేత్రములతో సన్నిహిత సంబంధము గల్గియుండెననుట కెట్టి సందియములేదు. జైన గ్రంధమైన ఉత్తరాధ్యయన సూత్రము (ఖండము–21), పిహుండ సముద్రతీర పట్టణముగాను మహావీరుని కాలమునాటికే నావికులు వ్యాపార రీత్యా చంపానగరము నుండి సింహళమువరకు రాకపోకలు చేయుచుండినటుల తెలుపుచున్నది.

## 12 : శాలంకాయన మహారాజు

## శ్రీ విజయనన్దివర్మ కాలపు శాసనము:

(చిత్రము—12)

ఈ శాసనము మండప స్తంభముపై గలదు. పైన క్రీ. శ. 2వ శతాబ్ది శాసనము (10) కలదు. దీనికెట్టి యవరోధము గల్గింపక, శాలంకాయన రాజైన విజయనందివర్మ(400–430) కాలమున మరల నిదే మండపస్తంభముపై రాజశాసనము చెక్కబడుట నొక విశేషము. ఇట్లే మహానాగపర్వతముపైని బౌద్ధారామములు మూడు శతాబ్దములు నిరాఘాటముగ నిలచి వృద్ధి చెందుటయేగాక రాజపోషణకు గూడ నోచుకొన్నవి. శాలంకాయనులు బౌద్ధము నాదరించిరని చెప్పుట కీశాసన మొకటియే యాధారము. మనకింతవరకు శాలంకాయన వంశజుల చరిత్రగూర్చి వార్చ సగిన తామ్రగుదుల వల్లనే తెలియుచున్నది ఇది శాలంకాయనుల తొలి శిలాశాసనము. 23– పంక్తులున్నవి. భాష సంస్కృతము. లిపి బ్రాహ్మి, పంక్తులు 1–8 వరకు చదువవీలగు స్థితిలో నున్నవి. దాచేపల్లి నున్నపురాయి యగుటచే అక్షరములు చాలవరకు అరిగిపోయి పంక్తుల ప్రారంభమున బాగున్నను, చివరపూర్తిగా రాయి పెక్కులు లేచిపోయి పాఠము అసంపూర్ణమైనది. అంత్య పంక్తులు 10 – నుంచి– 23 వరకున్ను, యెక్కడో కొన్ని యక్షరములు తప్ప, చదువ వీలుగాకున్నది.

వ్రాతశైలి కొన్నినూతనాంశముల తెలుపుచున్నది. ఇక్ష్వాకు శాసనముల బోలి చక్కటి నుడికారములతో నుండి, సంయుక్తాక్షరములు మరికొంత వంపులు దిరిగి పెట్టెవలె తలకట్టు తీర్చుకొన్నవి. ఈ బ్రాహ్మి శైలి వాకాటక – కదంబ నృపుల శాసనముల బోలి యున్నది. వీరి తామ్ర పట్టికలపై నున్న యక్షరముల తీరు భిన్నముగా తోచుచున్నది. దీనినిబట్టి, వ్రాతతీరు వ్రాయు పరికరములు, వస్తువును బట్టియుండును. కాని కేవలము శాసన ప్రదేశము వానినొసగిన రాజవంశములపై నాధారపడదని చెప్పనగును. ఇటీవల లిపి పరిణామములపై వచ్చిన కొన్ని వాదములు -ముఖ్యముగా పల్లెల (Rural), పట్టణ (Urban), వ్రాత శైలీ భేదములు; అట్లే పూర్వ వాదములైన, వేరు వేరు బ్రాహ్మి లిపి శాఖలు, (తూర్పు, ఉత్తర – దక్షిణ), మొదలయినవి కేవల మాధార రహితములగా తోచుచున్నవి. ప్రాకృత భాషలో ప్రాంతీయ భేదములున్నవి గని లిపి శైలిలో నట్టి ప్రాదేశిక రూపములు క్రీ. శ. 5వ శతాబ్ది వరకును కానరాదు. ఈ భాషా భేదములు పెరిగి, వివిధ ప్రాంతీయ రచనా శైలుల కనువుగా లిపి పరిణతి చెందినది. నూతన రీతుల కూర్చుకొని ప్రత్యేక లిపులు – భాషా వికాసమున కనువుగా క్రీ. శ. 8–9 శతాబ్ది నాటికి రూపొందినవి.



చిత్రము – 11 : శాసనము – 9

## శాసన పాఠము

1 స్వస్తి శ్రీ విజయవెఙ్గీ పురాశాలఙ్క్య కులా మలాకాశ
శశాఙ్కస్య భగవత్తా మ్మ మహాశ్వక ...................

2 విష్ణు గృహ చాతుర్వ్వి ద్యా శాలాద్య నేక వి (వ) తస్య
కర్మపరిప్ర... ... శ్శరీరస్య నానాప్రకా ..................

3 రస విజయస్య మహారాజ సదృశ వస విసర్గస్య భూ
పతిణో ... ... ...

4 వర్మ ధర్మ మహారాజస్య ప్రపౌత్రః పిత్రు కర్మ పరా
యణ స్యానేక గో సహస్ర ... ... . ...

5 నప ధర ప్రదానార్జిజ్జత ధర్మస్య పూ జితా స్వీకర
స్య శ్రీ నన్దివర్మ మహారాజస్య పౌత్రః ... ... ... ... ...

6 శాప కారాప హార కే స్వప్రతీకారస్య ప్రతా పోపన
త సామంతస్య ప్రభూత శ్రీ క ...............

7 ప్ద్విప స్వక్ష్య ఒణ్ణ దణ్డస్య మహారాజా ఒణ్డ వర్మ
(పుత్రో), భగవచ్చిత్ర ... ... ... ...

8 ధ్యాత బప్ప భట్టారక పాదభక్త స్య పరమ భాగవ
తశ్శాల ... ... ... ... ...

9 విజయ నన్ది వర్మనః ... ... ... .. ... ... ... ... ...

10 యశః కుల గోత్రాభి వృద్ధయత్ ... ... ... ... ... ...

11 ... ... ... భగవతో బుద్ధ స్య (శ్చ) ... ... ... ... ...

12 ... ... ... .., ... లో కా గ ... ... ... .. ... ... ...

13 .. .. ... .. ... ... రాజిన ఆత్మ ... ... . .. ...

14 ... ... ... ... సిద్ధార్థ కానాం విహా ... ... ... .. ...

15 ... ... ... విహా రాయ ప ఏ భ్రాత శర ... ... ... ...

16 ... ... ... మహా విహా రాయ న ... ... ... ... ... ...

పంక్తులు 17 నుంచి 20 - వరకు పూర్తిగా అరిగి పోయినది.

21 నస్య తదా ఫలం! షష్టి వర్ష సహస్రాణి ..............

22 తాన్యేవనరకేవసేత్! భూమి దానాత్పర...స్థానం ........

23. (న) భవిష్యతి!.........



చిత్రము-12: శాసనములు, పైన-10, క్రింద-12

## ముఖ్యాంశములు :

ఈ శాసనమువలన శాలంకాయనుల వంశక్రమము, నాలుగు తరముల వివరములు తెలియుచున్నవి. మొదటి పంక్తిలో కుల నామము—శాలఙ్కకుల యని యున్నది. శాలంకాయన యనుగోత్ర ఋషినిబట్టి ఈ రాజవంశమునకీ నామము వచ్చినది. ధారికాటూర శాసనమున ఆచండవర్మ ''శాలంకాయన సగోత్రస్య'' యని చెప్ప కొన్నాడు. ప్రవరకాండమున శాలంకాయనులు త్రైయార్షేయులుగా పేర్కొనబడియున్నది. శాలఙ్క యనునది గోత్రనామము. ఆయన ప్రత్యయముతో కూడి శాలంకాయన రూపమైనదిగా పాణిని అష్టా ధ్యాయిలో సూత్రీకరించియున్నాడు. (నడాదిభ్యఃఫక్ IV–1–99) శివలెంక యను యింటిపేరుగూడ నీ శలఙ్క గోత్రనామము నుండియే వచ్చినట్లు తెలుసుకోనగును. క్రీ. శ. 1వ శతాబ్దినాటి టాలెమీ వీరినే శాలన్కానాయ్‌గా పేర్కొని మైసోలియా కుత్తర మున పాలించుచున్నట్లు చెప్పియున్నాడు. అంతకు చాల పూర్వీకు డైన పాణిని వీరిని స్వతంత్ర గణముగా యుత్తరభారతమున నుండి నటుల తెలుపుచున్నాడు. వీరు గోదావరి--కృష్ణతీరముల కెప్పుడు వచ్చిరో గట్టిగా చెప్పజాలకున్నాము.

ఈ వంశజుల శాసనములబట్టి వీరు క్రీ. శ. 3–4వ శతాబ్ది మొదటి భాగమున వేంగిని రాజధానిగా చేసుకొని పాలించు చున్నటుల తెలియుచున్నది. మొదటిరాజు శ్రీ విజయదేవవర్మ (క్రీ. శ. 320–40). ఈతడు పరమమాహేశ్వరుడు.

శాసనమున వంశక్రమము మహారాజ హస్తివర్మ (క్రీ. శ. 340–50),తో ప్రారంభమయినది. ఈతడు శాలఙ్క కులామలా కాశ శశాంకుడు. అనేక విష్ణుగృహ, చతుర్విద్యాశాలల ప్రతిష్ఠిం చెను. సద్బుశవస విసర్గునిగా, ధర్మమహారాజుగా శ్లాఘింపబడి యున్నాడు. కొనుకొల్లు శాసనమున--''అనేక సమరావాప్త విజ యినః''యని కూడ చెప్పబడియున్నాడు. పరిశీలించినచో నీ హస్తి వర్మ నృపుడు యుత్తర భారత చక్రవర్తి సముద్రగుప్తునిచే నిజ ముగ నోడింపబడెనా? యను సంశయము కలుగుచున్నది. అలహా బాదు ప్రశస్తిలో నీ ప్రసక్తి కేవలము స్వోత్కర్షతో కూడిన వర్ణన కాబోలు !

ఈతని పుత్రుడు మొదటి నన్దివర్మ క్రీ. శ. 350–390; ధర్మ కర్మ పరాయణుడు. ప్రధానా పార్జిత దర్పస్య, పూజితాన్వీక రస్య'' యని చెప్పబడినాడు. ఈతని కొడుకు (ఆచండవర్మ390–95). కొలది కాలమే రాజ్యము గావించినను ఉగ్ర దణ్డుడుగా ఖ్యాతిగాంచెను. లపకారికి నుపకారముచేయు సహృదయుడు. మంచి బలవంతులైన సామంతుల కల్గియుండెను. శాసనకర్తయైన విజయనన్దివర్మ (2), ఆచండవర్మ పెద్దకుమారుడు. చిత్రరథ స్వామి పాదానుధ్యాతుడు. బప్ప (అనగా తండ్రి), భట్టారక పాద భక్తుడు. పరమ భాగవతోత్తముడు.

ఇక వీరి మత శాఖలను, యిష్టదేవతలగూర్చి వివరింతును. విజయ నన్దివర్మ పరమ మహేశ్వరుడు. ఆదిలో బహుశః వీరు శివ భాగవతులు కాబోలు. పాతంజలి మహాభాష్యమున శివభాగవతుల, విష్ణుభాగవతుల ప్రసక్తి చేసి, వీరు మొదట్లో పశ్చిమోత్తర దేశ మున గాంధార — హిమాలయ ప్రాంతముల నుండినటుల చెప్పి యున్నాడు. శాలంకాయనులు ఆ తీరమునుండియే దక్షిణమునకు చేరినట్లు తోచుచున్నది. రెండవ రాజైన హస్తివర్మ పరమ భాగ వతుడు. నారాయణ పరిణారవిన్దుడు. ఆ తర్వాతి నృపులందరు పరమ భాగవతులు. ఆచండవర్మ కాలమునుండి చిత్రరథస్వామి పాదానుధ్యాతులైరి. ఈ చిత్రరథస్వామి సూర్యనారాయణుడు, మహావిష్ణు అంశ. పెద్దవేగి పట్టణమున వీరి కులదైవమైన యీ చిత్రరథస్వామికి ఆలయములుండెను. విజయనన్దివర్మ పెద్ద వేగి శాసనమున త్రైలోక్యనాథ విష్ణుగృహ స్వామిదేవాలయమునకు గ్రామ దానము గావించినటుల కూడ తెలియుచున్నది. కాంతేరు తామ్రముద్రల చిహ్నముపై సూర్య చక్రమున్నది.



చిత్రము -- 13 : శాసనము -- 13

ఈ విజయనన్దివర్మ చాల పితృభక్తుడు. తన పూర్వీకుల వలె, సర్వమతముల పోషించెను. ముఖ్యముగ చతుర్విద్యాశాలలను రథకారకులజులు నడుపుచున్నట్లు తెలియుచున్నది. వీరు శూద్రు లైనను వేదాధ్యయనమున కర్హులు. ఆపస్తంభ గృహ్యసూత్రముల ప్రకారము కర్మక్రతువుల నాచరించుచుండిరి. ఈ రథకారకులము వారు విశ్వబ్రాహ్మణులుగా నెరుగవలెను. ఈ నాటికిని వీరు, గుంటూరు, కృష్ణా, తూర్పు–పశ్చిమగోదావరి జిల్లాలలో పేరెన్నిక గెంది యున్నారు. ఈ రథకారులే పంచాణమువారుగా (కంసాలి, కమ్మర, కంచర, కాసె మరియు వడ్రంగి) వారి వృత్తులబట్టి ఖ్యాతికి వచ్చిరి.

పదవ పంక్తినుండి చాలవరకు శాసన పాఠము దెబ్బతిని పోయినది. అప్పటప్పట కొన్ని పదములు మాత్రమే తెలియుచున్నవి. వీటినిబట్టి యిచ్చటి మహావిహారమున కొనర్చిన భూరి దానము గూర్చి వివరణమున్నటుల విదితమగుచున్నవి. పంక్తులు 21, 22 మరియు 23లలో శాపాశీర్వాదముల దెల్పుశ్లోకములున్నవి. అంత్యమున బహుశ రాజ్య కాల వివరణముండి యుండవచ్చును. చదువుటకు వీలుగాని స్థితిలో యక్షరములు అరిగియున్నవి. కాన నిర్ధారణగా చెప్పజాలము. శాలంకాయనులు బౌద్ధమతము నుద్ధరించిరనుటకీ శాసనము ప్రబలయాధారము. వీరు బౌద్ధమును ప్రాచీనముగ బర్మాదేశమున వ్యాప్తి జేసిరను సాంప్రదాయమున్నది. మొదటి నంది వర్మ "వివిధ ధర్మప్రధానస్య" యని చెప్పుకొంటిమిగదా! మహానాగపర్వత విహారములు క్రీ. శ. 1వ శతాబ్దినాటికే పెక్కు బౌద్ధారామములతో సంబంధముండినట్లు చెప్పుకొంటిమి. ఇట్టి మతాచారమును శాలంకాయనులు మరింతగా పోషించినట్లు కనబడుచున్నది.

## శాసనము 13

(చిత్రము—13)

ఈ శాసనము నాలుగు పంక్తులలోనున్నది. లోతుగా మలచిన పెద్దయక్షరములు, ఎలు పదరపు పలకపై చెక్కబడి యున్నవి. లిపి శాలంకాయన– విష్ణుకుండినుల తామ్రశాసనముల బోలియున్నది. భాష ప్రాకృతమైనను, సరూప బహుయిష్టమై బౌద్ధ ధర్మసూత్రములను తెల్పుచున్నది.

## శాసనపాఠము :

1. దుఖ దుఖి సముత్పాదం
2. దుఖస్య వెతిక్రమం
3. అరియంచ్ఛ అజంగిక మ
4. తిం దుఖోప సమసామికం

ఈ ఆఖరు పంక్తిని ఖేదం ఖోపసమ సామికం : యనికూడ చదువ వీలగుచున్నది.

ఈ మూల సూత్రము బౌద్ధమతములోని నాల్గు మహత్తర సత్యముల చెప్పుచున్నది. (చత్వారి ఆర్య సత్యాని) దుఃఖము, సముదాయము, నిరోధము, మార్గము, ఇట్టిమతతత్త్వమును బోధించు రాతి మట్టి బిళ్ళలు, బౌద్ధ క్షేత్రముల పెక్కులు లభించినవి. రాజ గృహ, నాలంద, రత్నగిరి (ఒరిస్సా) లలోనే గాక, ఆంధ్రమున రామతీర్థము, సంకరము, అమరావతిలలో దొరికినవి. కాని ఈ విధముగ నాల్గు ఆర్య సత్యముల బోధించునట్టివి, మన యాంధ్రమున యింతవరకు దొరకలేదు. ఈ పలక క్రీ. శ. 5 – 6 వ శతాబ్దికి చెందినదిగా తోచును. నాలందాలో లభించిన ప్రతీత్య సముత్పాదీ సూత్రమున, దుఃఖ స్కంధమును గూర్చి వివరణ యున్నది, కాని పై పాఠమును బోలియుండలేదు.

## శాసనము - 14

(చిత్రము — 14)

ఈ శాసనము కంచు విగ్రహ పీఠము చుట్టును వున్న పద్మ దళములపై యున్నది. ఇది పూజా విగ్రహముగా నుండెను. నాగరి లిపిలో ఘంటాణముతో పూరేకులపై చక్కగా వ్రాయబడివున్నది. వ్రాత శైలినిబట్టి క్రీ. శ 9–10 శతాబ్దికి చెందినదిగా తెలియవచ్చినది. ఈమూర్తి బోధిసత్వ పద్మపాణి. ప్రభావళి, కిరీటము, మెడలోని మాల, చేతిలో పొడుగైన కాండముతోటి పద్మము, కుడి



చిత్రము – 14 : శాసనము – 14

ప్రక్కన పీఠము నానుకొని నమస్కారము చేయుచున్న భక్తుడు గలడు. మాలలోని దళముల బంగారు పోత యున్నది. భాష సంస్కృతము, శ్లోకమున బౌద్ధ ధర్మ మంత్రము కలదు.

హే ధర్మా హేతు ప్రభావా హేతుం తేషాం
తథాగతో హ్యావదాత్ !
తేషాంచ యోనిరోధా యేవం వాది
మహా శ్రమణః !!

ఈ విగ్రహము క్రొత్తగా బయలుపడిన చిన్న గుహలో క్రీ. శ. 9–10శతాబ్దికి చెందిన శిథిలమైన యిటుక కట్టడములపై లభించినది.

పై శాసనములన్నింటిని బట్టి గుంటుపల్లిలోని మహానాగ పర్వతము క్రీ. పూ. 3వ శతాబ్దినాటికే దక్షిణ దేశమున ప్రముఖ బౌద్ధ పీఠమై ధనకటకము (అమరావతి) వలె ఖ్యాతి బడసినది. ముఖ్యముగ హీనయాన బౌద్ధుల వర్షావాసమున కనువగు గుహా విహార సముదాయముతో పవిత్రస్థలముగా నుండినది. యేదో నొకమారు జైన వ్యాప్తికీ ప్రదేశమున భూమిక లభించినను బౌద్ధమున కెట్టి యాటంకము రాలేదు. క్రీ. శ. 1వ శతాబ్ది నుండి పెద్దపెట్టున విహారములు, మండప నిర్మాణము మరింతగా గావింపబడినట్లు పలు శాసనముల వలన తెలియుచున్నది. నాగపర్వత మీ కాలము నుండి మహాయాన బౌద్ధమునకు స్థానమై ఖ్యాతిలోనికి వచ్చినది. స్తూప చిహ్నములు గల్గిన ఆలయములతోబాటు, బుద్ధ విగ్రహముల నెక్కింటిని ప్రతిష్ఠించి పూజించుట యాచారమైనది. ఈ నల్లరాయి (ఖోండ లైటు), శిల్పము చెక్కుట కనువు గాదు. అందువలననే కాబోలు నీ మహాయాన కాలమున క్రొత్తగా గుహలేమియు తొలపబడలేదు. పెక్కు రాతి యిటుక కట్టడములు గావింపబడినను, అలంకరణకుగా చెక్కడములు, బౌద్ధ ప్రతిమలు, దాచేపల్లి సున్నపురాతిని సమకూర్చబడినవి.

వజ్రయానము ప్రబలియుండెనని చెప్పజాలము కాని, కొంత మేరకు వ్యాప్తి చెందిన దనుటలో సందియము లేదు. పైన వివరించిన బోధిసత్వ పద్మపాణి కంచు ప్రతిమ భిక్షువుని పూజా విగ్రహము కాబోలు. క్రీ. శ. 10వ శతాబ్ది వరకును బౌద్ధము నిరాఘాటముగ నిచ్చట ప్రచారములో నుండెను.

ఆ తర్వాత కూడ నీ ప్రదేశమున పెద్ద మార్పు కూర్పు లేమియు కానరావు. ఇటీవల రెండు శతాబ్దముల నుండి గాబోలు, మొదటి గుహలోని వృత్త చైత్యమును, ధర్మలింగేశ్వరాలయముగా పేరిడి యెత్తైన రాతి చైత్యమును పూజించుట వాడుకైనది. గుహా ద్వార ప్రాంగణమున గంది నొకదాని నుంచిరి స్తూపమును శక్తి లింగముగా భావించి బిడ్డలులేని పడతులు నీ స్తూపము చుట్టును ప్రదక్షిణము చేసి గాఢముగ నాలింగనము చేసుకొనుట యాచారమైనది. ముఖ్యముగ శివరాత్రి నాడిచ్చట పెద్ద జాతర జరుగుచున్నది.

## ఉపయుక్త రచనలు


1. A. H. Longhurst, "The Buddhist Monuments at Guntupalli" Krishna district, Annual Report, Archaeological Department, Southern Circle, 1916-17 (March, 1917). PP. 30-35.
2. Indian Archaeology – A Review, 1961-62, P. 97; and 1968-69, P. 64.
3. R. Subrahmanyam, "The Guntupalli Brahmi Inscription of Kharavela" A. P. Govt, Archaeological Series, No. 3. (Hyderabad, 1968).
4. D. C. Sircar, "An Alleged Inscription of Kharavela" Journal of Ancient Indian History III, PP. 30-36. (Calcutta, 1969-70).
5. I. K. Sarma, Epigraphical Discoveries at Guntupalli, paper read at the Epigrophical Society of India, (1978.)
6. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, "సంచివర్మ పెద వేగి శాసనము", భారతి (August, 1924)


( అయిపోయింది )



శ్రీ కలువకొలను సదానంద

# అందరూ నిద్రపోతున్నారు!

భోజనాలు చేసి అందరూ డాబా మీదికి వెళ్లేసరికి పన్నెండు గంటల రాత్రి అయింది. తండ్రీ కొడుకులిద్దరూ పిట్టగోడ దగ్గరకు జరిగి కూర్చున్నారు.

'లోకం నానాటికీ చెడిపోతూవుందిరా అబ్బాయ్!' అంటూ నిట్టూర్చాడు రాజశేఖరం. చంద్రశేఖరం మాట్లాడలేదు.

ఆ రోజు బడిలో వార్షికోత్సవం జరిగింది. తెర తొలగగానే రికార్డుపాట మొదలైంది. తెరచాటు నుండి ఓ కన్యకామణి రివ్వున రంగం మీదికి పరుగెత్తుకొచ్చింది. చింతపిందెలాంటి చిన్నది. సీతాకోకచిలుక రెక్కల్లాంటి చేలం కట్టుకొన్నది. మెరుపు తీగలోని వంపుసొంపులన్నీ తనలో నింపుకొన్నది. అప్సరసలతో సైతం అందంలో పందెం వేయగలది. కోడెవయసు కుర్రకారుకు గంగవెర్రులెత్తించగలది. బేబీ!...దాచుకున్న అందాలను, డెందంలోని వాంఛలను 'వహ్వా!' అనిపించేటట్లుగా ప్రదర్శించింది.

'ఒకడు రావాల
అతడు రావాల
నాకు నచ్చినవాడు
నన్ను మెచ్చిన వాడు
ఒకడు కావాల...'

...ప్రేక్షకులందరూ రెండు మూడు నిమిషాల పాటు తనువు మరిచిపోయారు. పరిసరాలు మరిచిపోయారు. డ్రామా చూస్తున్నట్లుగాక, సినిమా చూస్తున్నట్లే వుంది వాళ్ళకు. రంగు రంగుల స్పాట్ లైట్ల కాంతిలో బేబీ సాక్షాత్తూ వరూధినిలాగా వెలిగిపోతూ, వంపులూ, సొంపులూ, వయ్యారాలూ వెదజల్లుతూ వుంది. ఆమె ఆడుతూ, పాటకు తగ్గట్లు పెదవులు కదుపుతూ వుంటే, స్వయంగా తనే పాడుతూ, తనకు నచ్చినవాడికోసం వెదుకుతూ వున్నట్లుంది.

నృత్యం పూర్తికాగానే స్టేజి నుండి టిక్కెటు గేటువరకు జనంతో క్రిక్కిరిసిపోయిన ఆడిటోరియమంతా చప్పట్లతో మారు మ్రోగిపోయింది.

బేబీ మరి రెండు డాన్సులు చేసింది.

'అరె ఖుషీఖుషీ చేస్తేనే కలుగు హుషారు,

బలేబలే మోగునులే వలపు సితారు,

వలపుమజా చూపిస్తా ఇటురావోయీ...' అని ఒకపాట.

'ఇందా ఇందా తీసుకో!

ఇపుడే సొంతం చేసుకో!' అని మరో పాట.

రెండూ సినిమా రికార్డులే!

ఆమె తల్లీ, తండ్రీ, అన్నయ్య, చదివిన అందరూ ఆ నృత్యాలు చూశారు.

'బేబీ డాన్సు చెయ్యటం నువ్వు చూశావ్రా?' అన్నాడు రాజశేఖరం.

బేబీ అతని రెండో సంతానం. పదో తరగతి పరీక్ష వ్రాయబోతున్నది.

'దేవుడిచ్చిన పాపిష్టి కళ్ళు వున్నాయి కదా నాన్నా!' అన్నాడు చంద్రశేఖరం.

'బాగున్నాయా డ్యాన్సులు?'

'నీకు బాగున్నాయా నాన్నా?'

'దాన్ని కన్న తండ్రినిరా నేను! బాగుందని అనగలనా? సిగ్గుచేటు!'

'నేనూ దాని సోదరుణ్ణి!...నాకు మాత్రం బాగుంటుందా?'

'ఏమెందుకో తెలీదు. వాళ్ళందరికీ బాగుంది' అంటూ మళ్ళీ నిట్టూర్చాడు రాజశేఖరం.

'లోకం యిలా దిగజారి పోతున్నందుకు కారణం ఏమిటో తెలుసా నాన్నా?'

చంద్రశేఖరం ఉపన్యాసం అందుకుంటాడని తెలియని రాజశేఖరం 'ఏమిటుంటావు?' అని అడిగాడు.

'నిద్రపోకుండా విను. మనిషిలోని స్వార్థం, పశుప్రవృత్తి, మూర్ఖత్వం యివే నేడు సంస్కృతీ నాగరికతలకు పట్టిన చెద పురుగులు. సంస్కారం కలిగిన మనిషి తన ఆనందాన్ని ప్రకటించడానికి కొన్ని హద్దులూ, అడ్డాలూ పెట్టుకుంటాడు. ఒకడిలోనే దాచుకోవలసిన ఆనందం వుంది. ఇద్దరు మాత్రమే పంచుకోవలసిన ఆనందం వుంది. అందరికీ వెదజల్లవలసిన ఆనందమూ వుంది. ఒకరికో లేక ఏ ఇద్దరికో పరిమితమైన ఆనందాన్ని వీధిలో ప్రదర్శిస్తే ఏమౌతుంది? అందరూ నవ్వుతారు. కామ వికారం అంటారు. ఉన్మాద చేష్ట అంటారు. అందుకు భయపడే,

మనుష్యులు బట్టలు కట్టుకోవడం, పెరళ్ళూ మరుగుదొడ్లూ కట్టుకోవడం అలవాటు చేసుకున్నారు. కొన్ని రకాల ఆనందాలకు నిర్జన స్థలాలు, అభ్యంతర స్థలాలూ అవసరమనుకున్నారు. ఈ నియమాలు చేతలకే గాదు, మాటలకూ వర్తిస్తాయి. జంతువులకు ఈ అడ్డాలేవీ లేవు. అవి స్థల కాల నియమాలు లేకుండా ప్రవర్తిస్తాయి. వాటికి సిగ్గెగ్గులు వుండవు. మనిషి కూడా జంతుజాతికి చెందినవాడే! యుగాలు గడిచినా ఒడిలోని నెత్తురు రంగు మారనట్లే, వాడిలోని జంతు లక్షణం కూడా మారలేదు. మాటలూ, చేతలూ ఎంతో నాజూకుగా వున్నా, మనసులో మాత్రం జంతు స్వభావాలే! సంఘం వెయ్యి కళ్ళతో పహరా యిస్తూ ఉండటంవల్ల జంతువులా ప్రవర్తించటానికి దమ్ములేక,ఎక్కడైతే జంతు ప్రవృత్తి కంటబడుతుందో అక్కడల్లా మెడలు నిక్కించి చూస్తున్నాడు. అక్కడ మనిషి అనే మాయతొడుగు వూడిపోగా, జంతువైపోయి నవ్వుతున్నాడు. చప్పట్లు చరుస్తున్నాడు. 'హారెవ్వా' అంటూ మెచ్చుకుంటున్నాడు.

'మంచిచెడ్డల విచక్షణా పరిజ్ఞానం వున్నా, సగటు మనిషిని చెడు ఆకర్షించినంత త్వరగా మంచి ఆకర్షించలేదు. లేకపోతే ఈనాడు దేశంలో ఇందరు తాగుబోతులు, పతితులు, పాపాత్ములు వుండేవారు కాదు. చెడు ఎప్పుడూ పైకి తేనెలాగా వుంటుంది. మంచి వేపనూనెలాగా వుంటుంది. మనుషుల్లోని ఈ అభిరుచి, పశుప్రవృత్తి ఆధారంగా వ్యాపారం చేసుకుని, హాయిగా బ్రతక నేర్చిన స్వార్థపరులు దేశంలో ప్రబలిపోయారు. నోటితో చెప్పకూడని బూతుమాటలకు అక్షరరూపమివ్వడానికైనా వెనుకాడే పవిత్ర భారతదేశంలో నేడు సెక్స్ మ్యాగజైన్లు కాఫీనీళ్ళలాగా అమ్ముడు పోతున్నాయి. శృంగార సంబంధమైన పేర్లతో నెలకో కొత్త పత్రిక చొప్పున పోటీలమీద మార్కెట్టులోకివచ్చి దిగుతున్నాయి. నాన్నా! వాటిని నువ్వు చూడలేదేమోగానీ, ఒకటి రెండు పత్రికలు నేను చూడడం జరిగింది. చూడడమేం కర్మ! ... చివరిదాకా చదివించాయి అవి! నా ఒళ్ళు వేడెక్కిపోయిందనుకో! ఒక్కసారి ఆ పుస్తకంలోకి వెళ్ళిపోతే, ఇక పాఠకుణ్ణి అవి వెనక్కి పంపించడమంటూ జరగదు. అదొక అనంత స్వేచ్ఛా లోకం! అక్కడి స్వేచ్ఛకు సంకెళ్ళూ, సరిహద్దులూ వుండవు. 'నో అడ్మిషన్' బోర్డులుండవు. పాఠకుడు చీకట్లోంచి కూడా చూడగలడు. శోభనపు గదులలోకి, వ్యభిచార గృహాల్లోకి అదృశ్యరూపంలో వెళ్ళి సినిమా చూసినట్లు, సర్కస్ చూసినట్లు చూస్తూ కూర్చో గలడు. సంసార స్త్రీల రహస్య కలాపాలను కళ్ళారా చూడగలడు. ఆ సన్నివేశాలన్నీ ఆ పుస్తకంలో సచిత్రంగా వుంటాయి. ఆ చిత్రకారుడి నైపుణ్యం మయుని మహేంద్ర జాలం లాంటిది. ఇవి సజీవరూపాలా అని భ్రమింపజేస్తాయి ఆ గీతలు. అయితే అది చదునైన న్యూస్ ప్రింటు మాత్రమే!

'ఈ సెక్స్ మాగజైన్లకు ఏ మాత్రం తీసిపోకుండా తయారయ్యాయి ఈ సినిమాలు. సినిమా వర్తకుడికి ప్రధానంగా కావలసింది డబ్బు! అపారమైన డబ్బు! డబ్బు వుంటే తక్కిన కోరికలన్నీ తీర్చుకోవచ్చు గనుక, ముందుగా సంపాదించా ల్సింది డబ్బు! ప్రేక్షకుల తన మీద కనకవర్షం కురిపించాలంటే, తన సినిమా కళను బట్టలూడదీసి బజారుకు పంపించాలన్నదే అతడు కనిపెట్టిన నగ్నసత్యం! అలా చేయడానికి అతడేమాత్రం సందేహించడు.

'సినిమా నటికి కావలసింది కూడా డబ్బే! కనుక ఆ లోకేశ్వరి సెక్స్ మాగజైన్‌లోని పాత్రలాగ నటించడానికి సంసిద్ధంగా వుంటుంది.

'సినిమా రచయితకు కావలసింది కూడా డబ్బే! కనుక ఆ వాగనుశాసనుడు శృంగారం కోసం యువక పాత్రలచేత, హాస్యం కోసం వృద్ధ పాత్రలచేత బూతుపాటలు పాడించడానికీ, బూతు మాటలు పలికించడానికీ ఒప్పుకొని తీరాల్సిందే! అవకాశం వచ్చి నప్పుడల్లా మాటల్లో ద్వంద్వార్థాలు ప్రతిధ్వనించాల్సిందే! ఉదాహరణకు — ఓ పల్లెటూరి పిల్ల మామిడిపళ్ళు అమ్ముకోడానికి పేట కొస్తుందనుకో! ఓ అబ్బాయి ఆమెను దగ్గరికి పిలుస్తాడు. వాళ్ళ సంభాషణ యిట్లా వుంటుంది —

'పిల్లోయ్! నీ మామిడిపళ్ళు నా కమ్ముతావా?'

'అమ్మకోటానికే గదా బాబూ, యింతదూరం వచ్చాను!'

'గట్టి పళ్లేనా? ఏదీ, చూడనియ్యి!'

'ఆఁ! ఆఁ! పట్టుకోకండి బాబూ! నలిగిపోతై! డబ్బిచ్చి మరీ వెయ్యి బెట్టండి!'

'బాగున్నాయో లేదో చూడకుండానే డబ్బిచ్చుకో మంటావా?...బాగుంది నీతో బేరం!'

'ఏంటి బాబూ, మీరు చూసేది? ఊరంతా అమ్ముకొస్తున్నాను. మీ దగ్గరికొచ్చేసరికి బాగాలేకపోయాయా?'

... ఇది మామిడిపళ్ళ బేరమే గావచ్చు. కానీ దీనివెనక ఏదో చౌకబారుతనం తొంగిచూడటం లేదూ?...ఓ పల్లెపడుచుకు గాజులబత్తుడిచేత గాజులు తొడిగిస్తూ, ఇలాగే శ్లేష వచ్చే సంభాషణ తయారు చేయొచ్చు. ఇక పాటల దగ్గరి కొచ్చేసరికి ఈ వ్యంగ్యం కూడా మాయమైపోయి, బూతు అనేది డైరెక్టుగా దూసుకొచ్చేస్తుంది. 'వాలు చూసుకో—వీలు చేసుకో! వంగపండు లాంటి దాన్ని — వలపు దోచుకో!'...ఈ పాట నువ్వు విన్నావా నాన్నా? పోనీ, ఇంకో పాట—మన బేబీ కూడా పాడుతూవుంటుంది 'మెల్ల మెల్ల మెల్లగా—అణువణువూ నీదెగా—మెత్తగ అడిగితే లేదనేది లేదుగా—మెల్ల మెల్ల మెల్లగా...' ఈ సినిమా పాటలకున్నంత వ్యాప్తి ఈ దేశంలో మరిదేనికుంది? మాటలురాని వేలెడంత కుర్రది కూడా 'కొట్టు కొట్టు బుల్లోడా పంపుగొట్టరా, బండి క్లీనుజేసి లైనుమీద బెట్టరా...' అని పాడుకుంటూ వీధిలో వెడుతూ వుంటుంది. హరికథ చెప్పే హరిదాసుకూడా 'అప్పుడు హిడింబి, భీమసేనుడూ మోహపరవశులై వివిధంగా క్రీడిస్తున్నా

రండీ అంటే — ఎలాగావుందీ, ఎంపేస్తోందీ, రా రా కప్పు కుందాం...' అంటూ సినిమా పాటలతోనే హరికథ పూర్తిజేస్తు న్నాడు. మనిషికి ప్రాథమికావసరాలు ఏవని అడిగితే — ముందు సిని మాను పేర్కొని, తరువాతే తిండి, గుడ్డ, నీడ అని చెప్పుకోవాల్సి వస్తోంది. ఆ పూట పస్తుయినావుండి సినిమాకు వెళ్ళేవాళ్ళు చాలా మంది వున్నారు ఈ దరిద్ర దేశంలో. సినిమాల్లో మంచివుందని బల్లగుద్ది వాదే ఫిలింఫాన్సుకు ఏమని సమాధానం చెప్పగలం? కె. వి. రెడ్డి, బి. ఎన్. రెడ్డిలాగా కళాత్మకంగా, వినోదాత్మకంగా ప్రబోధాత్మకంగా తీరింతీసే ఉత్తమ కళాకారులు మనలో ఎందరున్నారు?...తల్లపాలు చాలక నేను ఆవు పాలు త్రాగేరోజుల్లో — చెంబెడు పాలలో చారెడు నీళ్ళు గలిపి అమ్మేవారెమోగానీ, వర్తమానకాలంలో చెంబెడు నీళ్ళలో చారెడు పాలు కలిపి అమ్ము తున్నారు. ఉదయం పూసం కొనుక్కునే ఆ పున్నపు తేటలాంటి పిల్లని ద్రావణంలో నిజంగా ఎన్ని పాలచుక్కలుంటాయి? సిని మాల్లో మంచికూడా అంతే వుంటుంది. కాగితంమీద, తెరమీద అసభ్యతను, అశ్లీలాన్ని, సెక్స్ అప్పీల్‌ను ప్రతిష్ఠాపనజేసి మనిషిలో పాశవికతను ప్రకోపింపజేసే సంఘ విద్రోహశక్తుల్ని క్షమించి పూర్ఖపోవడం చేజేతులా జాతివినాశనాన్ని కోరితెచ్చుకోవడమే! మను షుల్లో హంతకులున్నట్టే — సినీ కళాకారుల్లోను, పత్రికా రచయితల్లోనూ హంతకులున్నారు మొదటివాడు మనిషిని భౌతికంగా హత్యచేస్తున్నాడు. ఈ రెండోరకం హంతకులు ఒక్కణ్ణి విడిచి పెట్టకుండా జాతి మొత్తాన్నీ ఆత్మికంగానూ, నైతికంగానూ హత్యచేస్తున్నారు. ఆ నేరంకంటే ఈ నేరం కోటిరెట్లు పెద్దది. ఒంతే మనిషిని చంపేవాణ్ణి మనం ఉరితీస్తున్నాము. జాతిని చంపు తున్నవాణ్ణే పోషిస్తున్నాము. పాము కాటువేస్తుందని తెలిసికూడా దానికి పాలుపోసి పెంచుతున్నాము.

'ఈతరం పుచ్చిపోతే పోనీ, భావితరమైనా బాగుపడేటట్లు చూచే బాధ్యత కలిగిన వ్యవస్థలు రెండే! ఒకటి, యిల్లు. రెండు, బడి. పిల్లల పెంపకంలో తల్లిదండ్రులు శ్రద్ధవహించకపోతే ఏమౌతుంది? వాళ్ళను అదుపు ఆజ్ఞల్లో వుంచక, అతి గారాబంతో అల్లారుముద్దుగా పెంచితే ఏమౌతుంది? వాళ్ళను వెంటేసుకుని, ప్రయోజనములను మాత్రమే దృష్టిలో వుంచుకొని సెన్సారుబోర్డును తోసిపుచ్చి నిర్మించిన నేటి సినిమాల్ని జాలో జంతువుల్ని చూపించి నట్టు చూపుతూవుంటే ఏమౌతుంది? దీనికి సమాధానం మన వేదే!...ఒకరి మూర్ఖత్వం మరొకర్ని చెడగొడుతుందనడానికి మన వేదే నిదర్శనం!

'ఇక బడిదగ్గరి కొద్దాం.' 'నేటి పాపలే రేపటి పౌరులు'అని అంటుంటాము. వయస్సుతోబాటు క్రమంగా పెరిగి రేపెప్పుడో వాళ్ళు పౌరులవుతారు. కానీ, నేడు పాఠశాలల్లో కనిపిస్తున్న విప రీతమేమంటే — నేటి పాపలందరూ నేడే పౌరులైపోతున్నారు. ఏ వయస్సులో తెలుసుకోవలసిన సంగతులు ఆ వయస్సులో తెలుసు కుంటేనే ఆరోగ్యం! పంతుళ్ళు పిల్లలకు నేర్పవలసింది విద్యా విజ్ఞా నాలేగానీ, యౌవన వసంతంలోని మాధుర్యాలుకాదు. ఒక వయ స్సులో వున్నవారిని అంతకంటే పై వయస్సుకు సంబంధించిన అనుభవాల్లోకి లాగడం చాలా ప్రమాదకరం!... పాలుతాగే పురిటి పాపకు అన్నం పెడతామా? ఆడుకునే అమ్మాయికి చీరకడతామా? వయస్సురాని ఆడపిల్లకు పెళ్ళిజేస్తామా? మైనారిటీ తీరని కుర్ర చెదవకు ఆస్తివ్యవహారాలు అప్పగిస్తామా?... ఇవి చేయకూడని పనులు అని తెలుసుకోలేకపోతే, అది మూర్ఖత్వమూ కాదా? పిల్లల స్వభావం తెలుసుకోకుండా పాఠాలు బోధించడానికి ఎవరికీ అర్హతలేదు. అందుకే టీచర్ కావడానికి ముందు ట్రైనింగ్ అన్నారు. ట్రైనింగులో చిల్డ్రన్స్ సైకాలజీ అని ఓ సబ్జక్టు! పిల్లల మనశ్శాస్త్రం ఏమంటుందంటే, 'పాపల మనస్సు ఒక వింత పలక! ఆ పలకమీద రాసిన మాట మళ్ళీ తుడిచినాపోదు. కనుక, ఓ భావి ఉపాధ్యాయుడా! ఆ పలకమీద రాసేటప్పుడు చాస్తా ఒలో ఎంచి సరైనమాటే వ్రాయి. జాగ్రత్త! పొరపాటున తప్పు రాశావా, దాన్ని తుడిచేయడం నీ తరంగాదు!'

'ఇలా చెయ్యవద్దు' అనకుండ 'ఇలా చెయ్యి' అనే అని మంటుంది సైకాలజీ. 'సత్యము పలుకుము' అనేమాట నేర్పా- గానీ, 'అబద్ధము చెప్పరాదు' అని నేర్పకూడదు. 'పరులకు ఉప కారము చేయవలెను' అనాలి. 'పరులకు అపకారము చేయరాదు' అనకూడదు. పిల్లలకు చేయవలసినవే చెప్పాలిగానీ, చేయకూడనివి చెప్పరాదు. ఏదో కథలో 'ఈ మూడువైపులా వెడితే వెళ్ళావుగానీ, ఉత్తర దిక్కుగా మాత్రం వెళ్ళకు' అని ఓ తండ్రి కొడుక్కి చెబితే, వాడు 'ఉత్తర దిక్కులో ఏముంది? ఎందుకు వెళ్ళొద్ద న్నాడు నాన్న? వెళ్తేనేం? వెళ్ళి చూడాల్సిందే!' అనుకుని, అను కున్నంత పని చేశాడట!...అట్లాంటివాళ్ళు పిల్లలు! వాళ్ళను మర్గుణాల ప్రభావంనుండి, దుర్వ్యసనాల ఆకర్షణనుండి రక్షించ వలసిన ఉపాధ్యాయుల బుద్ధికే గ్రహణం పడితే, భావి భారతదేశం బాగుపడినట్లేనా?...మన పూళ్ళోని పెద్దమనుష్యులు విషయమే తీసు కుందాం. వాళ్ళ ఘనత ఎలాంటిదో?...

'మన వూళ్ళోకి కొత్త సినిమా వస్తే వీధుల్లో కరపత్రాలు కురుస్తాయి. లౌడ్ స్పీకర్లు గింగిరుమంటాయి. ఆ కరపత్రాలు, లౌడ్ స్పీకర్లు ఏమంటాయి?.. 'హుషారైన పాటలు! పసందైన మాటలు! మైమరపించే ప్రణయ సన్నివేశాలు! మత్తెక్కించే నృత్యాలు! కైపెక్కించే క్లబ్ డాన్సులు! మళ్ళీ మళ్ళీ చూడాలని పించే మహత్తర చిత్రం! సోదర సోదరీ మణులారా! పిల్లా పెద్దా, ముసలీ ముతకా అనకుండా అంతా గోపాలంగా రండి! త్వరపడండి! అలసించిన అందవు టిక్కెట్లు!...' సినిమాలవాళ్ళు ఒలికించే అందాలు, ఆకర్షణలు ఈనాటి వార్షికోత్సవంలో వున్నాయా, లేదా? ఏండ్లతరబడి తెరమీద జీవిస్తూ వయస్సు చెప్పకోకుండా జాగ్రత్త పడే సినిమా తారలకు —నెన్నెలతో, పరికిణీలలో బడికివెళ్ళే మన అమ్మాయిలు నడకలో, నాట్యంలో, వొంపుల్లో, వొయ్యా రాల్లో ఏమాత్రం తీసిపోరని నమ్మకం కుదిరిందా, లేదా?

ఆ గేయనాటిక నువ్వు చూశావుకదూ? 'రాధాకృష్ణ'! యమునాతీరంలో మురళీకృష్ణుడు గోపికలతో రాసక్రీడాలోలుడై

వుంటాడు. మంచినీళ్ళనెపంతో రాధ కృష్ణుణ్ణి వెతుక్కుంటూ వస్తుంది. చేతిలోకి అందీ అందకుండా ఆమెను ఉడికిస్తాడు గోపాలుడు. రాధ యిక విరహాన్ని సైపలేక రోదిస్తూ కిందికి ఒరిగిపోతుంది. అప్పుడు కృష్ణుడు జాలిపడి, ఆమెను రెండు చేతులతో లేవనెత్తి దగ్గరకు తీసుకుంటాడు. రాధ అలిగి దూరంగా జరుగుతుంది. అలక మానమని కృష్ణుడు బతిమాలుకుంటాడు. చక్కిలిగింతలు పెట్టి, ఆమెను నవ్విస్తాడు. ఇద్దరూ చేయి చేయి కలిపి సినిమా ట్యూనుతో యుగళగీతం పాడుతూ, రకరకాల భంగిమలతో డాన్సుచేస్తూ చల్లని వెన్నెలలో చలిగాలిలో యమునాతీరంలో విహరిస్తారు. 'ప్రేమేకాదా జగమంటే! నీవూ నేనూ ఒకటే! నీలో వున్నది నేను! నాలో వున్నది నీవు! మనలో వున్నది సర్వం! ఇంకెందుకులే స్వర్గం?' అని వాళ్ళు పాత్రల్లో లీనమైపోయి అభినయిస్తూ వుంటే—ఆ తెరకున్న సిగ్గు ఎదుట కూర్చునిచూచే ప్రేక్షకులకు లేకపోయింది గదా!

'ఈ రాధాకృష్ణ గేయనాటికా ప్రదర్శనకు వెనుక ఒక చిన్న గాథ వుంది. హైస్కూల్లో పాల్ అనే ఓ టీచరున్నాడు. అతనికి ఒక మాండలిన్ వుంది కొన్ని క్రైమ్ పిక్చర్సులోని హిట్ సాంగ్సు తన మాండలిన్‌మీద మజాగా వాయిస్తాడు పాల్. అవే ట్యూన్సుతో ఒక గేయనాటిక తయారైతే బాగుంటుంది కదా అని అతని యోచన. పదిరోజుల కిందట సీనియర్ తెలుగు పండితుణ్ణి తన గదికి తీసుకెళ్ళి ఆదరంగా కూర్చోబెట్టి, కాఫీయిచ్చి, తన మాండలిన్‌మీద ఐదారు సినిమా పాటలు వాయించి, 'సార్! ఈ ట్యూన్సుతో ఓ అయిదు పాటలు ఉండేటట్లుగా 'రాధాకృష్ణ' రాసివ్వండి సార్ ! అన్నాడు. సీనియర్ తెలుగు పండితుడు సినిమా పాటలకు తీసిపోనివిధంగా పాటలు రాయడం, పాల్ తన మాండలిన్ మీద సినిమాట్యూన్లు మక్కీకి మక్కీగా వాయించడం, పంతులమ్మలు నృత్యదర్శకత్వం వహించడం, నాటికవేసిన ఆడపిల్లలు — ముఖ్యంగా రాధాకృష్ణులు సినిమాహీరో హీరోయిన్లలాగే అత్యంత సన్నిహితంగా డాన్సుచేయడం...ఆరి భగవంతుడా! ఈ సినిమా దొమ్మరాటలతో పాఠశాలలు కూడా భ్రష్టమైపోతున్నాయిగదా!...పోనీ, ఆ పాల్‌కు కృష్ణుడే కావాలనుకుంటే మరో కృష్ణుడే దొరక్కపోయాడా? నవనీత చోరుడో, కాళీయమర్దనుడో, మృత్తికాఖాదియో, కుచేల కృష్ణుడో పనికి రాకపోయాడా?... హావీవరసాలేని రాధాకృష్ణుల నిషిద్ధ ప్రణయానికి ఎ. సర్టిఫికేటు సినిమా సంగీత సాహిత్యాలను జోడించి, నేడో రేపో కళ్ళు తెరవబోతున్న చిన్నపిల్లలచేత చిన్నపిల్లలకోసం ప్రదర్శించడం మూర్ఖత్వం ఔనా, కాదా ?

'వేడీ చేసిన డాన్సులు చూశావుగదా?...అలాంటి శృంగార గీతాలు, నృత్యాలు చదువుకుంటున్న పిల్లకు నేర్పి, రచ్చబండ మీద యెక్కించి ఆడమనడం, ఆహా ఓహో అంటూ అందరూ నిక్కినిక్కి చూడటం, అది చూచి నువ్వూ నేనూ తల లొంచుకోవడం...ఎందుకొచ్చిన చదువులు నాన్నా?... అటువంటి పాటలు, నృత్యాలు ప్రదర్శించకుండా జాగ్రత్తపడాలన్న ఇంగిత జ్ఞానం టీచర్లకు వుండక్కర్లేదూ? ఇన్నేళ్ళుగా చూస్తున్నాను. అటువంటివే నేర్పుతున్నారు. అటువంటివే బేబీచేత వేయిస్తున్నారు. ఇప్పటికే దానొక సినిమాతార అన్నంతగా పొగరెక్కిపోయింది దానికి! ఎప్పుడూ ముద్దు ముద్దు మాటలు, గారాబు చేష్టలు, బూతు పాటలు! సినిమా వర్తకుల స్వార్థపరత్వం, పెద్దవాళ్ళ మూర్ఖత్వం, బేబీలోని జంతుప్రవృత్తి ఈనాడు దాన్ని యిట్లా తీర్చి దిద్దాయి. చూస్తూవుండగానే ఎప్పుడో ఒకప్పుడు కొంప అంటుకుపోతుంది. అంతవరకూ నేను శుష్కోపన్యాసం చేస్తూ వుండాల్సిందే, నువ్విలా నిద్రపోతూ వుండాల్సిందే!...'

చంద్రశేఖరం దీర్ఘోపన్యాసం ఆపి, తండ్రికేసి చూశాడు.

'నాన్నా!'

రాజశేఖరం నేలమీదికి ఒరిగిపోయి గురకతీస్తున్నాడు.

'బూడిదలో పోసిన పన్నీరు!' అంటూ చుట్టూ చూశాడు చంద్రశేఖరం. అమ్మ, బేబీ యిద్దరూ నిద్రపోతున్నారు. అతని భార్య మాత్రం సగం మూతపడిన కళ్ళతో అతని పక్కన కూర్చుని వుంది.

'ఇప్పుడే అయిపోయిందా!' అంటూ ఉలికిపడి, కళ్ళు పూర్తిగా తెరిచింది. 'అబ్బ! మీకెన్ని సంగతులు తెలుసునండీ!... బళ్ళో తెల్లలార్చి ఆయన మాట్లాడాడు చూడండీ...ఆయనకంటే ఎక్కువసేపే మాట్లాడారు. అయినా కన్నతండ్రితో ఇలాంటి మాటలు మాట్లాడటానికి మీకు సిగ్గులేదూ ?' అంది మెల్లగా.

'ఇహ లేవండి! నిద్దరొస్తోంది!' అంటూ ఆవలిస్తూ పైకి లేచి మేడమెట్లు దిగిపోయింది.

ఊరంతా నిద్రపోతూ వుంది!



# పురపాలక సంఘాలు. పంచాయితీ సంస్థలు

మీ నగరాన్ని, పట్టణాన్ని, గ్రామాన్ని అందంగా,
ఆహ్లాదకరంగా, చల్లని ప్రదేశాలుగా తీర్చుదిద్దుకోండి.

రహదారులకు యిరుప్రక్కల, కార్యాలయాలలో, పాఠశాలల్లో ఉద్యానవనాలలో, ఖాళీ ప్రదేశాలలో మొక్కలు నాటే యీ తరుణంలో [జూలై - ఆగస్టు] చెట్లను నాటండి.

## మొక్కలు సలహాలు ఉచితం

సంప్రదించండి.

*జంట నగరాలలో :*
డివిజనల్ ఫారెస్టు ఆఫీసర్,
విస్తరణ విభాగం,
హైదరాబాదు - 500004,
ఫోన్ నెం : 30531 [ఎక్స్-45]

*జిల్లాలలో :*
డివిజనల్ ఫారెస్టు ఆఫీసర్,
జిల్లా కేంద్ర స్థానాలు.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.
14/78–79



శ్రీ తిరుమల రామచంద్ర

# ప్రాకృత వాఙ్మయంలో రామకథ-3

*(గత సంచిక తరువాయి)*

విమల సూరి ఉద్దేశం మత ప్రచారమే గనుక కావ్యదృష్టికి అంతగా ప్రాధాన్య మివ్వలేదు. అంతమాత్రాన కావ్య కామనీయకం లేదనికాదు. ఇతిహాసదృష్టితో వ్రాసినా, నగరార్ణవ శైలాది వర్ణనలతో ఇంపు చేకూర్చినాడు. ప్రతి పర్వాన్ని విమలాంకంగా చేశాడు. చివరి వృత్తంలో 'విమల' పదం పొందుపరచాడు. ఇతని వర్ణనలను ఒకటి రెండు ఉదహరిస్తాను. ప్రావృట్కాల వర్ణనం—

నవగయ భిసిర నిదాహే,
గింగాతీరట్ఠి యస్స దమణి జ్జే,
గజ్జంత మేహముఖలో
సంపత్తో పావుసో కాలో. 11–111

ధవల బలాయాధయవడ
విజ్జులయా కణయ బంధకచ్ఛాయ,
ఇందా ఉహ కయ భూసా
దురంత నవసవిల దాణోహా. 12

అంజణ గిరి సచ్ఛాయా
ఘణహత్థీ పావుడం వ సూరవ ఇణా,
సంపేసియా పభూయా
రక్ఖసనాహస్స అఇ గురుయా 13

అంధారియం సమత్థం
గ యణం రవియర పణట్ఠ గహ చక్కం,
తడయడ నముట్ఠి యరవం
ధారా సరభిన్న భువణయలం. 14

ధారా సరభిన్నంగో
కంతా సరిఊణ ముచ్ఛి ఓ సహిఓ,
పుణరవి ఆససిఓ చ్చియ
తీఏ సుహసంగి మానాఏ. 15

అహిణవ కయంబ గంధం
అగ్ఘా ఏ ఊణ మూఢ మణహియ యా,
జే అసుణియ పరమత్థా
భమంతి తత్థేవ పహియ గణా. 16

దద్దుర మఊర జలహర
సద్దో తప్పిహయాణ ఏ యత్థం,
పారద్ధం ఏవ లాలం
వారణ లీలా సహావేణం. 17

సుట్ఠువి ఉక్కంఠులయా
పహియా జలఫలిహారుద్ధ పయమగ్గా.
కంతా సమాగమ మణా
పంఖా రహియా విసూరేంతి 18

హరియ తణ నామలంగీ
మహివిలయా సలిలవత్థ పరిహాణీ,
వరకుడయ కుసుమదంతీ
హసఇవ్వ దసాణణాగమణే 19

రావణుడు గింగాతీరంలో ఉండగా ఎండాకాలం, వేండకాలం గడిచాయి. గర్జించే మేఘాలతో ముఖరితమయిన వర్షాకాలం వచ్చింది. కొంగలనే తెల్లటి పతాకాలతో, మెరుపులనే బంగారు కటి బంధంతో, ఇంద్రధనుస్సనే నగలతో, కొత్త నీరనే స్రవించే మద జలంతో కాటుక కొండవంటి కాంతితో ఒప్పారే మేఘాలనే పెద్ద పెద్ద ఏనుగులను ఇంద్రుడు రాక్షసనాథుని వద్దకు పంపినట్టు కని పించింది. గగనతలంలో చీకట్లు కమ్ముకున్నాయి; సూర్యకాంతి, గ్రహాలు మరుగయిపోయాయి. ఉరుము మెరుపుల గోల ఎక్కు వయింది. జడివాన అనే బాణాలతో భువనతలం ఛిన్నాభిన్నమయింది. విరహాలయిన పాంథులు తమ కాంతలు తలపురాగా మూర్ఛ పోయారు. మరల సుఖ సమాగమం సంభవిస్తుందనే ఆశతో ఊరటచెందారు. కొత్తగా పూచిన కలుగొట్టు పూవుల వాసనకు దిమ్మెత్తిపోయిన పాంథులు తాము ఏమిచేయాలో పరమార్థ మేమిటో తోచక ఆ కడిమిచెట్లచుట్టూ తిరుగుతున్నారు మట్టి దిబ్బలమీద ఉన్న కప్పల బెకబెకలు, నెమళ్ళ కేకలు, మేఘాల ఉరుము మేఘ మహాగజం వనక్రీడకు తాళమా అన్నట్టు ఉన్నాయి. పథికులకు తమ ప్రియురాండ్రను కలుసుకోవాలని తొందర కాని నీటి వరదలు అగడ్తలలాగ ఎదుట కనిపిస్తున్నాయి. వాటిని దాట లేక రెక్కలు లేకపోయాయే అని విచారపడుతున్నారు పచ్చనిగడ్డితో శ్యామలాంగి అయిన భూమి అనే మహిళ నీరనే వస్త్రం ధరించి, అడవి మొల్లలనే తెల్లని పలువరుసతో రావణుని రాకకు సంతోషం పట్టలేక నవ్వినట్టుంది.

ధన మాహాత్మ్యన్ని విమలసూరి చాల చక్కగా వివరించాడు.

జస్స ఽత్థో తస్స సుహం
జస్స ఽత్థో పండి ఓయసో లే ఏ.

జస్స ఒత్థో సో సురుఓ
అత్థవిహీణో య లహుఓ ఉ 35–16.

తస్స మహత్థో య జసో
ధమ్మో వి య తస్స హోఇ సాహీణో,
ధమ్మో నిసో సమత్థో
జస్స అహింసా సముద్దిట్ఠా 35–17

ధనమున్నవానికే సుఖం. ధనమున్నవాడే పండితుడు. ధనమున్నవాడే గొప్పవాడు ధన విహీనుడు తేలకయిపోతాడు. ధనమున్నవానికే కీర్తి ధర్మం ధనమున్నవానికే స్వాధీనం. అహింసోపదేశం చేసే ధర్మాన్ని ధనవంతుడే చేయగలుగుతాడు.

విమలసూరి అర్థాంతరన్యాసాలు కొన్ని ఎక్కగా ఉన్నాయి. వాటిని తర్వాతి కవులు, అన్యధర్మానుసారి కావడంవల్ల, అతనిని స్మరించక అనుకరించారనవచ్చు.

( 1) కిం వజ్జసూఇ భిన్నేనరియఇ తంతూ మహారయణే.
1–13

దీనిని కాళిదాసుదాసు అనుకరించాడని ఇదివరకే చెప్పాను.

( 2) నక్ఖేణ జం విరుప్పఇ తత్థయ పరసూణ కిం కజ్జం ?
12 101

'గోటితో పోయేదానికి గొడ్డలి ఎందుకు?

( 3) నట్ఠం హి యం చభద్దే
స సోయి యవ్వం బుహజణేణ. 3 –35

ఓ మంచిదానా బుద్ధిమంతులు గడచిపోయినదానికి విచారపడగూడదు.

( 4) తుల్లావత్థాణ జఏ
హోఇసిణేహో నరాణ నియయం వి. 47–5

సమానావస్థలో వున్నవారికి స్నేహం కుదురుతుందనడం లోకనియమం.

సమాన శీల వ్యసనేషు సఖ్యం అనే సూక్తి, సర్వస్సగంధేషు విశ్వసితి అనే కాళిదాసుమాట దీనివంటివే.

( 5) పత్తే విణాసకాలే
నాసఇ బుద్ధీనరాణ నిక్కుత్తం 53–138

వినాశకాలం వచ్చినప్పుడు మానవులబుద్ధి నశిస్తుందనడం నిశ్చయం. వినాశకాలే విపరీతబుద్ధిః

( 6) కిం దిణయరస్స దీవో
విజ్జఇ నిహు మగ్గణట్ఠాఏ 70–27

దినకరుడు దారి తప్పతాడని దీపం చూపుతామా ?

( 7) కిం రాసహస్స సోహఇ
దేహే రఇయా విజయఘంటా. 71-54

గాడిదకు విజయ ఘంట కడితే ఏం బాగుంటుంది ?

( 8) మరణంతాఇం హవంతి వేరాణి. 75–1
మరణాంతాని వైరాణి — యుద్ధ—

( 9) సగ్గసరిసో విదేసో
పియ విరహే రణ్ణ సన్నిహోహోఇ. 78–42
స్వర్గ సదృశమైన దేశం కూడా ఇష్టులయిన వారు దగ్గర లేనప్పుడు అరణ్య సమానం.

(10) భిచ్చస్స జీవియావో
కుక్కుర బీయం వరం హోవఇ.
భిచ్చగాని జీవితంకన్నా కుక్క బ్రతుకు మేలు

(11) సవ్వస్సని కోడియం సరిసం 100–54

(12) జహరాయా తహపయా సవ్వా 105–106
యథారాజా తథాప్రజాః

(13) జాఅస్స ధువం మరణం 106–26
జాతస్యహిధ్రువో మృత్యుః (భగవద్గీత – 2–27)
విమలసూరి మతాచార్యుడు, లోక వృత్తజ్ఞుడు గనుక మంచి మంచి ఆభాణకాలు ప్రయోగించాడు.

( 1) నయ గేహమ్మిపలిత్తే
కూవో ఖమ్మఇ సుతూరమాణేహిం,
దాహోలిఏ ణ దమ్మఇ
ఆసోచ్చియ తక్కాణం చేవ. 5–239

ఇంటికి నిప్పంటుకున్నప్పుడు తొందరగా బావి తవ్వడం సాధ్యమా ? పరిగెత్తే గుర్రాన్ని వెంటనే అదుపులోకి తేవడం సాధ్యం కాదు.

సందీప్తేభవనేతుకూ పఖననం పత్యున్యమః కదృశః?
భర్తృ – వైరా – 75

( 2) .................
వెజ్జనరిందాణ మిత్తపురిసాణం,
ఆహాణఓఅ లోఏ
ఏ యాణ ఫుడం కహేయవ్వం. 12–17

జనంలో ఆభాణకం ఏమిటంటే, వైద్యుని వద్ద, రాజు వద్ద, మిత్రుని వద్ద మరుగుచేయరాదు; స్పష్టంగా చెప్పివేయాలి.

( 3) కింవా తుసేసు కీరఇ
తందుల సారమ్మి సంగహిఏ. 12–138

బియ్యం తీసుకున్న తర్వాత ఊకతో ఏమి చేస్తాం ?

( 4) దుసహం హవఇ సమక్కం
దుక్కం చియ ఉబ్బవే జణ వయస్స,

గయవేయణం తు పచ్చా
జణమ్మి ఏసా సుఈ భోమఃి. 26–97

ఉత్పత్తి సమయంలో దుఃఖం కళ్లఎదుటే ఉంటుంది; జనం దానిని సహించలేరు. కాని, కొంత కాలం తర్వాత ఆ దుఃఖం పోతుంది. ఇది లోకంలో వ్యాపించిన మాట.

( 5) కోసయల జణస్స ఇహం
కరేఇ ముఖ బంధణం పురిసో ? 94–70
ఎవడు లోకులందరి నోళ్ళు మూయించగలడు ?

( 6) వీర పురుసాణ భోజ్జా
వసుహా, కిం ఏత్థ విద్దేహిం 98–22
వీరభోజ్యా వసుంధరా.

( 7) ర యణం తు పుహఇ మోల్లం
దిన్నంచియ 'సాగముట్మి ఏ. 103–110

( 8) అసమిక్కి యకారీణం
పురిసాణం ఏత్థ పావహియయాణం,
సయమేవ కయం కమ్మం
పరితావ యఇం హవఇ పచ్చా. 110– 11

అనాలోచితంగా పనిచేసే పాప హృదయులకు వారుచేసిన పనే తర్వాత పరితాపకరమవుతుంది.

అతిరభస కృతానాం కర్మణా మావిపత్తేః
భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః.
భర్తృ – నీతి – 95

( 9) సలిలే మంథిజ్జంతే
సుట్ఠువి సిణియ హోఇ నవణీయం,
సికయాఏ పీలియాఏ
కత్తొచ్చియ జాయఏ తేల్లం.' 113– 33

నీటిని ఎంత బాగా చిలికినా వెన్నరాదు. ఇసుకను ఎంత పిండినా నూనె రాదు.

(10) వాలగ్గకోడి మేత్తం
దోసం పేచ్ఛసి పరస్స అతి సిగ్ఘం,
మందర మేత్తంపి తుమం
న య పేచ్ఛసి అత్తణో దోసో. 113– 40

ఎదుటి వానిలోని లోపం వెంట్రుక కొసంత ఉన్నా త్వరగా కంటపడుతుంది. తన దోషం మందర పర్వతమంత ఉన్నా కనిపించదు.

ఖలః సర్షప మాత్రాణి
పరచ్ఛిద్రాణి పశ్యతి,
ఆత్మనో బిల్వ మాత్రాణి
పశ్యన్నపి న పశ్యతి. భారతం–1–3069

ఉపమా రూపకోత్ప్రేక్షాతిశయోక్తులు, యమకాలు చాల ఉన్నవి. దీనిలోని ప్రధాన పాత్రలన్నీ ప్రాపంచిక సుఖాలు వదలి జైన ధర్మం స్వీకరించేవి గనుక, ప్రధాన రసం – శాంతం – వైరాగ్యమే అయినా, శృంగార వీర కరుణాది రసాలను కూడా కవి ఆయా స్థలాలలో పోషించాడు. శైలి సరళం, భాష చెప్పినట్టు వినే కింకరి. (118 ఉద్దేశాలు, 8651 శ్లోకాలు)

## గుణభద్రుని సంప్రదాయం :-

రెండవది గుణభద్రుని సంప్రదాయం. గుణభద్రుడు కర్ణాటక ప్రాంతంవాడు, జినసేనుని శిష్యుడు. గురువు రచించిన అసమగ్ర మయిన ఆదిపురాణాన్ని పూర్తిచేయడమేకాక, ఉత్తర పురాణ అనే పేర త్రిషష్టి శలాక పురుష చరిత్ర ద్వితీయభాగం సంస్కృతంలో రచించాడు. ఇతడు 9వ శతాబ్దివాడు. ఉత్తర పురాణం లోని 68, 69 పర్వాలలో 1117 శ్లోకాలలో అష్టమ బలదేవ, నారాయణ ప్రతి నాయకుల – రామ లక్ష్మణ రావణుల – చరిత్ర ఉన్నది. ఈ రామచరితం వాల్మీకికథకు, విమలసూరి కథకు భిన్నం. దీనిలో ముఖ్య విషయం సీత రావణ మండోదరుల కుమార్తె.

గుణభద్రునికథకు ఆధారమేమిటో తెలియదు. కాని, ఇతనికి విమలసూరి సంప్రదాయం, సంఘదాసుని సంప్రదాయం బాగా తెలుసునని తోస్తుంది. జినసేనుడు తన ఆదిపురాణానికి పరమేశ్వర కవి వచన కథ మూలమన్నాడు. గుణభద్రుడు కూడ పరమేశ్వరుని గద్య రచనను అనుసరించాడేమో! కాని, పరమేశ్వర కవి రచన లభించడం లేదు. కాని, టిబెట్టు రామాయణంలోను, ఇతర గ్రంథాలలోను సీత రావణమండోదరుల పుత్రి అని ఉన్నది. బహుశా ఇది లోకంలో ప్రచారంలో వుండి వుండవచ్చు. దానినే పరమేశ్వర కవి, గుణభద్రుడు జైన సంప్రదాయాను గుణంగా దానిని మలచుకొని వుంటారు. గుణభద్రుని సంప్రదాయానుసారంగా మరి కొన్ని సంస్కృత కన్నడ ప్రాకృత రచనలు వెలువడ్డాయి. వాటిలో ప్రాకృతం లోనిది పుష్పదంతుడనే కవి తిసట్ఠీ మహా పురిస గుణాలంకారం. దీనికి మహా పురాణమనీ నామాంతరం వుంది. ఇతడు క్రీస్తు శకం 965 ప్రాంతంవాడు. ఈ ప్రాకృతాన్ని అపభ్రంశమని కొందరన్నారు. పుష్పదంతుని రచనలోని గుణభద్ర సంప్రదాయపు రామ కథను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

వారాణసి రాజయిన దశరథునికి నలుగురు పుత్రులు పుట్టారు. రాముని తల్లిపేరు సుబాల. లక్ష్మణుని తల్లిపేరు కైకేయి. దశరథుడు తన రాజధానిని సాకేతపురానికి మార్చిన తర్వాత మరొక రాణికి భరత శత్రుఘ్నులు పుట్టారు.

దశాననుడు వినమి అనే విద్యాధరవంశంలోని పులస్త్యుని కుమారుడు. ఒకరోజు అతడు అమితవేగుడనే వాని కుమార్తె మణిమతి తపస్సు చేస్తుండడం చూస్తాడు. ఆమెపై మరులుగొని ఆమె తపస్సుకు విఘ్నంచేయుడానికి ప్రయత్నిస్తాడు; మణిమతి "నేను దశాననునికి పుత్రిగా జన్మించి, అతనిని చంపుతాను" అని ప్రతిజ్ఞ చేసింది. తర్వాత దేహత్యాగంచేసి, మండోదరి గర్భంలో ప్రవేశిస్తుంది. ఆమె మండోదరి కుమార్తెగా జన్మించగానే, "ఈ శిశువు మిమ్ము నాశనంచేస్తుంది" అని కార్తాంతికులు రావ

ణునికి చెబుతారు. రావణుడు భయపడి, ఆ శిశువును ఎక్కడయినా వదిలిపెట్టి రమ్మని మారీచికి ఆజ్ఞాపిస్తాడు. మారీచి ఆ శిశువును ఒక పెట్టెలోపెట్టి మిథిలాదేశంలో ఒకచోట పూడ్చి పెడతాడు. ఎవరో కృషీవలులు భూమిని దున్నుతుండగా, నాగలికర్రుకు ఆ పెట్టె తగులకొని పైకిరాగా, కృషీవలులు ఆ పెట్టెను జనక మహారాజువద్దకు తీసుకొని వస్తారు. జనకుడు ఆ పెట్టెను తెరచి చూడగా ముద్దులు మూటగట్టే పాప. ఆమెకు సీత అని పేరు పెట్టి, పెంచి పెద్దచేస్తాడు. చాలకాలం తర్వాత జనకుడు తన యజ్ఞ సంరక్షణార్థం రామలక్ష్మణులను ఆహ్వానిస్తాడు. యజ్ఞం సమాప్తమయిన తర్వాత సీతారాములకు వివాహమవుతుంది. తర్వాత రాముడు మరి ఏడుగురు కన్యలను పెళ్లాడుతాడు. లక్ష్మణుడు పృథ్వీదేవి మొదలైన పదహారుగురు రాజకన్యలను వివాహమాడతాడు. వారిద్దరూ దశరథుని అనుమతితో వారాణసిలో నివసిస్తారు.

కొంత కాలానికి నారదుడు రావణుని వద్దకు వెళ్లి సీత సౌందర్యాన్ని వర్ణిస్తాడు. అది విని రావణునికి సీతను అపహరించుకొని పోవాలనే బుద్ధి కలుగుతుంది; సీత మనసును తెలుసుకొనడానికి శూర్పణఖను పంపుతాడు, కాని, సీత పాతివ్రత్యం చూచి, శూర్పణఖ రావణుని వద్దకు తిరిగివచ్చి, సీత మనస్సు దృఢమయిందని, దానిని కదలించడం సంభవం కాదని రావణునికి స్పష్టపరుస్తుంది.

రాముడు, సీత ఒక మారు వారాణసి సమీపంలోని చిత్రకూట వాటికలో విహరిస్తుండగా, మారీచి స్వర్ణ మృగరూపంతో రాముణ్ని దూర ప్రాంతానికి లాక్కుపోతాడు. ఇంతలో రావణుడు రాము వేషంలో సీత వద్దకు వచ్చి "నేను బంగారు లేడిని అంతఃపురానికి పంపాను. నీవు పల్లకిలో ఎక్కి బయలుదేరు" అని చెబుతాడు. ఈ పల్లకి నిజానికి పుష్పక విమానం. సీతను అది లంకకు తీసుకువెళ్తుంది రావణుడు సీతను స్పృశించడు. ఎందుకంటే, పతివ్రత స్పర్శతో అతని ఆకాశగమన —కామచార— విద్య నశించిపోతుంది.

ఇంతలో దశరథునికి ఒక కల వస్తుంది రావణుడు సీతను అపహరించుకొని వెళ్లాడని ఆ కలలో చూస్తాడు. ఈ సమాచారాన్ని అతడు రామునికి వార్తాహరుల ద్వారా తెలియపరుస్తాడు. ఇంతలో సుగ్రీవుడు, హనుమంతునితో పాటు వానరపడార్థం రాముని సహాయం కోరడానికి వస్తాడు. హనుమంతుడు లంకకు వెళ్లి సీతను సాంత్వనపరచి తిరిగి వస్తాడు. తర్వాత లక్ష్మణుడు వాలిని వధిస్తాడు తర్వాత సుగ్రీవుడు తన రాజ్యం సంపాదించుకుంటాడు.

సముద్రంపై సేతువు కట్టే ప్రసక్తే ఈ కథలో లేదు. వానరులు, రాముని వెంట విమానాలలో లంక చేరుతారు. ఘోరయుద్ధానంతరం లక్ష్మణుడు చక్రంతో రావణుని శిరస్సు ఛేదిస్తాడు. రాముడు ఎలాటి పరీక్ష లేక సీతను స్వీకరిస్తాడు. తర్వాత లక్ష్మణుడు రామునితో పాటు 42 సంవత్సరాల వరకు దిగ్విజయ యాత్రచేసి అర్ధ చక్రవర్తి అయి, అయోధ్యకు తిరిగి వస్తాడు. తర్వాత ఇద్దరికీ ఒకే మారు అభిషేకం అవుతుంది.

లక్ష్మణునికి 16 వేల మంది, రామునికి ఎనిమిదివేల మంది రాణులు ఉంటారు. కొన్ని సంవత్సరాల తర్వాత రామలక్ష్మణులు భరత శత్రుఘ్నులకు రాజ్యం అప్పగించి, వారాణసి చేరుకుంటారు. సీతకు విజయరాముడు మొదలైన ఎనిమిది మంది కుమారులు కలుగుతారు. సీతాత్యాగ కథ దీనిలో లేదు. లక్ష్మణుడు ఒక అసాధ్యమైన వ్యాధితో మరణించి, రావణుని చంపిన పాపానికి నరకానికి వెళ్తాడు. రాముడు లక్ష్మణ పుత్రుడైన పృథ్వీసుందరుని రాజ్యంలో ప్రతిష్ఠించి, సీత కనిష్ఠ పుత్రుడు అజితంజయుని యువరాజుచేసి, సుగ్రీవుడు, హనుమంతుడు, విభీషణుడు మొదలైన ఐదు వందల మంది రాజులు, 180 మంది పుత్రులు వెంబడిగా తపస్సాధన కోసం బయలుదేరుతాడు; 395 సంవత్సరాలు గడచిన తర్వాత రామునికి కేవల జ్ఞానం కలుగుతుంది. సీత కూడా ఎక్కువ మంది రాణులతో పాటు దీక్ష స్వీకరిస్తుంది రాముడు హనుమంతుడు మోక్షం పొందుతారు సీత స్వర్గానికి వెళ్లుతుంది. లక్ష్మణుడు నరకం అనుభవించిన తర్వాత సంయమ జీవితంతో మోక్షం పొందుతాడు

## వాల్మీకి మతానుసారి రామకథ:

మూడవ పాదు వాల్మీకి రామాయణాన్ని అని మొదట్లోనే అన్నాను. వాల్మీకి రామ కథను పైన బౌద్ధ జైనాచార్యులు ఎంత వికృతం చేసినా, అది సత్యకల్యాణంగా ఉంటుందని అనడానికి గాథా సప్తశతిలోని రెండు గాథలు తార్కాణ :

## గాథా సప్తశతి :-

కొత్తగా కాపురం. పెద్దకొంప మర్యాదగల పెద్ద ఇంటి తనం. ఇంట్లో పెద్దలు ఎవరికివారు పనిలో ఉంటారు. భర్త ఇంటి పెద్ద కొడుకు కాబోలు! కార్యాంతర నిమగ్నుడయి ఉంటాడు. ఇదే అందుకదా అని ఒకవద్ద మనస్కుడయిన మరది తన వెంటబడుతాడు. పెద్దలకు తెలుపుదామా, అంటే ఇల్లు భగ్నమవుతుందని భయం. చెప్పకపోదామా, మానమే పోతుంది. కనుక కులవధువు — పెద్ద మనసుగల కోడలు వివేకవంతురాలు కావడంవల్ల మరదికి అతని మనసు మారడానికి గోడమీద వ్రాసిన రామానుయాయుడయిన సౌమిత్రి కథను — రామునివెంట వెళ్తున్న లక్ష్మణుని కథను — చూపుతుంది - మరదీ నీవు వెర్రివేషాలు వేయక వెర్రివేషాలు వేయని అన్న విషయంలో న్యాయంగా ప్రవర్తించమని సూచిస్తూ

ణ వరస్స అబ్భత్థ మణస్స
కులవహూ ణిఅ కుడంగలిహిఅం,
దిఅహం కహేఇ రామా
ణులగ్గ సోమిత్తి చరిఅం. 1–35

ఇది హాలనాత వాహనుని గాథ.

లంకా వాసులు రాక్షసులని, వారికి జనం భయపడుతారని జనంలో బాగా వ్యాపించిన ప్రవాదానికి మరొక గాథ వుంది. వసంత కాలంలో బాగా విరిసి ఎర్రటి పూతతో భయం గొలిపె మోదుగ చెట్లకు, రాక్షసులకు శ్లేష కల్పించి చెప్పిన గాథ ఇది.

లంకా లయాణాం పుత్త అ
వసంత మాసేక్కలద్ధ పసరాణం,
ఆపీ అరోహియాణం
ఏహేఇ జణో పలాసాణం. 4-11(అణురాయస్స)

బౌద్ధులు జైనులు రామాయణాన్ని వికృతం చేస్తున్నందుకు విరుగుడు గనా అన్నట్టు కాళిదాస ప్రవరసేనులు రఘువంశ సేతు బంధ కావ్యాలు రచించారా అని నా ఊహ.

## సేతుబంధం :-

వాల్మీకి సంప్రదాయంలో రచించిన ప్రాకృత రామక సేతు బంధం : ప్రాకృత కావ్యసందోహంలో ఉత్తమమైనది సేతుబంధం సంస్కృత మహాకావ్య సంప్రదాయ బద్ధాలయిన అష్టాదశ వర్ణనలు దీనిలో లేకపోయినా, యుద్ధనీతి, సేతు నిర్మాణం మొదలైన యుద్ధ కాండ ప్రధాన ఘట్టాలపై ఆధారపడిన మహాకావ్యమిది. రాముడు సముద్రతీరం చేరి యుద్ధం చేసి, అయోధ్యకు బయలుదేరేవరకు పున్నకథ దీని వస్తువు.

వాకాటక రాజయిన ప్రవరసేనుడు ఈ కావ్యకర్త ఇతడు యుద్ధాలు నడిపినవాడు. దండయాత్రలలో వంతెనలు నిర్మించి వుంటాడు సేనలను ప్రబోధించి వుంటాడు. సామాన్య కవికి అందుబాటులో లేని యుద్ధాది విషయాలలో ఈయన పైచేయి స్పష్టంగా తెలుస్తున్నది; ఈ కావ్యంలో. 15 ఆశ్వాసాల మహా కావ్యం. ఆర్యాభేదమయిన స్కంధకమాత్రాఛందస్సులో కావ్య మంతా సాగుతుంది. చతుర్మాత్రాకాలయిన ఎనిమిదేసి గణాలు పూర్వోత్తరార్థాలలో వుంటాయి.

చఉ మత్తా అట్ఠగణా
పువ్వద్ధే ఉత్తరద్ధహోఇ సారూ అ,
సోఖందఆ వి ఆణహు
పింగల పభణేఇ ముద్ధిబాహు సంభే అ.

ప్రవరసేనుడీ కావ్యాన్ని — సీతాదుఃఖక్షయమైన దశముఖ వధమనే ఈ కావ్యాన్ని—అనురాగ చిహ్నాంకితంగా తీర్చిదిద్దాడు.

తంతి తన బంధమోక్ఖం
సమత్థ తెల్లోక్క హిఅఅసల్లుద్ధరణమ్,
సుణహ అణురాఅ ఇణ్హమ్
సీ ఆదుక్ఖక్ఖఅం దహముహస్సవహమ్. 1-12

సీతాదుఃఖక్షయమైన దశముఖ వధమనే ఈ అనురాగ చిహ్నితమైన కావ్యం వినండి--అని కావ్యం ప్రారంభిస్తాడు కవి. ప్రతి ఆశ్వాసాంతమూ అనురాగ అనురాగ చిహ్నితమే.

సముద్రాన్ని చూచి భయపడి వెనుదిరిగే వానర భటులను సుగ్రీవుడు ఉత్తేజపరచే ఘట్టంలో ప్రవరసేనుడు సేనాపతిగా, మనకు దర్శనమిస్తాడు. "మీ బలం మీకు తెలీదు. మీకు ఈ సముద్రం ఏమిలెక్క ? సముద్ర తీరంలోని పొగడ పూవుల సుగంధంతో గుమగుమలాడే పళ్లరసం దోసిలితో తాగినేసినట్లు రాగివేయగలరు. సుగ్రీవుని ఉపన్యాసం చాల గొప్పది.

తరిఉం ణహు ణవర ఇమం
వేతాపణ బఉల కుసుమ వాసి అసురభిమ్,
హత్థ ఉడేహి సమత్థా
తుమ్హే పాఉంపి ఫలరసంవ సముద్దమ్. 3-7

ఇతడు సేతువును నలపథమన్నాడు. ఈ నలపథ నిర్మాణంలో నలుడు వేసిన తొలిరాయి సముద్రం నీటిపై తేలగా, మంగళ కలశంవలె ఉన్నదని వర్ణించాడు.

పఢమం ణలేణ ణిమి ఓ
మంగలకలసోవ్వ జలణిహిమ్మి మహిహర. 8-29

సేతునిర్మాణంలో వానరులు రాళ్లతేవడం, అందివ్వడం; ఇద్దరిద్దరు చేరి చేతులు చేతులు పట్టుకారలులాగ కలిపి పెద్ద పెద్ద రాళ్లను తేవడం, నలుడు ఆ రాళ్లను మెడతిప్పి చేతులు చాచి అందుకొని, సేతువులోవేసి సర్దడం మొదలయినవాటి వర్ణనలు చూస్తే ప్రవరసేనుడు చెరువు కట్టలు, సేతువులు మొదలయిన పెద్ద పెద్ద పనులు చేయించి వుంటాడని స్పష్టమవుతుంది. 8-87,38. ఈ సేతువు రాముని శాశ్వతయశో లాంఛనములు.

ఆ ధత్తా విరవ ఒ
సాసఅ రామజసలంఛణం సే ఉవహమ్. 7-1

వాల్మీకి రామాయణంలో లంకనుంచి తిరిగి వచ్చిన హనుమంతుడు "దృష్టా సీతా" అని తన కథనాన్ని ప్రారంభించగా దానినే ప్రవరసేనుడు మరింత సుందరంగా చిత్రీకరించాడు. సీతను చూచానని హనుమ అంటే రామునికి నమ్మకం కలగలేదు. చాలా చిక్కిపోయింది అంటే, నిట్టూర్చాడు. తనను గూర్చి విచారిస్తున్నదని హనుమ చెప్పగా, రాముడు విలపించడం మొదలుపెట్టాడు. దుఃఖించకండి, ఆమె సజీవ అని హనుమంతుడు అనగానే రాముడు లేచివచ్చి హనుమంతుని అక్కున చేర్చుకున్నాడు.

దిట్ఠత్తి ణసద్దహి అం
ఝీణత్తి సబాహమంథరం ఊస సి అం,
సోఅఇ తుమంతి రుణ్ణం
పహుణాఇ అఇత్తి మారుఈ ఉప ఊఢో.

మారుతి అలంఘనీయమైన ఉదధిని లంఘించి తిరిగి వచ్చాడు. అతనిని చూచి వానరులు ఆశ్చర్యంతో నిశ్చలులై పోయారు. వారు సహజంగా చండాలులుగదా చిత్రంలోని దీపాల వలె కదలక మెదలక ఉన్నారు, సహజో చాంచల్యం వదలి.

ఆలేఖ్ఖ పఈవాణ వణి అలం
పఇఇ చడుఎత్తణం వి విఅవిఅమ్. 3-45

రాముడు రావణుని యుద్ధంలో ఓడించి, హుతవహ శుద్ధ అయిన సీతను, హుతవహశుద్ధ అయిన బంగారుకడ్డీ కాంచనయష్టి–లాగ్రహించి భరతుని అనురాగాన్ని సఫలం చేయడానికి అయోధ్యా నగరానికి తిరిగి వచ్చాడట.

ఘేత్తూణ సీయ అతణులం
కంచణ లట్ఠింవ హుయవహవిసుద్ధం
పత్తో పురిం రఘువఈ
కాఉం భరహస్స సఫలం అణురాయం (15–94)

## ఈ వ్యాసానికి ఉపయోగించిన గ్రంథాలు, వ్యాసాలు


1 నాథూరామ్ ప్రేమీ – జైన సాహిత్య ఔర్ ఇతిహాస్.

2 Harisatya Bhattacharya:- Narayanas, Pratinarayans and Bala-bhadras. The Jain Antiquity Vol 8.

3 Burlingame, E. W - Buddhist Legends, Harward Oriental Services, Vol 28-30.

4 Chakravarti, A - Buddhist and Jain versions of the story of Rama The Jain Gazette vol 22.

5 Chakravarta Chittaharam - Treditions about Vanaras and Rakshasas. Indian Historical quarterly Vol-1.

6 Fausboll, V - The Jatak, Vol 1-VII, London.

7 Kulkarni, V. M - The Ramayana Version of Sanghadesa as found in Vasudeva Hindi Journal of Oriental Institute, Baroda - Vol-2.

8 Kulkarni, V. M - The Ramayana of Bhadreswara as found in Kahavalu, (Cen) JOI, Baroda, Vol.2.

9 Narasimhachar, D. L - The Jaina Ramayanas, Indian Historical quarterly Vol 15.

10 Nornan, H. C-Commentary on Dharmapada, Vol-5, Pali Text Book Society London.

11 Rhys Davids, W - Buddhist India.

12 Suzuki, D. T-Studies in Lankavatara Sutha, London.

13 Utgikar N. B -The story of Dasaratha Jataka and Ramayana. J R A S cent Supplint 1914.

14 Vyas, S. N - The Civiligation of Rakshasas in Ramayana.

15 Watanabe, K-The oldest record of Ramayana in a Chinees Buddhist writing J R A S 1907.

16 Winternty, M - Jataka Gathas and Jataka Commentry, I H Q Vol 4.

17 Jacobi, H - Encyclo. of Religion and Ethics Vol 2 & 7.

18 Keith, A. B - History of Sanskrit Literature.

19 Kern, H - Manual of Buddism, Strosburg - 1896.

20 Vaidy, C. V - The Riddle of Ramayana, Bombay.

21 Weber, A - Ueberdas Ramayana, Berlin, 1870 English translation-D. C Boyd, Bombay 1873.

22 Smith, H - Suttanipata Commentary Para-maththe jotika by Buddha Ghosha. Pali Text book society, London.

23 Sen, D. C - Bengali Ramayana, Calcutta. History of Bengali Literature, Calcutta

24 Wheeler, J T - History of India, Vol II London.

25 పఉమ చరియం విమలసూరి, హెర్మన్ యాకోబి ఎడిటు సంపాదితం, హిందీ అనువాదం శాంతిలాల్ ఎ. వోరా, టీక – వి. ఎం. కుల్కర్ణి.
Prakrit Text Society, Varanasi-5

26 రామాయణం

27 సేతుబంధం –

28 గాథా సప్తశతి నిర్ణయ సాగర ప్రెస్, బొంబాయి

29 'భారతి' సంపుటాలు మద్రాసు, విజయవాడ.

30 రామకథ – రెవరెండ్ ఫాదర్ కామిల్ బుల్కే, ఎస్. జె., ఎం. ఎ., డి. ఫిల్; డి లిట్. అధ్యక్ష హిందీ విభాగ్, సెంట్ జేవియర్ కాలేజ్, రాంచి. హిందీ పరిషత్ ప్రకాశన్, ప్రయాగ విశ్వవిద్యాలయ, ప్రయాగ.

31 జాతక కథలు (తెలుగు అనువాదం) శ్రీ శివశంకరస్వామి.


[ అయిపోయింది ]

శ్రీ వి. వి. న. మూర్తి

# మరల మధ్య మందారం

నేను సౌందర్యోపాసకుడినట. తను ఉంటున్న ప్రదేశం ప్రకృతి అందానికి ఆలవాలమట. ఓ మారు వచ్చి నాల్గు రోజులుండి చూచిపోవాలట. మాధవ వ్రాసాడు. అది చదువుతుంటే ఎవరో నా వీపుమీద చరిచినట్లయింది. నన్ను చూస్తూ వెకిలిగా నవ్వుతూ "నువ్వేనోయ్! సౌందర్యోపాసకుడివి" అంటున్నట్లయింది.

కుర్చీలో జారబడి చూట్టూ చూసాను.

పిల్లలిద్దరూ ఏడుస్తున్నారు. అప్పుడే వాళ్ళని బాదాను. పాతబడిన యింటి పైకప్పులోంచి బూజులు వేలాడు తున్నాయి. ఆ గది నా వాటాలో ముఖ్యాంగం. సన్నపాటి వరండాని రెండు ముక్కలు చేసి ఓ భాగానికి వంట గది అనీ; మరో భాగానికి బాత్రూం అనీ అన్నారు. వెనక ఒట్టు గోడను ఆనుకుని ఉన్న వీధిలో పాకీ బుట్టల వరసలున్నాయి. వాటి సువాసన యథేచ్ఛగా గాలిలో కలుస్తోంది. రోడ్డు వయిపు నుంచి పరుగులు తీస్తున్నాయి బస్సులు! లారీలు! రిక్షాలు! ఆ అరుపులకి తోడు వ[illegible] ఆవిడ బాత్రూంలో అంట్లుతోముతూ కర్ణ కఠోరంగా సమస్త ప్రపంచాన్నీ విసుక్కొంటోంది. అలసటగా ఉంది. ఆమె యింకా కాఫీ తేలేదు. అలాంటి పరిస్థితిలో పిల్లవాళ్ళ చేతిలో నలుగుతూన్న ఉత్తరం అందింది.

కళ్ళు మూసుకున్నాను. హైమ...ఎదురుగా నిలచినట్టయింది. ఆమె కోసం నేను సౌందర్యోపాసకుడినయానో, సౌందర్యోపాసకుడిని అయి ఉండటం వల్లనే ఆమె పరిచయ భాగ్యం లభించిందో ఎప్పటికీ తేలని సమస్య — ఏమో మరి! ఆ రోజుల్లో ఏ కొండను చూసినా నా కోసమే అలా వంపులు తిరిగిపోతూ నీలాకాశం వయిపు సాగిపోతున్నట్లు కనుపించేది. ఎక్కడ వెలుగు నీడలు చూసినా ఆ సృష్టి అల్లిక నా కోసమే! ఏదో తనివితీరని దాహంతో ప్రతి పువ్వు వయిపూ, ప్రతి గడ్డిపరక వయిపూ చూపులు పరుగులెత్తేవి. ఎవరా అందాలను చూసినా, పట్టించుకొన్నా వాళ్ళు నా వాళ్ళే! నా ఆత్మీయులే!

హైమ వెన్నెలను చూస్తూ మైమరిచేది. మంచులో తడిసిపోతూ పరవశించేది. ఎప్పుడూ ఆ గంధం చెట్లదగ్గర... ఆ సెలయేటి దగ్గరా ... మామిడి కొమ్మల మీదా ... ఎక్కడని చెప్పటం? ప్రతి అందం చూస్తూ, ప్రతి పక్షినీ అనుసరించి గెంతుతూ కూస్తూ ఉండేది. యిప్పటికీ అరవిచ్చిన మందారంలోని ఎరుపూ; దట్టంగా అలముకున్న మబ్బుల మధ్య నుంచి సాగివచ్చే మెరుపూ ఆమె పెదాలనూ, వాటి మధ్య చిరునవ్వుల కాంతినీ గుర్తు చేస్తూనే ఉంటాయి.

ఏమిటో పిచ్చి! ఏవో కబుర్లు! అంతూదరీలేని విషయాలు! అలాంటప్పుడు ఏమీ మాట్లాడకుండా ఆ పెదాలనూ, కళ్ళనూ చూస్తూ కూర్చోవాలనిపించేది అయితే ఆలోచనలు ఊరుకొనేవి కావు! చూచే అనుభవం నుంచి ఎడం చేసేవి హృదయాన్ని.

అలాగని చూడటం మానివేసేవాణ్ణా?! కొంచెం దూరమైతే చాలు పరుగెత్తేవాణ్ణి. వెనికే వాణ్ణి! నిరాసలేని ఆకాంక్షతో! తరుగుతేని ఉత్సాహంతో! ఏ చెట్టు కొమ్మల్లోనో కనుపించేది! అస్తమించే సూర్యుడినో; ఉదయించే చంద్రుడినో చూస్తుండేది. పదాలు లేని భాషలో మౌన కవిత్వం లిఖిస్తున్న మహాకవిలా అగుపించేది. సమీపిస్తున్నకొద్దీ పాదాలకు వేగం తగ్గిపోయేది!

ఎంత సుందర దృశ్యం! అనుక్షణమూ మార్పులకూ లోనయే సౌందర్య సముదాయ సృష్టి అయితేనేం? ప్రతి ఒక మార్పూ హృదయాన్ని కదిలిస్తుంది. ప్రతి ఒక వర్ణమూ ఉత్తేజం కలిగిస్తుంది. అలాగే మార్పులకు లోనయే ఆమె ఆ అస్తమయ సూర్యకాంతిలో సృష్టి – సౌందర్య దేవతకు దిద్దిన తిలకంలా మనసు కదిలించి ఉత్తేజ పరిచేది.

ఈనాడు యీ మరల మధ్య మోటారు కార్లు రేపే ధూళి మధ్య; ఫ్యాక్టరీలు విసర్జించే మలినాల మధ్య; వాటి వాసనల మధ్య...హృదయ సంబంధం లేని జీవితం గడుపుతున్న నాలో శిథిలమయిపోయిన సౌందర్య వీక్షణా కాంక్ష చివురు లెత్తి; మొగ్గ తొడిగి; ఫలప్రదం కావటం జరిగే పనేనా?

యీ జీవితం గూర్చి, యీనాటి నా స్థితి గూర్చి ఒక్క సెకను నిదానంగా పరిశీలించుకోటానికే అవకాశమీయనంత వేగంలో సాగిపోయే కాలం, ఆగిపోయే సౌందర్యం; హృదయం; స్పందన వంటి పదాలకు తిరిగి తావీయగలుగుతుందా??

ఆనాడు ఆ కొండలకూ; ఆ పచ్చికకూ; ఆ సెలయేటి యిసకకూ; గులకరాళ్ళ చప్పుడుకూ శాశ్వతంగా అంకితమయి పోవాలనుకున్న ఆకాంక్ష ఏమయిపోయింది? ఏ పరిస్థితుల మధ్య నాశనమయిపోయింది??

బి. యే. పూర్తయింది. అందుకో ఉద్యోగం కూడా దొరికింది. స్కూలూ కాలేజీ మెట్లమీద ఎక్కి ఒకరకమయిన క్రమశిక్షణా స్వేచ్ఛకూ అలవాటయిన బ్రతుకులోంచి ఒక్కమారుగా మరో రకమయిన క్రమశిక్షణకూ, స్వేచ్ఛకూ అలవాటయిన ఔద్యోగిక జీవితంలోకి విసిరివేయబడ్డాను. కాలేజీ మెట్లమీద ఏర్పడిన ఆశయాలూ; ఆనందాలకర్థాలూ నెరవేర్చుకోటానికి కావలసిన స్వేచ్ఛ లభించిందనే సంభ్రమంతో ఆ కొండల్లోకి

పరుగెత్తాను. కాని, అప్పటికే అరుణోదయ స్పర్శతో విడిపోతున్న మంచు తెరల్లా వయో ప్రభావంతో ఊహల తెరలు తొలగిపోయి వింత వింత కోరికలు బయల్పడేవి.

ఆ వూరు కొండల మధ్య ఉండేది. సముద్రమట్టానికి బాగా ఎత్తున ఉండేది. ఎప్పుడూ చల్లని గాలి; ఎప్పుడొస్తాయో తెలియని వానలు. ఎక్కడ చూసినా రమణీయ దృశ్యాలు. చదువు చెప్పటం నా వృత్తి అయినా సృష్టిని చదువుకోవటమే వ్యావృత్తి అయింది.

హైమ ఆ వూళ్ళోనే కనిపించింది. మొదటిసారి చూసి నప్పుడు మరోసారి చూడాలనిపించింది. మరోసారిచూసాక యింకో సారి! యింకోసారి చూసాక...ఎప్పుడూ తెలుసున్నదే అయినట్లూ; ఎప్పుడో తెలుసుకోవాల్సిందయినట్లూ తోచేది. అలా చూస్తూ చూస్తూ ... 'చూడకుండా ఉండలేనింక' అని నిర్ణయించు కున్నాక...అనుకున్నాను.

''సృష్టీ! నాకు జన్మలభించింది. కనులు లభించాయి! మనసు లభించింది. అన్నీ నీవే ప్రసాదించావు. వీటి నన్నింటినీ ఒంటరిగా ఉంచలేకనా ఈ ఆకాంక్షనూ; యీ మధుర మూర్తి దర్శన భాగ్యాన్నీ ప్రసాదించావ్!''

సృష్టి తనగాలి గొంతు విప్పి మనోహరంగా నవ్వడి చేస్తూ వూల వాసనలతో నా యింద్రియాలను మేల్కొల్పుతూ 'అవున' న్నట్లు సమాధానమిచ్చేది.

తీర్చి దిద్దిన శారీరక సౌందర్యమా? సుకుమారంగా చిన్న పిల్లలా ప్రవర్తించే లాలిత్యమా? ఆ ప్రకృతిలో కలిసిపోయి పరవశించి పొంగిలిగిన మనస్తత్వమా? ఏది హైమలో నన్నా కర్షించినది?

ఎప్పుడూ కురిసే వానలూ! చిత్తడి చిత్తడిగా ఉండే నేలా! మలేరియా జ్వరం! జంతు భయం! కులాసాగా తిరిగే పాముల సంతానాలూ! అక్కడకు చేరుకున్న మాస్టర్లందరూ ఎందుకు వచ్చాంరా! దేవుడా! అని బాధపడేవాళ్ళే! అది పనిష్మెంటు ఏరియాట! ఎవరెవరు ఏయే విధాలుగా ట్రాన్స్‌ఫర్ చేయబడ్డారో చెప్పుకుంటూంటే విసుగనిపించేది. వాళ్ళతో కలయ లేక పోయేవాణ్ణి! జీతాలు సక్రమంగా అందక వాళ్ళు యిబ్బందులకు లోనయి అస్తమానూ డబ్బు గురించే మాట్లాడుకొనేవాళ్ళు. సృష్టి అందాలకు ఆనందించలేని వాళ్ళమీద చులకన భావం ఉండేది నాలో! వాస్తవిక జీవితంలో ఆ గొడవల వెనుక ఎంత దారుణమయిన విచక్షణా రహితమయిన అధికార దుర్వినియోగం ధన మదాంధత ఉన్నాయో! ఈరోజు యీ మరల మధ్య యిలా చిక్కుకోటాన్కి కారణం కొంతవరకూ అదేనేమో?!?

ఆ కొండల మధ్య అయ్యరు కాఫీకొట్లో చాలా మంచి టీ దొరికేది. హైమ అయ్యరు కూతురు. తల్లిలేని పిల్లను తీసు కొని అక్కడికి వచ్చేసాడు తండ్రి. చిన్నతనం నుంచి మూగదానిలా ఎవరితోనూ మాట్లాడేది కాదుట. ఎప్పుడో పోయిన తల్లి రూపం ఎలా ఉండేదా అని ఆలోచిస్తూ ఉండేదేమో! తండ్రి తల్లి గురించి అప్పుడప్పుడు చెప్పే మాటలను మననం చేసుకుంటూ; విశాల గగనాన్నీ, గంధం చెట్లనూ చూస్తూ—ఆమె పెద్ద పెద్ద కళ్ళనూ, మేని ఛాయనూ లెక్కలు కట్టేదేమో! ఎప్పుడూ వచ్చిపోయే మనుషుల మధ్య వ్యాపారం చేసుకునేవాడు తండ్రి. ఆమెను ఖాతరు చెయ్యటానికిగాని... ఆమె ఖాతరు చెయ్యటానికిగాని ఎవరూ లేరు. బహుశా అందువల్లనే ఆమె ఒంటరిదయింది. ఆ ఒంటరితనమే ఆమెకు ప్రకృతితో జంట కుదిర్చింది. అయ్యరు దుకాణం వెంకుటల్లోయేసరికి ఆమె మనసు చిన్న కుటీరంలా మారిపోయింది. అందులో ఏముందో పట్టించుకోటానికి వీల్లేకుండా పూర్తిగా ద్వారాలు మూతబడిపోయాయి.

అక్కడ టీ తాగినపుడల్లా ఆ అయ్యరు ఆమెకు తండ్రి కావటం వల్లనే అంత మధురంగా టీ పెట్టగలుగుతున్నాడని పించేది. మనసు చేసే ఆలోచనలకు అర్థం ఉండదని నవ్వు కొనేవాణ్ణి.

స్కూల్లో పాఠాలు ముగించుకుని యింటికి చేరేసరికి భూతం లాంటి పెద్ద క్వార్టరు! 'నువ్వు ఒంటరి వాడవోయ్!' అంటు న్నట్లు గోడలూ! అస్తవ్యస్తంగా పడున్న బట్టలు! పుస్తకాలు! నీళ్ళుండని కూజా. గబగబా బట్టలు మార్చుకొని అయ్యరుకొట్టుకు పరుగెత్తేవాణ్ణి.

ఆమె ఉండదక్కడ. తెలుసుండీ వెళ్ళాను. నిన్నమధ్యాహ్నం కదిలిపోయిన మేఘం కోసం నేడదే ప్రదేశంలో వెదకటం ఎంత తెలివి తక్కువ! వ్యక్తులను వాళ్ళ గృహాలను బట్టి వెతుక్కుం టారు జనం! వాళ్ళ ప్రవృత్తిని బట్టి వెతక గలిగితే ఏ మనిషినీ కోల్పోవడం; చూడకపోవటం జరగదు. అయితే ఆ నేర్పు ఎంతటి వారికి!

ఎన్ని పువ్వులు! ఎన్ని ఆకులు! ఎంత యిసుక! ఎంత పొడవైన సెలయేరు! ఎన్ని గులకరాళ్ళు! ఎన్ని కొండలు! చెట్లు! ఎక్కడని వెదకను? ఎన్నింటినని అడగను? బదులివ్వటం చేత కాని వాటిని ప్రశ్నిస్తూ వెతుక్కునేవాణ్ణి. అవి యిచ్చే బదులును అర్థం చేసుకోలేని తెలివి తేటలతో ప్రశ్నించేవాడిని. ఎక్కడయినా పొరపాటున వెదకటం మానేస్తానేమో! ప్రతి దాన్నీ గుర్తు చేసు కునే వాడిని. తిరిగించోటే తిరిగేవాణ్ణి! అప్పుడప్పుడు నాయత్నం ఫలించేది.

యిప్పపూలను కుప్పగాపోసి ఆటలాడుతుండేది. సూర్యుని చివరి వెలుగుల్లో మెరిసిపోయేవి ఆమె కనులు! మోము! తడి యిసకను గుప్పిట్లోకి తీసుకొని ఈ చేతిలోంచి ఆ చేతిలోకి పోసు కుంటూ, రాళ్ళమీద కూర్చుని, కాళ్ళతో నీటిని కదిలిస్తూ ఉండేది. పచ్చని పాదాలు స్వచ్ఛమయిన నీటి అడుగున చేప పిల్లల్లా కదు లుతూ ఉండేవి ఆవేళ్ళ పరిశుభ్రమయిన నీటితో కడిగిన పచ్చల్లా ఉండేవి.

సృష్టిలో విడదీయలేని ఒక భాగంలా ఉండేది హైమ. సృష్టి తన సౌందర్య దాహమంతా ఆమెలో తీర్చుకుందా అన్న

సందేహం ఏర్పడేది. ఎలా పరిచయం మొదలయిందో స్పష్టంగా చెప్పలేనుగాని...నేను కూడా తనలాగే ఈ అందాలపట్ల శ్రద్ధగల వాడిననిపించటం వల్లనేమో/ ... తనలో తనకు కలిగే ఆనందాన్ని నాతో పంచుకోటం ప్రారంభించేది.

''చూడు చూడు! ఆ పావురం! అబ్బా! ఎంతలా ఎగురుతోందో! మనం కూడా అలా ఎగరగలిగితే బలే! బలే వుంటుంది కదూ! అరరే! చూడు! ఆ మబ్బుదాకా ... ఆ! ఆ! దాన్ని ముట్టుకుంటుందని పందెం! ఏదీ? కనిపించటం లేదే...నీక్కను పిస్తోందా? అక్కణ్ణుంచి కనిపిస్తోందా ... ?'' వింత ఉత్సాహం! వింత నిరాశ! ఆ కళ్ళతో దోబూచులాడేవి.

''వర్షంలో తడిసి వణికి పోతున్న గువ్వలజంట నీ కళ్లలో దర్శన మిస్తోంది హైమా''! అనాలనిపించేది.

''బలే బావుందేం! ఈ యిసకలో నడుస్తుంటే!'' అనేది.

''నీకెలా వుంది?'' ప్రశ్నించేది.

''పాపం! ఈ ఎన్ని ముండలు పడిపోయాయి! వాళ్ళమ్మ ఎప్పుడొస్తుందో?'' గూళ్ళు సరిచెయ్యటానికి చెట్టెక్కేది.

కోకిల కూతలను అనుకరించేది. నన్నూ అరవమనేది.

ఎప్పుడయినా ఏ కోతి అయినా మిర్రు మిర్రు మని చూస్తే ''దొంగ ముండకు నేనంటేకోపం'' అంటూ వెక్కిరించేది.

ఏదో అడిగి, జవాబుకోసం చూచేదే కాదు.

అటువంటప్పుడు ఏదో మహారాణి - అంతకాలమూ అంతఃపుర మర్యాదలలో మగ్గిపోయి ఒక్కమారుగా సంకెళ్ళను తెగదెంచుకుని ప్రపంచంలోకి అడుగు పెట్టి గెంతులేస్తున్నట్లు తోచేది.

ఆమె నాకు పూర్తిగా చేరువయింది. అందుకు ముఖ్యమైన కారణం నాలోని శారీరక వాంఛలను తొందరపడి ప్రదర్శించక పోవటం! ఆమె కంటికి పురుషులంతా ఎలా కనుపించేవారో ... ఆమె మనసుకు ఎలా అర్థమయేవారో...లలా కనుపించకపోవటం! అనిపించకపోవటం! ఆమెలో పురివిప్పి నాట్యమాడే సృష్టికి సంబంధించిన వీక్షణాలాలస—నాలో కూడా ఉందనో; నాలోనే ఉందనో — ఆమెకు అనిపించేలా చేయగలిగాను. మూసుకున్న ఆమె హృదయ కుటీర ద్వారాలు తెరువబడి నాకు ప్రవేశం లభించింది.

ఒకమారు ఆమెలో స్థానం లభించాక; నా బెల్లింపులకూ, చిన్న చిన్న బెదిరింపులకూ, బతిమలాటలకూ ఆమె లొంగిపోవటం మొదలయింది. పువ్వులనీ, మబ్బులనీ వర్ణించిన నోరు కనులనీ పెదాలనీ వర్ణించింది. వాటిని వర్ణించుతూనే తాకగలిగింది. నా పెదాలు ఆ కళ్ళనుంచి పెదాల నుంచి ప్రారంభించిన ప్రయాణం చాలా చాలా దూరం సాగిపోయింది. ఆమెను ఏ బంధాలూ ... ఏ నియమాలూ నా వద్దకు రాకుండా ఆపలేకపోయాయి. దొరికిన కొద్దీ కావాలనీ; కావలసినదంతా దాచేసుకోవాలనీ పేరాశ! ఆ సౌందర్యం నా స్వంతం కావటంతో దాన్ని ఎలా రక్షించుకోవాలా అన్న తపన — నాలోని మంచితనానికి రుజువుగా మొలకెత్తింది. ఆ తపన పెరిగి పెద్దదయితే...??

రావుగారి పూర్తి పేరు వీరభద్రరావుగారు. వారి పూర్తి స్వరూపం రాజకీయం. ''పెళ్ళాన్ని ప్రేమించడానికీ, పిల్లి డ నుంచు కోటానికీ కూడా ఉండాలోయ్ రాజకీయం...'' అంటూ సెలవిస్తారట ఆయన. ఆయన మూతిమీద మీసాలూ, ఆ ఒంటిమీద ఖద్దరూ ఆయన అధికారాన్నీ, పలుకుబడినీ జనానికి సైన్ బోర్డుల్లా గుర్తు చేస్తాయి. ఆయన పూసుకొన్న సెంటులో జిల్లా పరిషత్తు ప్రెసిడెంటు గిరీ; గ్రంథాలయాల అధ్యక్ష పదవీ; ప్రజల కష్టాలు ప్రభుత్వంతో నివేదించుకొనే అందమయిన నౌకిరీ వంటి వెన్నెన్నో కలగలిసి పోయాయి. వారు వేసవికాలం ఎండలకు జడుస్తుంటారు. వారి సుకుమార దేహరాజం ఆ తాపాన్ని భరించజాలదు. అందుకే ఆ కొండల మధ్యకు వేంచేసి ట్రావెలర్సు బంగ్లాల్లో వుంటుంటారు. ప్రతి ఏడూ వేసంగుల్లో, 'పర్యవేక్షణ' మిషతో, ప్రభుత్వధనంతో, స్వజనంతో.

వారిని దర్శించటానికి; అవసరమయినవన్నీ అమరించటానికి; ఎవరి బాధలను వారు నివేదించుకోటానికి మాస్టర్లందరూ వెళ్ళేవారు. వారితో కలిసి; వారిలాగే నేనూ అణకువ ప్రదర్శించాను. వారి గొంతులోంచి వచ్చే శబ్దాలకు అక్షరరూపం యివ్వడానికి మా చెవులు శ్రమపడ్డాయి. అందరమూ బయటపడ్డాం! మాలో. అవసరం ఉన్నవాళ్ళు ఆయనకు కాకా పట్టడానికి ఎక్కువసార్లు వెళ్ళారు. చందాలు వేసుకుని అందరమూ ఆయనకు సౌకర్యాలు కలిగించాం.

ఆయన సపరివారంగా అయ్యరు టీ కొట్టుకు వెళ్ళేవారు నిజానికి వారికి వెళ్ళవలసిన అవసరం లేదు. అయ్యరు మరింత ప్రత్యేకంగా గౌరవంతో యిచ్చిన ఉచిత తేనీరు సేవించి...ఆ రుచిని మెచ్చుకుంటూ కాస్త ఎక్కువ కాలమే అక్కడ గడిపేవారు. అక్కడ ఎక్కువ సమయం గడిపే చాలా మందికున్న కారణమే వారినీ అక్కడకు రప్పిస్తోందని గ్రహించటానికి నాకు ఎక్కువ సమయం పట్టలేదు.

ఆరోజు నాకు బాగా గుర్తు. నేను వెళ్ళేసరికి ఎదురుపడిన దృశ్యం···యిప్పటికీ మరువలేను. ఆయన హైమ భుజం మీద చేయివేసి మాట్లాడుతున్నారు. వారు చేయివేసి మాట్లాడుతున్న తీరులో ఒక విధమయిన అధికారం; మాలిమి ఉన్నాయి. ఆమె తల వంచుకుని ఉంది. అయ్యరు ఏదో అంటున్నాడు. ఆయన బొంగురు గొంతుక నా చెవిలో పడింది.

''ఎదిగి పోనాదయ్యా అయ్యరూ! మాంచి ఏపుగా ఎదిగి పోనాది.''

అయ్యరు మరింత వినయంతో ముడుచుకుపోయాడు.

ఆ సంభాషణ నేను పూర్తిగా వినలేదు. ఏదో అనుమానం! బాధ! నా వస్తువును ఎవరో ఎత్తుకుపోటానికి ఎత్తులు వేస్తున్నట్లు అనిపించింది. నేను గబగబా నడుచుకుంటూ సెలయేటి దగ్గరకు పోయాను.

అనేక ఆలోచనలు!

ఎందుకింత ఆరాటం? ఏమిటీ దుఃఖం? ఆ ఆరాటానికి ఆ దుఃఖానికి మూలం ఏమిటి? హైమ! హైమను అపార్థం చేసుకున్నాను!

అలా అనిపించి అనిపించగానే ఆమె కోసం పరిగెత్తాలని పించింది. ఆమె నాకు శ్రమనివ్వలేదు. వస్తూనే—

“కోపం వచ్చిందా?” ప్రశ్నించింది. అంతే ఆ ప్రశ్నలో సమాధానం కోసం ఆరాటంలేదు. ఏ అమాయకత్వమూ, ఏ ఒంటరి తనమూ నన్ను ఒకనాడు కదిలించగలిగాయో...అవి... ఆ పరిచయం యింత దూరం సాగిపోయాక అంతగా కదిలించలేక పోయాయేమో!! అందంతో బాటు పురుష ప్రవృత్తిని తృప్తి పరచగల మేధస్సుతో కూడిన బానిసత్వం...ఆమె నుంచి ఆశించా నేమో!!! ఆలోచించాక నా మనసు నెమ్మదిగా సర్దుకొంది. అలా సర్దుకోవటమే నా గొప్పతనమా?

రావుగారికి ... పరుగుయితీసే హైమను చూస్తే తన యింట్లో తన అధికారం క్రింద ఉండే కుక్కపిల్ల గుర్తు వచ్చేది కాదనుకుంటాను ఎవరిదో కుక్కపిల్ల! అందంగా ఉంది! మెచ్చు కోవాలి! ఓ మారు ఆడుకోవా! అనుకునేవారనుకుంటాను. అయితే ఆయన దగ్గర చాలా రకాల గొలుసులున్నాయి కాని...ఆ కుక్కపిల్లను కర్షించే బిస్కత్తు లేకపోయింది. వారి పరిశీలనలో నేను పడ్డాను. నాకు శ్రీముఖం అందింది. ఆదరాబాదరా పరు గెత్తాను.

“మాస్టారూ! బలే అదృష్టవంతుడివయ్యా!’

నా నోరు ఆ మాటకు చిత్తం అంది.

“మాంచి గుంటకే యేసినావే మూపు!”

“మీరంటు...న్నదేంటో...” నీళ్ళు నమిలాను.

వారు నవ్వారు. వారి స్నైను దొడ్లు నవ్వాయి. వారి ముందున్న సీసాల్లో ద్రవం నవ్వింది. వారి సైన్యం నవ్వింది.

“ఓసోసి! మోత గడతన్నాడయ్యా మాస్టారు!” పక్కవారిలో అన్నారు.

‘సర్లేవయ్యా! యియ్యేల నువ్వయినావు! ఆ సెయ్యి మంచి దయినాది! కొత్తోడివయినా గట్టోడివే! మాంచి కేసే పట్టేసావు.”

చాలా తెలివి తక్కువ ప్రశ్న వేసాను ... “ఎవరి గురించి మాట్లాడుతున్నారు?”

“ఓరి గుంటించా! బలే వాడివయ్యా! ఎంత ముదున్నా రేటి? మూడేళ్లబట్టి కాసుక్కూకున్నాను. పంట మాంచి కాపుకి వొచ్చేయాలనే కోసేసుకునావు! అట్టుకెల్తే అట్టుకెల్లుగానీ ... ఓ పని నా గూడా ఒగ్గేసి యెళ్ళు.”

ఆపయిన వారు తమ పాత కథలనూ, వీరోచిత కార్యాలనూ ఉగ్గడించారు. పెళ్ళాలనైనా తెచ్చి యివ్వడమే మాస్టర్ల విధి అన్న ధోరణి ప్రదర్శించేరు. ఏ పంతులమ్మలను ఎలా ఎలా వేటాడినదీ సోదాహరించారు.

''ఓపాలి నాకు సూపించి సొంతం చేసుకో! మీ యిద్దరికీ మాంచి వూరేయిస్తాను. నేదంటే మరి...మర్యాదాగుండదు...''

వారు ఆశలు కల్పిస్తే, 'లొంగను' అనుకున్నాను. అనునయం చూపితే 'కుదరదు' అనుకున్నాను. నీతులు చెపితే 'దొంగ నీతులు' అందామనుకున్నాను. వారు అధికారం ప్రదర్శించితే 'దుర్భరం' అనుకున్నాను. ఆఖరున వారు సపరివార సమేతంగా తమ క్రూరత్వాన్ని చూపారు.

''యెదవేసాలేస్తే...యిక్కణ్ణుంచెల్లవ్''

నాకు 74 కేజీల బరువుగల శరీరం ఉంది. రక్త మాంసాలతో నిండిన యిరవై అయిదేళ్ళ యవ్వనం నిగ నిగ లాడుతోంది. నలభై రెండంగుళాల ఛాతీ ఉంది. నేను బాలచంద్రుడి గూర్చి, అభిమన్యుడి గూర్చి పిల్లలకు చదువు చెపుతున్నాను. ప్రేయసి కోసం ప్రేమ కోసం త్యాగాలుచేసి మరణించిన అనేక మంది కథలు నాకు తెలుసు. లోకం గొడ్డు పోలేదనీ...అక్కడ అన్యాయాలను ఎదురు కోటానికి ఎల్లప్పుడూ జనం సిద్ధంగా ఉంటారనీ ... నేను ఎంతో మందితో వాదించాను. అయితే ఎల్లప్పుడూ భద్రతనూ, సుఖాన్నీ వాంఛించే నా సంస్కారం...కనీసం ఆలోచనలో గూడా గొడవను, హింసనూ భరించలేని నా వ్యక్తిత్వం...వారికి తిరస్కారపు ధోరణినైనా చూపలేదు. అనవసరపు గొడవల్లో చిక్కుకున్నట్టు; ఎవరి జీవితంలోనో అనవసర ప్రమేయం జరిగినట్లూ...ఫీలయానేమో !!

హైమ అంతా వింది నేను చెప్తుంటే, వింటూన్న ఆమె ముఖంలో ఏ మార్పూ లేదు. దేవీ విగ్రహం ముందు భక్తుడు శ్లోకాలు చదివినా; తిట్లు సాగించినా ఒకటే! ఆమె స్వరూపం యిప్పటికీ గుర్తే! పంచలమయిన నా ప్రవర్తనలా ముంగురులు ఆమె నుదుటిమీద గాలికి కదులుతున్నాయి.

హైమ అంది ''మధ్యలో నువ్వు చిక్కుకొన్నావు.''

''అవును !'' ఆ సమాధానం ఈ నోటినుంచే వచ్చింది.

''అనవసరంగా యిలా జరిగింది కదూ !''

''దొంగ లం ... కొడుకు'' లిట్టాను. ఎవరు ?' అని ప్రశ్నించుకోలేదు.

''చూడు చూడు !''

''ఏమిటి ?''

''ఆ రాయి! అంత నీరు తోస్తున్నా ఎలా వుందో! ఆ యిసక గుట్టచూడు! నీటిలో ఎలా కరిగిపోతోందో...బలే! బావుంది కదూ !''

ఏమిటింత పిచ్చిగా మాట్లాడుతుంది ? ఎందుకు నాకులా భయపడటం లేదు ? ఈ రకమయిన అనుభవాలు ఈమెకు సామాన్యమయినవా ? యిలాంటి అడవిలో యింతమంది కళ్ళమధ్య యిలాంటి ఏకాంత స్థలాల్లో ఎలా ఉండగలుగుతోంది ? ఈమె నిజంగా పవిత్రమయినదేనా ? ఈమె నన్ను ప్రేమిస్తోందా ? నా కోసం ఏడవదేం ? ఎలా వూరుకోబెట్టాలా అని నేనెంత రిహార్సల్ చేసుకున్నాను !!

ఆలోచనలు మరలించుకున్నాను కష్టం మీద. నేను మగ వాణ్ణి. నా ధర్మం నిర్వర్తించాలి. మంచివాణ్ణి మంచితనం ప్రదర్శించాలి. అందుకు సిద్ధపడుతూ అన్నాను...

''నాతో వచ్చేస్తావా! ఎక్కడికయినా పోదాం !''

అన్నానేగాని భయం ! వస్తుందేమోననే సంకోచం! మగ వాడు ఎప్పుడూ భయపడిపోతూనే ఉంటాడు. ఆడదానివల్ల తనకేదో అన్యాయం జరిగిపోతుందని. అన్యాయమైపోయే ఆడది మాత్రం — నిస్సంకోచంగా, నిర్భయంగా — ఎన్నిసార్లు దగాపడ్డా - మగవాణ్ణి నమ్ముతూనే ఉంటుంది

ఆమెవి పెద్ద పెద్ద కళ్ళు! ఆకాశాలు! సముద్రాలు !

''వద్దులే! సర్లేగాని...నే నాయన దగ్గరకు వెళ్ళకపోతే... నీకు అపాయం...''

''చచ్చ! అంత త్యాగం ఎద్దు హైమా !''

''మరేం చెయ్యాలి ?''

''ఏమో ! నువ్వే చెప్పు! ఆలోచించు...''

''ఓపని చెయ్యి! రాత్రికిరాత్రి నువ్వీ వూరునుంచి వెళ్ళిపో!''

''నువ్వు...?'' భయం భయంగా అన్నాను.

''నువ్వు లేనప్పుడు నేను లేనూ ! నేనేమవుతాను?''

నేను వెళ్ళిపోతే మాత్రం ... అత నూరు కొంటాడా అన్న ప్రశ్న నాలోనే ఉండిపోయింది. అయినా నేనే వేవో మాట్లాడాను. ఆమె నేను వెళ్ళిపోటానికే ప్రోత్సాహపరిచింది. ఆ రాత్రికి రాత్రే నన్ను ప్రయాణం చేయించింది.

''మంచివాళ్ళకే వస్తాయి కష్టాలన్నీ !'' అన్నాను.

హైమ నవ్వింది.

''నువ్వు...నువ్వు కూడా రాకూడదా !''

''ఎందుకులే! నాన్న ఒక్కడూ అయిపోతాడు.''

ఆ రాత్రి చలిలో... ఆ కొండల మధ్యనుంచి ... నా సామాన్లను మోస్తూ...నాకు దారి చూపిస్తూ ... స్టేషనుకు చేర్చింది. భద్రంగా బండి ఎక్కించింది. ట్రైను కదిలిపోతున్నప్పుడు ... అంతవరకూ ఆమె ఆపుకున్న దుఃఖం కట్టలు తెంచుకున్నట్టుంది. ప్లాట్‌ఫారం కొసవరకూ పరుగెత్తుకు వచ్చి...అక్కడ ఆ స్తంభం దగ్గర ఆ బోర్డు కింద కూలబడి చేతుల్లో ముఖాన్ని దాచుకుని... ఏడిచిందేమో !

ఆ దృశ్యం చూస్తూనే...ట్రైనులోంచి బయటకు ఉరకాలనే కోరిక ఒక్క సెకను నా నరాల్లో కదిలింది.

చెడ్డవాడి ధైర్యం కన్నా; మంచివాడనబడేవాడి పిరికితనం ఎంత ప్రమాదకరమయినదో!!

'సౌందర్యోపాసన' గూర్చి మాధవ రాసిన ఉత్తరం — నా ఎదురుగా ఉంది.



తంలో అభిప్రాయ వ్యక్తీకరణ జరిగింది. అందువల్ల ప్రాచీన భారత దేశంలో సంపద అనే భావనను నైతిక, మత సంబంధ సూత్రాలు ప్రభావితం చేసినట్లు అనుకోవలసి వస్తోంది.

## కౌటిల్యుని అభిప్రాయాలు

కౌటిల్యుని సంపద భావన చాలా విశాలమైనది. ఇందులో ద్రవ్యము, వస్తువు, పొందిన భాగ్యము (Acquired Wealth) ప్రభుత్వ ప్రయివేటు ఆస్తులు, బంగారము, వెండివంటి అమూల్యమైన ఖనిజములు, నిలువ చేయబడిన సంపద, వినియోగమునకు పనికివచ్చు సంపద, ఇతరులకు స్థానాంతరీకరణ చేయడానికి వీలున్న సంపద, వినిమయం చేయడానికి వీలున్న సంపద మొదలైనవి చేర్చబడినవి. సంపదగా పరిగణించబడటానికి నాలుగు లక్షణాలుండాలి : (1) యదార్థంగా ఉండాలి (2) వినియోగానికి తగినదై వుండాలి. 3 స్థానాంతరీకరణకు వీలుండాలి. 4. ఎవరి కివ్వబడుతుందో వారు దానిని తమదిగా చేసుకోవడానికిశక్తి కల్గి ఉండేందుకు అనువుగా ఆ సంపద ఉండాలి. శ్రమ, అడవిలో ఉత్పత్తి అయిన వస్తువులు కూడా సంపదలో చేర్చబడినవి. సంపదను పొందడానికి అనేక ఆశయాలను, పద్ధతులను కౌటిల్యుడు వివరించాడు. కౌటిల్యుని కనుసారంగా ''సంపదను అణువు తర్వాత అణువుగా పొందాలి. విద్యను నెమ్మదిగా ఒక విషయం తర్వాత మరొక విషయాన్ని నేర్చుకోవడం ద్వారా పొందినట్లు సంపదను కూడా పొందాలి. ధనాన్ని, విద్యను పొందాలని ఆతురతలో ఉన్నవాళ్లు అందులోని చిన్నవాటిని అలక్ష్యం చెయ్యరాదు. చిన్న వస్తువునుగాని, తక్కువకాల వ్యవధిని గాని చిన్నదని నిర్లక్ష్యం చెయ్యరాదు. మంచి భార్యను, మంచి పుత్రుని, మంచి మిత్రుని పోషించడానికి, దాన ధర్మాలు చెయ్యడానికి సంపదపొందుట మంచిపని, లాభదాయకము.'' మంచి మార్గాలద్వారా పొందిన సంపద సమంజసమైనది. సంపద సముపార్జన జీవితంలో పరమాశయంకాదు; అదొక్కటే జీవితం ఆశయంకాదు. పురుషార్థాల సాధనకు సంపద సముపార్జింపబడుతుంది. కౌటిల్యునికాలంలో తరచుగా క్షామములు వస్తూఉండటం వల్ల ప్రజలను క్షామముల నుండి రక్షించడానికి దేశం సంపదను ప్రోగుచేసి ఉంచడం మంచిదని కౌటిల్యుడు అభిప్రాయం వెలిబుచ్చాడు.

## వర్త :

ప్రాచీన ఆలోచకులు జాతీయ ఆర్థిక వ్యవస్థాశాస్త్రం అనే మాటకు ''వర్త'' అనే పదాన్ని వాడారు. వ్యవసాయాన్ని, పశు సంవర్ధనను, వ్యాపారాన్ని కౌటిల్యుడు ''వర్త'' లో భాగాలుగా చూపించాడు. వర్తను నాశనం చేసినట్లయితే ప్రపంచము జీవ రహిత మౌతుందని చెప్పడంద్వారా కమండకుడు వర్త (జాతీయ ఆర్థిక వ్యవస్థ) ప్రాముఖ్యాన్ని స్పష్టంగా చాటాడు. మహా భారతాని కనుసారంగా వర్త ప్రపంచమునకు మూలకందము. రాజ్యాంగ మంత్రంచే నియుక్తులైన ప్రవీణులు వర్తకు సంబంధించిన విజ్ఞానాన్ని రాజుకు అందించుతాడు. కౌటిల్యుడు వర్త అనే పదానికి బదులుగా అర్థశాస్త్ర మనేపదాన్ని ఉపయోగించాడు. అర్థశాస్త్రము, ఆర్థిక శాస్త్రము, రాజనీతి శాస్త్రము, నైతిక శాస్త్రము, న్యాయ శాస్త్రము, (Juris Prudence) యుద్ధ శాస్త్రముల సమ్మిళితము, 'మానవాతీతమైన శక్తి ఇచ్చిన జ్ఞానాన్ని, న్యాయశాస్త్రాన్ని అనుసరిస్తూ, తగిన జీవన మాధ్యమాల కనుసారంగా రాజులుచేసే కృత్యాలను, నిర్వహించే పరిపాలనను వివరించే శాస్త్రము ''అర్థ శాస్త్రము'' అని శుక్రుడు చెప్పాడు.

## వ్యవసాయము, పశు సంవర్ధన

వ్యవసాయ పశు సంవర్ధనలు వర్తలోని ప్రముఖాంగములు. నూతన సంపద కివి మూలములు. ప్రజల వృత్తులలో వ్యవసాయము గర్వించదగ్గ ఆర్థిక కార్యము. వేదకాలంలో వైశ్యులు, శూద్రులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించేవారు. జన్మతః ఎవడూ కూడ బ్రాహ్మణుడుగాని, క్షత్రియుడుగాని, వైశ్యుడుగాని, శూద్రుడు గాని కాడని శుక్రుడు ఘంటాపథంగా చెప్పాడు. వ్యక్తులుచేసే వృత్తుల ననుసరించి ఒకరికి మరొకరికి మధ్యగల వ్యత్యాసం తెలుసుకోవచ్చు. ఇందుకుగాను అర్థశాస్త్రంలో అనేక ఉదాహరణలు ఇవ్వబడినవి ప్రాచీన భారతదేశంలో వ్యవసాయ పద్ధతులు అతి ఆధునికంగా ఉండేవని శుక్రనీతిని స్మృతులను చదివితే తెలుస్తోంది. ఈ గ్రంథాల్లో పంటలు, సాంద్ర వ్యవసాయము, విస్తృత వ్యవసాయము, చిన్న కమతాలు, పెద్ద వ్యవసాయ క్షేత్రాలు, రసాయనిక ఎరువుల ఉపయోగము, పంటలకు తగిలే తెగుళ్ళు, వాటి నివారణ నిర్మూలనలు, నీటిపారుదల పద్ధతులు, పశు సంవర్ధన క్షేత్రాలు, మేలురకపు విత్తనాల వాడకము, భూమిని చిన్న చిన్న ఖండాలుగా చేయడంవల్ల వచ్చే నష్టాలు మొదలైన వాటిని గూర్చి చెప్పబడింది. భూమిపై విధించే శిస్తు రాజ్యాంగ యంత్రానికి లభించే ఆదాయంలో చాలా ప్రముఖమైనదిగా ఉంటుందని ప్రాచీన ఋషులు చెప్పారు. బంజరు భూముల్ని సేద్యయోగ్య భూమిగా మార్చవలసిన బాధ్యత రాజ్యాంగ యంత్రంమీద, సమాజంమీద ఉన్నది ముఖ్యంగా సారవత్వాన్ననుసరించి భూమి విలువలు మదింపు చేయబడేవి. వ్యాపారుల ఆర్థిక దోపిడి నుండి రైతుల్ని కాపాడేందుకు వారి వ్యవసాయోత్పత్తులకు న్యాయమైన ధరలను ప్రభుత్వం నిర్ణయించేది.

కౌటిల్యుని అర్థశాస్త్రంలో వ్యవసాయానికి మొదటి స్థానం ఇవ్వబడింది. ఈ వృత్తిలో లాభానికి, పశు సంవర్ధనకు, బంగారానికి, అడవుల నుండి వచ్చే ఫలసాయాలకు, చవుక శ్రమశక్తికి చోటున్నది ఇవన్నీ ఫిజియోక్రాట్ల అభిప్రాయాలను పోలి ఉన్నవి. వేదయుగం నాటి మునులు, ఋషులవలె కాకుండా, కౌటిల్యుడు, బ్రాహ్మణుడు నాగలిపట్టి దుక్కి దున్నకుండా వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరించవచ్చని అంగీకరించాడు.

## శ్రమలో హోదా

వేదముల ప్రకారం మానవుడు వందసంవత్సరాలు గట్టిగా పనిచేస్తూ క్రియాశీలుడుగా జీవించాలి. అందువల్ల ప్రాచీన

వచ్చు (1) దేశంలో ఉత్పత్తి చేయబడే వస్తువులమీద విధించే పన్నుల వల్ల వచ్చే ఆదాయము. (2) రాజధానిలో ఉత్పత్తి చేయ బడు వస్తువుల మీద విధించు పన్నుల నుండి వచ్చు ఆదాయము (3) ఎగుమతి, దిగుమతుల మీద విధించు పన్నుల నుండి వచ్చే ఆదాయము దిగుమతుల విషయంలో వస్తువుల మూల్యంలో అయి దవ వంతు పన్నుగా విధించవచ్చు — చాలా తక్కువగా దొరికే వస్తువులకు, అమూల్యమైన వస్తువులకు ఈ సూత్రము వర్తించదు. మణులు మొదలైనవాటి వంటి ఇతర వస్తువుల విషయంలో రేటు మారుతూ ఉంటుంది. రాజ్యం శ్రేయస్సుకు అనుకూలంగాని విలాస వస్తువుల దిగుమతిని భారంగల పన్నులను విధించడం ద్వారా నిరుత్సాహ పర్చాలి.

కౌటిల్యుడు ఈ క్రింది కార్యాలమీద ప్రభుత్వం ఖర్చు చేయ వచ్చునని చెప్పాడు : (1) దేశ రక్షణ (2) ప్రభుత్వ పరిపాలన (3) మంత్రులు జీతాలు, వివిధ ప్రభుత్వ శాఖల నిర్వహణ (4) ప్రభుత్వం తనవస్తువులను నిల్వచేసే గోదాముల నిర్మాణము (5) ఈ గోదాములను, ధాన్యాగారాలను రక్షించి నిర్వహించడను (6) సైన్యాలను నెలకొల్పి పోషించుట (7) అమూల్యమైన మణులు రత్నాలు, నగలు సేకరించుట. ఈ ఖర్చులకు పోగా మిగిలిన ప్రభుత్వ ఆదాయాన్ని యుద్ధనిధికి, ప్రభుత్వ ఖజానాకు జమ చెయ్యాలి.

ప్రభుత్వ ఆదాయానికి ప్రధాన మూలమైన భూ రాబడి వ్యవస్థ (Land Revenue system) వివరాలు కౌటిల్యుని అర్థ శాస్త్రంలో ఇవ్వబడినవి. ప్రయివేటు భూమిపై వేసేపన్ను భూమి నుండి వచ్చేమొత్తం ఆదాయంలో 1/3 వంతునుండి 1/12 వరకు ఉండేది. ప్రయివేటు భూములమీద, వసూలు చేసిన భూమి శిస్తుమీద వివరాలతో కూడిన లెక్కలు ఉంచబడేవి. ఇంటిపన్ను, రోడ్డు టోల్లు, బజారుపన్ను, పండ్లు, చెట్లమీద పన్ను, వస్తువుల మీద పన్నులు కూడ వసూలు చేయబడుతుండేవి. పన్నులద్వారావచ్చే ఆదాయానికంటె, ప్రభుత్వం పరిశ్రమల నిర్వహణద్వారా సంపాదించే ఆదాయం హెచ్చువాంఛనీయమని కౌటిల్యుడు స్పష్టంగా చెప్పాడు. ప్రభుత్వ పరిశ్రమలను నిర్వహించడంవల్ల ప్రభుత్వానికి ఆదాయం చేకూరడమేగాక, ప్రజలకు ఉద్యోగాలు లభిస్తాయని ఆయన గట్టిగా చెప్పాడు. ఇందువల్ల కౌటిల్యుని అభిప్రాయాలు కొంతవరకు కీన్సు అభిప్రాయాలకు దగ్గరగా ఉన్నట్లు గోచరిస్తోంది. బడ్జెట్‌లను తయారుచేయడానికి, బడ్జెట్ అంచనాలను పర్యవేక్షించడానికి కూడా కౌటిల్యుడు నియమాలను తయారు చేశాడు. ఆ రోజుల్లో బాగా అభివృద్ధిచెందిన ఆడిట్ విధానం ఉన్నట్లు గోచరిస్తోంది.

## జ నా భా

ప్రాచీన ఆలోచకులకు పెద్ద పరిమాణంలో ఉన్న జనాభా ఆందోళన కల్గించే విషయంగాలేదు. పైపెచ్చు పెద్ద జనాభా దేశానికి బలం సమకూరుస్తుందని భావించబడింది. నూతన దంపతులకు ఎదిమంది కుమారులు కల్గడం న్యాయసమ్మతంగా వేద సార స్వతం చెబుతోంది. చిన్న రాజ్యాలమధ్య తరచుగా జరిగే యుద్ధాల వల్ల, వైద్యసౌకర్యాలు తక్కువైనందున మృత్యురేటు హెచ్చుగా ఉండటంవల్ల జనాభా కొన్ని హద్దులనుమించి పెరగలేదని భావించ బడింది. ప్రభుత్వం వలస రాజ్యాల నేర్పర్చి, తన ప్రజలు ప్రవాసం వెళ్లే సౌకర్యం కల్పించాలని కౌటిల్యుడు చెప్పాడు.

## బానిసత్వము

ప్రాచీన భారతదేశంలో బానిస కుటుంబ సభ్యుడుగా చూడ బడేవాడు. నీచమైనసేవ చేయవలసిన అవసరం ఉండేదికాదు. వంశ పారంపర్యంగా ఇంటినౌకరుగా వస్తూఉండేవాడు. అయితే అతనికి ప్రయివేటు ఆస్తి సంపద ఏర్పాటు చేసుకునె హక్కుఉండేది కాదు. వేతనంమీద పనిచేసే శ్రామికునికంటే అతని స్థితి బాగుం డేది. చేతిపనులు, వ్రాయడము నేర్చుకోవడానికి యజమానులు తమ నౌకర్లను అనుమతిస్తున్నట్లు "జాతకాల"లో వ్రాయబడిఉన్నది. నౌకర్లను నీచంగా చూచి బాధపెట్టిన ఉదాహరణలేమీ కన్పించడం లేదు ప్రాచీన భారతదేశపు బానిస విధానం జాతి వైషమ్యాన్ని ఏర్పరచలేదు. అమెరికాలోవలె ఒక జాతిని మరొకజాతికి దాసులుగా చెయ్యలేదు.

## శ్రేయో రాజ్యము :

శ్రేయో రాజ్యాన్ని గురించి ప్రాచీన భారతీయ ఆలోచకులకు స్పష్టమైనభావన ఉండేది. నైతిక సూత్రాలు రాజ్యాంగయంత్రం నిర్వహించవలసిన విధ్యుక్త ధర్మాలకు మార్గం చూపుతుండేవి. ఆకలి బాధనుండి ప్రతి పౌరునకు రక్షణ ఉండేది. సంపదను ఆహారాన్ని సమంగా పంచడము ప్రభుత్వపాలన ఆశయంగా ఉండేది వర్గ వైరుధ్యం ఉన్నట్లుగా జాడలేమి గోచరించడం లేదు. వేతన నిర్ణయానికి సమానత్వము, న్యాయము ప్రాతిపదికలుగా ఉండేవి శ్రామికుల్ని యజమానులుగాని, రైతుల్ని భూస్వాములుగాని పెట్టు బడిదారుల్నిగాని ఆర్థిక దోపిడి చేయడం జరుగుతుండేది కాదు మనువు కౌటిల్యుడు కూడా పెద్ద వడ్డీ రేట్లకు వ్యతిరేకులుగా ఉండేవారు. వడ్డీ రేటును నియంత్రణ చెయ్యాలని మనువు ధర్మ శాస్త్రంలో చెప్పాడు చక్రవడ్డీని కూడా మనువు నిషేధించాడు. ఉద్యమదారుడు (Entrepreneur) నిర్వహించే విధ్యుక్త ధర్మాలకు ప్రతిఫలంగా మాత్రమే లాభము ముడుతుందని కౌటిల్యుడు స్పష్టంగా చెప్పాడు సంపదను సమంగా పంపిణీ చేయబడాలని వేదాలు చెబుతున్నవి. అయితే మేధాశక్తి, శీలము, అభిరుచిలో ప్రజలమధ్య ఉన్న వ్యత్యాసాలకు పంపిణీమీద తగిన ప్రభావం ఉండ వచ్చన్నారు. ప్రజలు సంక్షేమాన్ని పెంపొందించడమే ప్రభుత్వం నిర్వహించే ముఖ్య కర్తవ్యము. వ్యాపార, వ్యవసాయ, నీటిపారుదల కార్యక్రమాలను గనుల త్రవ్వకాన్ని కూడా ప్రభుత్వం అభివృద్ధి చెయ్యాలి. ఇందుకుగాను ఆర్థిక సబ్సిడీలు ఇవ్వాలి. పంచాయితీలు, గిల్డు కోర్టులు న్యాయ నిర్వహణ చెయ్యాలి. రాజకీయ, ఆర్థిక పరి

పాలన పూర్తిగా ప్రజాస్వామికంగా ఉండేది. పంచాయితీలు, మ్యునిసిపాలిటీలు ప్రజాస్వామ్యానికి ప్రాతిపదిక యూనిట్లుగా ఉండేవి. ధనానికి సంబంధించిన లావాదేవీలు, తూకాలు, కొలతలు, రప్పని సరిగా కావలసిన పరిశ్రమలు, కరెన్సీ, వినిమయము, కల్తీ చేయుట, వడ్డీ మొదలైన వాటికి సంబంధించి ప్రభుత్వం నియమాల నేర్పర్చిన దాఖలాలు స్పష్టంగా గోచరిస్తున్నవి. "రాజ్యము వృక్షము. రాజువేరు సలహాదారులు అనగా మంత్రులు కొమ్మలు. సైన్యాధికారులు చిన్న కొమ్మలు. సైన్యాలు మొగ్గలు, పువ్వులు. ప్రజలు పండ్లు. భూమి విత్తనము" అని శుక్రాచార్యుడు చెప్పినట్లు ప్రొఫెసర్ కె. టి. షా వ్రాసారు. క్లుప్తంగా చెప్పాలంటే ప్రజల ఆర్థిక ఉన్నతికి రాజు బాధ్యుడుగా ఉండేవాడు. ఇందువల్ల ప్రాచీన భారతీయ రాజ్యాంగ యంత్ర భావన సంక్షేమ రాజ్య భావనగా ఉన్నట్లు గట్టిగా అనుకోవలసి వస్తోంది.

కౌటిల్యుని రాజ్యాంగ యంత్ర భావన పారిశ్రామిక జ్ఞానం మీద ఆధారితం చేయబడింది రాజ్యాంగ యంత్రానికి మార్గం చూపే మూడు సూత్రాలను కౌటిల్యుడీ విధంగా చెప్పాడు : (1) దేశాన్ని ప్రత్యక్షంగా స్వయం సంపూర్ణము. స్వయం నిర్భరము చేయగల పరిశ్రమలను ప్రభుత్వం నిర్వహించాలి. ఉ: బంగారము, వెండి, రత్నాలు, ఇనుము, ఇతర ఖనిజాలకు సంబంధించిన పరిశ్రమలు ప్రభుత్వ ఆధీనంలో ఉండాలి (2) వ్యవసాయము, వడుకుట, నేయుట, పశు సంవర్ధన, కళలు, చేతి పనులు మొదలైన వాటిని వ్యక్తులు నిర్వహించడానికి వదలి, వారికి స్వామ్యపు హక్కు ఇవ్వాలి (3) తాను నిర్ణయించిన సూత్రాల కనుసారంగా ఉత్పత్తి, వినియోగ, పంపిణీ కార్యక్రమాలు సమర్థవంతంగా నిర్వహించ బడేటట్లు చేయడము ప్రభుత్వ కర్తవ్యము. ఇందువల్ల వ్యక్తిమీద ప్రభుత్వాధికారానిది పైచేయిగా కన్పిస్తోంది. అయితే ప్రజల సంక్షేమాన్ని పెంపొందించడమే ఈ దృక్పథంలోని ప్రధాన ఆశయంగా కన్పిస్తోంది. రాజ్యాంగ యంత్రం నిర్వహించే విద్యుక్త ధర్మాల నిర్వహణ సమర్థవంతంగా జరగాలని, ప్రజల దైనందిక జీవిత కార్యకలాపాల నిర్వహణను పర్యవేక్షించి, క్రమబద్ధం చేయడంలో రాజ్యాంగ యంత్రానికి బాధ్యత ఉండాలని ప్రాచీన భారతీయ ఋషులు తలపోసారు. పై సదాశయాల సాధన సంభవ మివ్వడానికి అందరూ తోడ్పడేందుకు వీలుగా స్త్రీలు, పురుషులు, సన్యాసులు, ఋషులు, రాజులు, సామంతులు మొదలైనవారు చేయవలసిన విద్యుక్త ధర్మాలు నిర్వచింపబడుతూ ఉండేవి. ఆర్థిక పరిస్థితులు రాజ్యాన్ని పరిపాలిస్తాయి అనే ప్రథమ పాఠం రాజు నేర్చుకుంటూ ఉండేవాడు.

## సాంఘిక భద్రత

కౌటిల్యుని కాలంలో సాంఘిక భద్రతా వ్యవస్థ ఈనాడున్నంత విశాలంగా లేదు. సాంఘిక సంక్షేమాన్నిగురించి కౌటిల్యుడు తన అభిప్రాయాలను వెల్లడించాడు. దానధర్మాలు చేసే సంస్థలను ఏర్పాటు చేయడము, బీదలను పోషించడానికి ప్రత్యేక బీదల గృహాలను ఏర్పాటు చేయడము, నిరుద్యోగులకు ఉద్యోగ వసతి కల్పించడము, బలహీనుల్ని, ముదుసలులను సంరక్షించడము, రాజ్యాంగ యంత్రము ప్రధాన కర్తవ్యాలని కౌటిల్యుడు స్పష్టంగా చెప్పాడు. దీన్నిబట్టి సాంఘిక భద్రతా వ్యవస్థ ఏర్పాటు నిర్వహణల ప్రాముఖ్యత కౌటిల్యునకు బాగా తెలుసునని విదితమౌతోంది.

## వడ్డీ

వడ్డీ తీసుకోవడాన్ని ప్రాచీన ఆలోచకులు అంగీకరించినప్పటికి పెద్ద రేట్లను విధించడానికి వారు సమ్మతించలేదు. మూలధనానికి ఉత్పాకతాశక్తి ఉన్నందున వడ్డీ తీసుకోవచ్చని వారు సమర్థించారు, ఆస్తిని తాకట్టు పెట్టుకుని అప్పులిచ్చినపుడు వడ్డీ తీసుకోవడానికి వారంగీకరించలేదు. వర్ణాన్నిబట్టి, అప్పుతీసుకున్న పనినిబట్టి, పెట్టుబడి చేసినప్పుడు వచ్చే లాభాన్నిబట్టి, ఋణస్థుల ఆర్థిక పరిస్థితుల్నిబట్టి వడ్డీరేటు మారుతూ వుండేది. కౌటిల్యుడు వడ్డీ రేటుని క్రమబద్ధంచేసి నియంత్రణలో ఉంచాడు. సాధారణంగా వడ్డీరేటును పదిహేనుశాతంగా నిర్ణయించాడు. వ్యాపారస్థులకు, సముద్ర వ్యాపారులకు ఇంకా పెద్దరేటులో వడ్డీని నిర్ణయించాడు.

## ధర నియంత్రణ

చంద్రగుప్తమౌర్యుని కాలంలో ధరల నియంత్రణ రాజ్యాంగ యంత్రం ముఖ్యవిధులలో ఒకటిగా ఉండేది. అతి తెలివితోను, అవినీతితోను ప్రవర్తించి వినియోగదారుల్ని దోపిడిచేసే వర్తకుల నుండి కాపాడడము ధరల నియంత్రణ ప్రధానోద్దేశ్యము. రాజ్యాంగ యంత్రం నియుక్తిచేసిన వ్యాపారులు మాత్రమే ఆహార ధాన్యాలతోను, ఇతర అత్యవసర వస్తువులతోను వ్యాపారం చేయడానికి వీలుండేది. గృహోపయోగ వస్తువులమీద ఎనిమిదిశాతం లాభాన్ని, దిగుమతి చేసుకున్న వస్తువులమీద పదిశాతం లాభాన్ని మాత్రమే తీసుకోవడానికి వ్యాపారులకు అనుమతి ఇవ్వబడింది. ఈ నియమాలను ఉల్లంఘించిన వారిని కఠినంగా శిక్షించడానికి నిబంధనలు ఏర్పాటు చేయబడినవి.

## సాంఘిక - ఆర్థిక సంస్థలు

ప్రాచీన భారతదేశంలో సాంఘిక – ఆర్థిక వ్యవస్థ చట్ర నిర్మాణం మత ప్రాతిపదికమీద నిర్మాణమైనట్లు ఇంతకుముందే చెప్పుకున్నాము. జీవితంలోని ప్రతి అంశాన్ని, కుటుంబ విషయాలను, సాంఘిక సంబంధాలను, ఆర్థిక కార్యక్రమాలను, ఆధ్యాత్మిక జీవితాన్ని మతసూత్రాలే నడుపుతూ ఉండేవి. సాంఘిక, ఆర్థిక సంబంధాల అధ్యయనం హిందూమత అధ్యయనమౌతుందని చెప్పవచ్చు. ఇందులో రాజ్యాంగయంత్రాన్ని, వర్ణాశ్రమ ధర్మాన్ని విశ్లేషణ చేయవలసి ఉంటుంది. ఈ సూత్రాల ప్రకారము భూమి అనే ఆస్తి సర్వ ప్రజలకు చెందుతుంది.'

## పట్టణ ప్రణాళికా రచన

ప్రాచీన భారతదేశంలో పట్టణ ప్రణాళికా రచన చాలా ముందంజవేసింది. ముఖ్యంగా మౌర్యచక్రవర్తుల కాలంలో ఈ అభివృద్ధి పురోగమించింది. ఆర్థిక అవసరాలను తీర్చడానికి, దేశ రక్షణలు సమర్ధవంతంగా నిర్వహించడానికి గ్రామాలు సముదాయాలుగా కలుపబడినవి. ప్రధాన వీధులను పునర్నిర్మించడానికి, నగర వైశాల్యాన్ని ఉపవిభజన చేయడానికి, ప్రధాన వీధులను విశాలం చెయ్యడానికి పట్టణ ప్రణాళికలు ఉద్దేశించబడుతూ ఉండేవి. జాగ్రత్తగా ప్రణాళికా రచనచేసిమాత్రమే రాజధానిని నిర్మించేవారు. అగ్ని ప్రమాదాలు రాకుండా చేయడానికి, ఆరోగ్య రక్షణ కవసరమైన పనులు చేయడానికి, విపులంగా నిబంధనల నేర్పాటు చేసేవారు.

## ప్రాచీన ఆర్థిక ఆలోచన ముఖ్యలక్షణాలు

ప్రాచీన ఆలోచకులు ఆర్థిక ఆలోచనను ప్రత్యేక విషయంగా పరిగణించినట్లు కన్పించడంలేదని కొందరు ఆధునిక ఆలోచకులు అంటున్నారు. ఆర్థిక విషయాల అధ్యయనం, మత, నైతిక, దార్శనిక, న్యాయశాస్త్ర, రాజనీతి, ప్రభుత్వ పాలనల అధ్యయనంతో కలిపివేయబడింది. (యూరోపులో కూడా ప్రాచీన కాలంలో ఇలాగే జరిగింది. వియన్నా విశ్వవిద్యాలయంలోకూడా నిన్న మొన్నటివరకు ఆర్థిక శాస్త్ర అధ్యయనం రారీకజ్యూరిస్ ప్రూడెన్స్ అధ్యయనంలో భాగంగా ఉండేది.) దార్శనిక (తాత్విక (Philosophical) ఆర్థిక రాజనీతి, నైతికశాస్త్రాలను కలిపి అధ్యయనం చేయడం వ్యక్తిముక్తికి లవసరమని కౌటిల్యుడు విస్పష్టం చేసాడు. అయితే ఆర్థిక ప్రబోధాలు పారిశుభ్రతతోను, నైతిక ధర్మాలతోను కూడి ఉండేవి.

ప్రాచీన భారతీయ ఆర్థిక ఆలోచనకు సంక్షేమ రాజ్య నిర్మాణం కేంద్రాభిప్రాయంగా ఉన్నది. ప్రజల ఆర్థిక అభ్యున్నతికి రాజ్యాంగ యంత్రానిది ప్రధాన బాధ్యతగా చెప్పబడింది. శాంతి, క్రమశిక్షణలతోపాటు, ఆర్థిక జీవితాన్ని క్రమబద్ధం చేయడము, తద్వారా ప్రజలకు గరిష్ట శ్రేయస్సును చేకూర్చడము రాజు ప్రధాన విధిగా ఉండేది. ఇందుకుగాను రాజ్యాంగ యంత్రము తూకాలను, కొలతలను, క్రమబద్ధం చేయడానికి కల్తీ చేయడాన్ని నివారించడానికి, రోడ్లు, చెరువులు నిర్మించడానికి ద్రవ్య కార్యకలాపాలను నిర్వహించడానికి, హెచ్చు వడ్డీలను నివారించడానికి, వ్యాపార, వినిమయ, వేతన నిర్ణాయక, పారిశ్రామిక రక్షణ కార్యకలాపాలను క్రమబద్ధం చేయడానికి రాజ్యాంగయంత్రం నియమాలను తయారుచేసి అమలుజరపడం రాజ్యాంగయంత్రం ముఖ్య విధిగాచెప్పబడింది. ఇవన్నీ సంక్షేమ రాజ్యం ప్రాతిపదిక లక్షణాలే.

ప్రాచీన భారతదేశ ఆర్థిక జీవితాన్ని, ఆర్థిక ఆలోచనను, నైతిక శక్తులు, మత ఆశయాలు నడిపినవి. ఆ సమయంలో పారిశ్రామిక కార్యకలాపాలు పరిమితంగా ఉండేవి. ఆర్థిక జీవితం సాధారణంగా (Simple) ఉండేది. ప్రజల దృక్పథం భౌతికేతరంగా ఉండేది. వర్ణాశ్రమ విధానం సాంఘిక సమతౌల్యాన్ని కాపాడుతూ ఉండేది. ఈ వర్ణాశ్రమ విధానంలో కష్టపడి పని చేయడము, పొదుపుగా ఉండటము, పరిస్థితుల కనుగుణ్యంగా సర్దుబాటు కావడము సులక్షణాలుగా ఎంచబడేవి. ఈ విధానంలో ఒకదాని మీద మరొకదానికి అదుపుచేసే శక్తి, సమతౌల్య ఏర్పాటుకు కావలసిన శక్తులు ఉండేవి.

## మాధ్యమిక భారతదేశంలో ఆర్థిక ఆలోచన

ఆర్థిక ఆలోచనను అభివృద్ధి చేయగల కార్యమేదీ పదోవ శతాబ్దానికి బ్రిటిషు పాలన ప్రారంభ కాలానికి మధ్య జరగలేదు ఈ కాలవ్యవధిలో జరిగిన కొద్ది విషయము, చెప్పబడిన స్వల్ప విషయము ప్రాధాన్యతగలవి కావు. కబీరు, తులసీదాసు, సూరదాసు, మీరా, జైసి, నానక్ మొదలైన యోగి కవిపుంగవుల రచనల్లో కొద్దిపాటి ఆర్థిక అభిప్రాయాలు కన్పిస్తవి. ఈ అభిప్రాయాల్లో ఆర్థిక లక్షణాలకంటె సాంఘిక లక్షణాలు ఎక్కువగా ఉన్నవి. కుల వ్యవస్థలోని దుర్లక్షణాలను, దైవమే తండ్రనే భావాన్ని, మానవులంతా సోదరులనే భావాన్ని, శ్రమలోని హోదాను, ధనవంతుల్ని, పుట్టుకవల్ల వచ్చే ప్రత్యేక సౌకర్యాలను రద్దు చేయాలని వారి కవిత్వాలు గట్టిగా నొక్కిపెట్టి చెప్పినవి అయితే ముస్లిం ఏలిపాలనా కాలంలో అబుల్ ఫజుల్ వ్రాసిన ఐన్-ఇ అక్బరీలో ఆర్థిక ప్రాముఖ్యతగల అభిప్రాయాలున్నవి. అక్బర్ ఏలిపాలనాకాలంలో అబుల్ ఫజుల్ గొప్ప మేధావిగా ఎంచబడినాడు. ఇతన్ని ముస్లిం చాణక్యుడని చెప్పేవారు. అక్బర్ రివెన్యూమంత్రి తోడర్‌మల్ ఏర్పాటుచేసిన రివెన్యూ వ్యవస్థ వివరాలను అబుల్ ఫజుల్ తన గ్రంథంలో తెలియజేసాడు. వ్యవసాయదారులను బాధలనుండి విముక్తిచేయడానికి తీసుకున్న చర్యలను, తక్కావి రుణాలను ఇవ్వడాన్ని, విత్తనాలను ఉచితంగా పంచడాన్ని, భూమిశిస్తు చెల్లించడానికి 'రెమిషను' ఇవ్వడాన్ని గురించి, అందుకు తీసుకున్న చర్యలను గురించి కూడా ఈ గ్రంథంలో చెప్పాడు. ప్రభుత్వ ఆర్థిక నిర్మాణ కార్యక్రమాలను, ధరలను, విపణిని క్రమబద్ధం చేయడాన్ని గురించి కూడా ఈ గ్రంథంలో తెలియజేసాడు.

పై చెప్పిన విషయాలనుబట్టి ప్రాచీన, మాధ్యమిక యుగాల్లో భారతీయ ఆలోచకులు సమస్యల పరిష్కారాన్ని గురించి తీవ్రంగా ఆలోచించినట్లు తెలుస్తోంది. ఆర్థిక జీవితానికి నికరత్వం ఏర్పర్చడానికి, కేవలం ఆర్థిక సిద్ధాంత సూత్రాల నేర్పర్చడానికేగాక ఆర్థిక చట్రాన్ని పోషించడానికి ఆ ఆలోచకులు ప్రయత్నించినట్లు విదితమౌతోంది. అయితే వారి విధానాలమీద సూత్రాలమీద కర్మ సిద్ధాంత ప్రభావం ఉన్నట్లు గోచరిస్తోందని కొందరంటున్నారు. బ్రిటిషు పాలన ఏర్పడడంతో, ముఖ్యంగా పందొమ్మిదవ శతాబ్దం రెండవ భాగంనుండి భారతప్రజలు పాశ్చాత్య ఆర్థిక ఆలోచనను అధ్యయనంచేస్తూ మన ఆర్థిక ఆలోచనను మరచిపోవడం శోచనీయము.

డా. కొలకలూరి ఇనాక్

# తాజి రాజసం

రాణి విడిచిపోయె రాజు నొంటరిజేసి
రాజు విడిచిపోయె రాజ్య రమను
రాజ్య రమయు విడిచె రాజును బెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు.

'ముంటాజ మహలు' లోనిదీ ఆటవెలది. ఈ సృష్టికర్త జాషువా.

'తాజమహలు' షాజహాను ముంతాజ బేగం ప్రణయస్మృతి చిహ్నం. ముంటాజ మహలు కావ్యం ఆ ప్రణయమూర్తుల జీవితానికీ, తాజమహలు కళారూపానికీ అక్షర నిక్షేపం.

తాజమహలు చరిత్ర బెక్కండ్రను ఘనీభవించిన కాలం కన్నీటిబొట్టు.

ముంటాజ మహలు ప్రేయసీ వియోగార్తుడు సందర్శించిన తేజః పుంజంగా ఆంధ్ర శారద నేత్ర కాంత్యంజలి.

ముంటాజ మహలు ఖండ కావ్యంలో చివరిదీ పద్యం. కావ్యకన్య వెలికివస్తూ చేసుకొన్న చివరి ముస్తాబు. కాబట్టి సాధ్యమైనంత కవితా సౌందర్యం సముజ్వలం అయి వుంటుంది.

* * *

రాణి పేరు ముంతాజ బేగం. ముంతాజ, ముంతాజీ, ముంటాజ, ముంటాజి ఆపేరులోని ప్రథమార్ధానికి రూపాంతరాలు. 'రాజును బెక్కండ్ర' 'రాజులం బెక్కండ్ర' ప్రత్యంతరాలలో రూపాంతరాలు రాజులం బెక్కండ్ర కవికి అభీష్టరూపం. ఆద్యరూపం ఆ కాలానికీ, అనంతర రూపం తదనంతర కాలాలకు ప్రవర్తింపచటం గుర్తింపవచ్చు శిల్పకళారూపం తాజమహలు. సాహిత్య కళారూపం ముంటాజ మహలు. అది పాలరాతి హేల. ఇది అక్షర లీల అది నేత్రానందకరం. ఇది హృదయానందకరం అదీ, ఇదీ రసానందం. రసరాజ్య పారవశ్యం.

* * *

ఈ పద్యంలో ఉన్న పదాలు రమారమిగా డజను. వీటిలో అర్థం తెలియని పదాలు లేవు పరమార్థం తెలిపేవి ఉన్నాయి. పరమార్థం కన్నున్న గుండెకు కనిపిస్తుంది. సహృదయుడి గుండె అపరిమితే పరమార్థ పరిమితి. గుండె కొద్దీ పరమార్థం. దానికి హద్దు అవధీ లేవు.

* * *

రాణి రాజు రాజ్యం గతించటం విభిన్న కాలాలకు సంబంధించిన చారిత్రక సంఘటనలు. తాజమహలు నేటికీ ఉన్న కళారూపం. భిన్న చారిత్రక ఘట్టాలు ఘటించటం కథన నైపుణ్యం.

రాణిని రాజు స్మరించాడు. రాజును రాజ్యం స్మరించింది. రాజ్యాన్ని పలువురు స్మరించారు. తాజమహలును భిన్న దేశాలు స్మరించాయి. మానవ స్మరణ నుంచి మహిత కళాసృష్టి అవతరించటం చెప్పిన తీరు కథా కథన కౌశలం.

ఈ పద్యం ఒక చరిత్రశక్తి అంతా నిక్షిప్తమయిన పిండీకృతరూపం.

* * *

భార్య స్మృత్యర్థం 'సుదర్శనమహలు' కట్టించుకొన్న రామిరెడ్డి అటువంటి స్మృతి చిహ్నంగాఉన్న తాజమహలు కథ కావ్యంగా జాషువాతో వ్రాయించాడు.

రామిరెడ్డి జాషువా గతించారు.

కాని తాజమహలులాగా, సుదర్శన మహలులాగా ముంతాజ మహలు కావ్యం నిలిచింది. భవిష్యత్తుకు మిగిలింది.

* * *

పద్యంలో రాజ్యరమ 'రెండుసార్లు' ప్రయుక్తమయింది. 'రాజు' మూడుసార్లు. 'విడిచిపోయె' అదే రూపంలో రెండుసార్లు, అదే అర్థంలో ఇంకోసారి, వ్యతిరేకార్థంలో మరోసారి ఉంది.

పునరుక్తి దోషం. పునః పునః పునః ఉక్తి ఏమవుతుంది ?

దోషం పాల పాత్రలో మజ్జిగ చుక్క

కావ్యంలో దోషాలు లేకుండా వుండటం వాంఛనీయం.

ప్రాణం వున్నకావ్యం మరింతగా కోరదగ్గది.

అందువల్ల, దోషంలేని కావ్యంకంటే దోషమున్నప్పటికీ ప్రాణమున్న కావ్యం కోరదగ్గది. చేరదగ్గది. ప్రాణం అంటే కావ్య ప్రయోజన సిద్ధి. రసానందం.

ఇవి గుణాలు, ఇవి దోషాలు అన్నదెవరు ? ఎప్పుడు ? అవి ఏ కవులకు కావ్యాలకు వర్తించేవి?

పద్యంలో 'రాణి' ఒక్కసారే కనిపించింది. ఆమె అల్పాయుష్కురాలు. పైగా పరదామరుగు మనిషి. ఒక్కసారి కనిపించటమే అబ్బురం.

'రాజ్యరమ' రెండుసార్లు దర్శన మిచ్చింది. షాజహాను పరిపాలనలో నిండు జీవితం, అనంతర రాజుల పాలనలో పండుజీవితం, వెన్నుమార్చుకొంది మొగలాయి రాజ్యరమ.

షాజహాను మూడుసార్లు ప్రత్యక్షమయ్యాడు. అతడిజీవితం ప్రణయమూర్తిగా, కళా నిర్మాతగా, బందీగా మూడు పాయలు అయింది. అందుకే మూడుసార్లు ముమ్మూర్తులా దర్శనమివ్వటం.

రాణి రాజు రాజులు రాజ్యం పోవటం చెప్పటానికే 'విడిచి పోయె' అన్నిసార్లు పలకటం. ఈ మాటతో చరిత్రచక్రం తిరగటం కనిపించింది. ఒక్క చిన్న పద్యంలో ఇంత చరిత్రను ప్రత్యక్షీకరించటానికి ఈ క్రియ అంతగా పునరుక్తమయింది.

కావ్యేతివృత్తం అంతాపునశ్చరణ చేస్తున్న పద్యంలో దానిని భిన్నదశలు చెప్పటంలో పునరుక్తి వచ్చింది. అవసరమయింది. అందగించింది.

పునఃఉక్తి, చేష్టసామాజికం. సామాజిక భాషలో సారస్వతం పరిపుష్టం కావించే ఆధునికులకు పునరుక్తి సమాజంలోలాగ— సారస్వతంలో — దోషం కాదు. గుణం.

భాషకున్న శక్తుల్లో పునరుక్తి బలమయింది. దోషం కాదు. గుణం.

ప్రతిభా సంపన్నమయిన పునరుక్తి రసరాజ్యానికి ఘంటాపథం.

ఇక్కడ పునరుక్తి విశాలకాల ప్రాంగణ పర్యాలో కన సమర్థంగా, శక్తిమంతంగా అవతరించింది.

* * *

రాణి విడిచిపోయె రాజునొంటరిజేసి,

ముంతాజబేగం షాజహానులలో ఆమె ముందుగా చనిపోయింది, అంతేకాని రాణి రాజును విడిచిపోలేదు. పోగలదా? పోలేను. పోతుందా? పోదు.

తన హృదయంలో ఉన్న బేగంను వదిలి ఉండలేడు. వెళ్ళనివ్వడు.

వెళ్ళదలుచుకొన్నా, వెళ్ళనిచ్చినా వెళ్ళటం ఎలా కుదురుతుంది? మృత్యువు ఆమెను తీసుకుపోతుంది. పోనీ ఆమె మరణిస్తుంది. కానీ పోతుందా?

రాజు ఒంటరివాడు ఎలా అవుతాడు. తోడు రాజ్యరమ ఉంది. మంత్రులు, సామంతులు, సైన్యం, జనం, భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇంతగా ఉన్నవాడు అంతగా లేనివాడు ఒంటరివాడు ఎలా అవుతాడు?

భార్యలేనివాడు అనదలచినా షాజహాను మహమ్మదీయ చక్రవర్తి అనీ, జనానా ఉన్నవాడు అని గుర్తుకువస్తే అతని ఒంటరితనం ఎలా సమర్థించటం?

జాషువా తెలుగు పలుకుబడి జవం జీవం శిరః చక్షువుంగా తెలిసిన కవి. ఆమె అందరినీ విడిచిపోయింది. అంటే చనిపోయింది అనే కదా అర్థం. ఇక్కడ కర్తకీ, క్రియకీ సంబంధం స్థాపించటం వ్యక్తికి ప్రాధాన్యం ఇవ్వటం. మృత్యువు మీద ప్రాణశక్తి నిలపటం. ఇది నుడికారంలోని బలం.

తెలుగులోనే కాదు. చాలా భాషల్లో మృత్యువును తెలిపే పదాలు కోమలాభివ్యక్తిని సంతరించుకొన్నాయి. స్వర్గస్థుడయ్యాడు. పరమపదించాడు. గతించాడు. పోయాడు, వంటివి మరణించాడు అనటానికే పర్యాయాలు.

మృత్యువును కాని, దాని నగ్నతను కాని, ధైర్యంగా ఎదుర్కోలేని మనుష్యుల్లాగానే భాషకు సున్నితత్వం వస్తుంది. పాలు తాగుతున్న పసివాడు ఇటునుంచి అటు ముఖం తిప్పుకొన్న విరామం (బాగూరు) వంటిదే మృత్యువు, అని గుర్తిస్తే దాని చుట్టూ ఖేదం లేదు. నిర్వేదం లేదు

'రాజునొంటరిజేసి' అన్నది దాంపత్య ధర్మం నిక్షిప్తమయిన అభివ్యక్తి. ఆమె వుండగా షాజహాను జంట అయినాడు. ఆమె లేక పోగా ఒంటరి అయినవాడు. సామ్రాజ్యం జనానా ఉన్నా ఒంటరితనం అనుభవించాడు. ఇది వాళ్ళ దాంపత్య బంధం, సంబంధం వివరించటం. ఆమె గతిస్తే అతడూ గతించినట్లే. అందుకే అతడికి ఏకాకితనం. ఆమె లేనినాడు అతడెవరికీలేడు. రాజ్యానికీ లేడు. జనానాకీలేడు. తనకి తనే లేడు. తనంతట తను తనకు తాను లేకుండా చేసుకోలేడు. ఆమె చేసింది. రాజునొంటరి చేసింది. ఈ అభివ్యక్తిలో వాళ్ళ దాంపత్య జీవన మాధుర్యం ధ్వనించింది.

* * *

రాజువిడిచి పోయె రాజ్యరమను

మహాసామ్రాజ్య పరిపాలకుడు షాజహాను. సామ్రాజ్యం లక్ష్మీరూపం. అందుకే అది రాజ్యరమ.

లక్ష్మిచంచల. ఉన్నచోట ఎంతో కాలం ఉండక పోవటం ఎక్కించిన అందలం మీద అలాగే నిలవకపోవటం దాని గుణాలు.

రాజ్యరమ ఎందరో రాజులుగా, ఎన్నో రాజ్యాలుగా, చరిత్ర గతిలో వెళ్ళిపోయింది. మార్పు దాని మనస్తత్వం.

లక్ష్మి ఉన్నచోట వెలుతురు. లేనిచోట చీకటి. అందుకే రాజుకు కనుచీకటి గదిచీకటి. చెరసాల.

రాజ్యరమ చేయిదాటి, గడపదాటి చేరదలచిన చోటు వెదుకుతుంటే వెంటబడటం పొరపాటు. ఆ పొరపాటుకు ప్రాయశ్చిత్తమే షాజహానుకు ఏడేళ్ళ బందిఖానా.

వంశపారంపర్యంగా హక్కుభుక్తంగా అనుభవించాలన్న చక్రవర్తుల ఆశను రాజ్యరమ తృణీకరించటమే యుద్ధాలూ, హింసలూ, జననష్టం, తండ్రిని తనయుడు బంధించటం, నిర్బంధించటం.

షాజహాను చక్రవర్తి జీవిత వాంఛ భౌతిక కాయానికి బందిఖానా అయితే బేగం స్మృతి తాజమహలు అయింది.

సుఖలోలత్వం దుఃఖాన్నీ, దుఃఖ తీవ్రత కళాఖండాన్ని సృష్టించాయి.

మొగలాయి రాజ్యమనే లక్ష్మి, భారత మహాసామ్రాజ్యానికే లక్ష్మి అయిన రాజమహలును ప్రసాదించింది. చరితార్థమయింది.

షాజహాను చక్రవర్తి ఆ రాజ్యరమనూ, ఈ రాజ్యరమనూ, వదిలి వెళ్ళిపోయాడు.

మర్త్యుడు అమర్త్యం నీడలో తాత్కాలికంగా నిలచినా మర్త్యుడు మర్త్యుడే! అమర్త్యం అమర్త్యమే! అతడే షాజహాను! అదే తాజమహలు!

'తాజి కడువరేదు రాజసంబు!

యమున ఒడ్డున తాజమహలుగా, ఆంధ్రదీనుడుల ముంటాజ మహలుగా, సంక్షిప్తమయిన కళాహృదయ కాంక్ష తాజమహలును తాజి చేసింది

సత్వరజస్తమోగుణాలలో మార్పు, కదలిక ప్రాణభూత ధర్మంగా కలది రజోగుణం. రజోగుణం నుంచి రాజసం. అది తాజమహలుకు ఎలా ఉందనటం, పోలేదనటం ?

ముంతాజి బేగం రాజసమే తాజమహలు రాజసం అయింది.

ఈ అవటం ఎలా జరిగింది ?

తెల్లనిదీ, చల్లనిదీ దర్శనీయం స్పర్శనీయం అయిన పాలరాతితో ఆమె శరీరానికి పోలిక కావచ్చు

కట్టడంలోని అన్నిభాగాలు క్రమంగా, నిండుగా కుదిరికగా, శాంతంగా ఉండటం రాణి మూర్తితో పోలితే పోలవచ్చు.

దాన్ని నిర్మించిన శిల్పులు కావించిన ప్రాణప్రతిష్ఠ కావచ్చు.

రాత్రింబగలు కూలీల చెమట నిర్మించిన స్వర్గం దిగిరావటం కావచ్చు.

ఏమయితేనేం తాజికి రాజసం వచ్చింది.

తాజమహలుకు ఈ రాజసం ముంతాజ్ బేగం ఆకారానికి రూపాంతరం కావటం కంటె ఆమె ఆత్మకు ఆవరణం కావటం వల్ల వచ్చింది. ఆమె ఆత్మతో ఐక్యం కావటం వల్ల, తాదాత్మ్యం చెందటం వల్ల, తనలో లీనం చేసుకోవటం వల్ల, తాను లీనమయి పోవటం వల్ల, తాజమహలు ముంతాజి బేగమే అయిపోవటంవల్ల, తాజికి రాజసం వచ్చింది

తాజి ముంతాజి.

అందుకే షాజహానుకు తాజమహలును చూడాలనీ, ఆ రాజసం చూడాలనీ, బందిఖానాలో ఉన్నా, అంత తాపత్రయం, అంత ఆరాటం.

బందీ, దురదృష్టవంతుడూ రాజు వాళ్ళ కళ్ళు లేనివాడు.

అతను చూడలేని తాజిని ఈ దేశాలు, విదేశాలు చూశాయి. అతడి కళ్ళు లోకం కళ్ళు

తాజమహలు శిల్పం కాదు స్త్రీ మహారాణి చరిత్రలో చిరంతని ఫుట. చేవి అంతులేని కళాతృష్ణకు వ్యాఖ్యానం. మనిషి మర్త్య మర్త్యులకు కట్టిన వంతెన. స్రష్టకు ఆశ్చర్యమైన సృష్టి.

దాని ఆత్మ దీప్తిమంతం కావించిన ముంతాజ మహలు కావ్యం ఆంధ్రికి అలంకారం.

# కలగూరగంప

## శ్రావణపూర్ణిమ

శ్రావణం కర్మకుర్వీరన్ ఋగ్యజుస్సామ పాఠకాః॥

ప్రతీ సంవత్సరము శ్రావణ పౌర్ణమి రోజున నాలుగు వేదశాఖల వారు ఉపాకర్మయను వేదవ్రతము నారంభించవలయును: 1. ప్రాజాపత్య వ్రాతము. 2. సౌమ్యవ్రతము. 3. ఆగ్నేయ వ్రతము. 4 వైశ్వదేవ వ్రతము. వీనినే వేదవ్రత చతుష్టయమనియు వ్యవహరింతురు. ఈ నాలుగు వ్రతములు, వీటికి ఉత్సర్జనములు చేయవలయును. ఉపనయనమయిన వటువు గురుకులమునందు వేదము నేర్చుకొను కాలమునందీ వ్రతములు చేయవలెను. ఒక్కొక్క వ్రతము ఒక్కొక్క సంవత్సరమునందు చేయవలెను. ఒక సంవత్సరము వ్రతము, మరొక సంవత్సరమునందు ఉత్సర్జనము చేయవలెను. ఈ విధముగ నాలుగు వేదవ్రతములు, నాలుగు ఉత్సర్జనములు పూర్తియగు సరికి 8 సంవత్సరములు పూర్తియగును. ఈ ఎనిమిది సంవత్సరములలో గురుకులమునందు వేదవేదాంగములు పూర్తిగా నభ్యసించి 16 సంవత్సరమునందు గోదానమను వేద సంస్కారము జరుపుకొనవలెను. అనగా "గర్భాష్టమేషు బ్రాహ్మణా ముపనయాత", — 8 సంవత్సరము నందు ఉపనయనము జరిగిన, 8 సంవత్సరములు గురుకులము నందుండుటతో 16 సంవత్సరములు పూర్తియగునని భావము ఇందుకు—

శ్లో॥ ఏవం కర్తవ్యే సతి బ్రహ్మ చర్య.
మష్టాబ్దం స్యాత్షోడశే జన్మనోధి
గోదానాఖ్యం కర్మ కార్యంహి
సాంగే వేదే ధీతేస్యాత్స మావర్తనాఖ్యం॥

1. అధ్యాయోపాకర్మ. 2. పారాయణోపాకర్మ. 3. కాండోపాకర్మ 4 వ్రతోపాకర్మ అనునవి చతుర్విధోపాకర్మలు. అయితే వర్తమాన కాలమునందు సారస్వతాద్యయ నక్రమముగా వేదములు చదువబడుచున్నవి. కాండక్రమాధ్యయన మిప్పుడు లేదు. ఆ పాఠ్య పరంపరలుప్తమైపోయినదని తోచుచున్నది. అయితే యజుర్వేదము నందు ప్రాజాపత్యకాండము, సౌమ్యకాండము, ఆగ్నేయ కాండము, వైశ్వదేవకాండము అను నాలుగు కాండములుగలవు. కాండ ప్రమాణములు ప్రస్తుతము తెలియుట లేదు. వీని నాచరించుటకు యుక్త కాలమును గూర్చి ఋషుల అభిమతము లిట్లున్నవి:

శ్లో॥ అథాత శ్రావణే మాసే శ్రవణర్క్ష యుతే దినే
శ్రావణ్యాం శ్రావణే మాసి పంచమ్యాం హస్త సంయుతే
దివసే విదధీ తైత్తదుపా కర్మయదో దితమ్.
అధ్యాయోపా కృతిం కుర్యాత్తత్తా పాసన వహ్నినా॥
(శౌనకః)

శ్రావణ మాసమునందు పూర్ణిమ దినమున శ్రవణా నక్షత్ర ముండును. ఆ దినమున పగటి కాలము నందు ఉపాకర్మ చేయవలెను. శ్రావణ శుద్ధ పంచమి దినమున హస్తా నక్షత్రము నందును చేయవచ్చును. ఔపాసనాగ్నియందు అధ్యాయోపా కర్మ చేయవలెనని శౌనకుడు చెప్పెను.

శ్లో॥ శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వోపాకృత్య క్రమేణ.
పౌష శుక్ల పది మాఘ శుక్ల ప్రతిపదివా కార్యం॥
(యాజ్ఞవల్క్యః)

అనగా ఈ ఉపాకర్మ శ్రావణ పౌర్ణమినాడు గాని, భాద్రపద పౌర్ణమినాడు గాని, ఆరంభించి వేదాధ్యయనము 5 మాసములు చేయవలెను. అనగా శ్రావణమాస మందారంభించిన పుష్య శుద్ధ పాడ్యమితోను, భాద్రపద మాసము నందారంభించిన మాఘ శుద్ధ పాడ్యమితోను పూర్తియగునని యాజ్ఞవల్క్య మహర్షి చెప్పెను—

శ్లో॥ ధనిష్ఠా సంయుతం కుర్యాచ్ఛ్రవణం కర్మయద్భవేత్
తత్కర్మ సకలంజ్ఞేయము పాకరణ సంజ్ఞితమ్॥ (వ్యాసః)

శ్రావణ పౌర్ణమి ధనిష్ఠా నక్షత్రముతో కూడినదైనప్పటికీ ఆ దినమునందు చేయవచ్చునని, భావము చెప్పబడుచున్నది. గాని గార్గియా విషయములో —

శ్లో॥ శ్రవణేన శ్రావణస్య పంచవల్యాల హస్తేనవా.
అత్రశ్రవణోముఖ్యో ఽ న్యే గౌణాః॥ (గార్గి)

అనగా శ్రవణా నక్షత్రముతో కూడిన పౌర్ణమి దినము నందు చేయుటయే ముఖ్యము. మిగిలిన హస్తతో గూడిన పంచమి, ధనిష్ఠతో కూడి పౌర్ణమి దినములందు చేయుట, (గౌణ) రెండవ పక్షమని చెప్పెను

శ్లో॥ ఉదయ వ్యాపినిత్యేవ విష్ణ్వర్క్షేఘటి కాద్వయమ్
తత్కర్మస కలంజ్ఞేయం తస్యపుణ్యంత్వనన్తకమ్॥ (గార్గి)

శ్రావణ పౌర్ణమి రోజున సూర్యోదమయిన పిదప రెండు ఘడియలు వరకూ, శ్రవణా నక్షత్రమున్ననూ చేయవచ్చుననియు, యిది అనంతమైన పుణ్యఫలము నొసగునని చెప్పెను "అధ్యయనాముపాకర్మ శ్రావణ్యాం తైత్తరీయకా", — అనగా తైత్తరీయ యజుర్వేద శాఖవారు శ్రావణమాసమునందు పాకర్మనాచరించుట ముఖ్యమని యున్నది.

శ్లో॥ నర్మ దోత్తరభాగేతు కర్తవ్యం సింహయుక్తకే
కర్కాటే సంస్థితేభానౌవు పాకుర్యాత్తు దక్షిణే॥
(ప్రయోగ పారిజాతే)

ఉపాకర్మ నాచరించు విషయములో దేశాంతర సాంప్రదాయమును, ప్రయోగ పారిజాతమను గ్రంథమునందున్నది. ఇది బృహస్పతిచే చెప్పబడినదిగా తెలియుచున్నది. నర్మదానదికి ఉత్తర తీరస్థులు. రవిసింహరాశియం దుండగా చేయవచ్చుననియు, దక్షిణ తీరస్థులు, కర్కాటక మందు రవి యుండగానే చేయవలెననియు చెప్పెను.

గురు, శుక్రుల స్థితిని గూడా యిచట విచారించవలయునని చెప్ప బడినది.

శ్లో॥ గురుభార్గవయోర్మౌఢ్యే బాల్యేవా వార్ధకేపివా.
తదాది మాస సంసర్ప మలమాసాదిషుద్విజే
ప్రథమోపాకృతిర్నస్యాత్కృతం కర్మవినాశకృత్॥

ప్రథమోపాకర్మ ఆరంభించు కాలమునందు గురు శుక్ర మౌఢ్యములుగాని, బాల్య వార్ధక్యావస్థలందున్నప్పుడుగాని చేయ రాదు. అధికమాసము, లుప్తమాసము, క్షయమాసము, మల మాసములు వచ్చినప్పుడు ఉపాకర్మ ఆచరించరాదు. ఆ విధముగా చేయుటవలన కర్మనాశనమగునని చెప్పబడినది—అయితే నృసింహ కారికావత్తియందు —

శ్లో॥ సింహస్థేర్కే శ్రావణే మాసిముఖ్య
స్సర్వేషాం స్యాద్విష్ణుభే బహ్వృచానాం
అధ్వర్యూణాం పక్షతి స్పృష్ట పర్వణ్యే
వోక్తం స్యాద్ధస్తభే సామగానాం॥

సింహరాశియందు సూర్యుడు సంచరించు కాలము సింహ సంక్రమణ మనబడును. అట్టి సింహ సంక్రమణములో కూడిన శ్రావణమాసము. అట్టి ఉపాకర్మకు యుక్త కాలమని చెప్పబడినది. అన్ని శాఖలవారును, సింహ సంక్రమణముతో కూడిన శ్రావణ మాసమునందు ఉపాకర్మ చేసుకొనవచ్చును. ఆ శ్రావణమాసమందు, శ్రవణా నక్షత్రమందు బహ్వృచులు, పాడ్యమితో కూడిన పూర్ణిమ యందు యాజుష్కులు, హస్తానక్షత్రమునందు సామవేదులు ఉపా కర్మ చేసుకొనవచ్చునని చెప్పబడినది మరియొక విశేషమేమనగా—

శ్లో॥ గౌణోభాద్రో పిచ ఆషాఢమాసః
పూర్వాభావే తూర్ధ్వ మేవప్రశస్తం
నో చేత్తస్యోత్సర్జనా త్పూర్వకాలే
కర్తవ్యం వా గామి వర్షేపి వాస్యాత్॥

ఉపాకర్మ విషయములో భాద్రపద మాసము, గౌణకాలము, ఆషాఢమాసము అధమమైనది. శ్రావణము శ్రేష్ఠమైనది అయితే శ్రావణమాసము. మూఢదోషముతోయుండిన భాద్రపద మాసము నందు చేయవచ్చును. శ్రావణ, భాద్రపదమాసములు రెండును, మూఢదోషముతో యుండిన, ఆషాఢ మాసమందైనా చేయవలసి యున్నది. ఆషాఢ, శ్రావణ, భాద్రపద మాసములు మూడును దోషయుక్తములయినచో ఉత్సర్జన పూర్వకాలమందుగాని, పై సంవ త్సరమునందుగాని, ఉపాకర్మ చేయవలెను. ఒకగా ఉపాకర్మచేసి వేదాధ్యయనము ఆరంభించవలెను. అందుచేత వేదాధ్యయనమునకు భంగము కలుగకుండుటకు ఆషాఢమాసము దోషమే అయినా చేయ వలసి నదిగా పెద్దలు చెప్పినారు. మరియు, అనావృష్టిచే దుర్భిక్ష మేర్పడినపుడును ఆశౌచము, అనారోగ్యము, చంద్రగ్రహణము, కర్కాటక సంక్రమణము, అధికమాసము, గురు, శుక్ర మౌఢ్యములు వచ్చినప్పుడు, దేశపాలకులు మరణించినప్పుడు, దేశవిప్లవములగు

ఆపదలతో రాష్ట్రమున్నప్పుడు, ఉపాకర్మ, ఉత్సర్జనములు చేయ కూడదు అని చెప్పబడినది.

ఈవిధమగు విధినిషేధములు యుక్తాయుక్త కాలనిర్ణ యము చూచుకొని వేదప్రతిపాదితమగు ఉపాకర్మాది సంస్కారముల నాచరించవలసియున్నది. ఈ సంస్కారము ముఖ్యముగా వేదము నేర్చుకొను విద్యార్థులకొరకు నిర్దేశింపబడినది. అపౌరుషములు, దైవదత్తములునగు వేదశాస్త్రములను నేర్చుకొనుటకు, తగుశక్తి; తేజస్సు; గ్రహణశక్తి; ఆత్మజ్ఞానము స్పష్టమగు శబ్దోచ్చారణ; శ్రావ్యమగు ధ్వని కలిగి వేదవిద్యను ఆసాంతము నేర్చుకొనుటకు వేద మంత్రములచే చేయబడు సంస్కారమిది. పరమ పవిత్రములైనవి. విశ్వవ్యాప్తమైనవి. సర్వసృష్టి మర్మములతో కూడిన విజ్ఞాన సముదాయములగు వేదములను నేర్చుకొనుట సాధారణమైన విష యముకాదు. అయితే వేదములను నేర్చుకొనుటకు యింతటి కార్య మేల కావలయును? అనే ప్రశ్న ఉదయించును. కాని, భారతీయ సాంస్కృతి, ఆర్షవిజ్ఞానము, వేదవాఙ్మయము. కొన్ని ప్రత్యేకత లతో కూడిన, అతి ప్రాధాన్యములైన విషయ, సముదాయములలో నిండియుండినవగుటచేత వాని పవిత్రతను, ప్రత్యేకతను గ్రహించి వ్యవహరించుట అవసరమైయున్నది.

బంగారము అగ్నిచే సంస్కారము చేయబడుచున్నది ఇచట సంస్కారమనగా శుద్ధిచేయబడుట అని భావము. బంగారము సహ జముగా తేజస్సు కలిగియున్నది. దానిని అగ్నిలో కాల్చి సాగబట్టుట చేత ఆ తేజస్సు ఇంకనూ వృద్ధియగుచున్నది. అందున్న కల్మషము నశించుచున్నది. అందులకు బంగారమును అగ్నిసంస్కారముద్వారా శుద్ధిచేయుచుందురు.

అటులనే జీవుడు ఇంద్రియాద్యవయవ సముదాయములతో కూడిన దేహమునందు ప్రవేశించి ప్రకాశవంతుడగుచున్నాడు. దే ధారియగు జీవుడు అజ్ఞానాదికములయిన కల్మషములనుండి శుద్ధి కాబడి, పరిశుద్ధమైన జ్ఞానముతో వికసించుటకు వేదమనే అగ్నిచే సంస్కరింపబడవలయునని, తద్వారా జీవుడు ధర్మార్థ కామ మోక్షాది పురుషార్థసిద్ధి నొందగలడని వేదమతము విశ్వసించు చున్నది.

కనుకనే జీవుడు మాతృగర్భమునందు దుత్పన్నమయినది లగా యితు—అనగా గర్భధారణ లగాయితు—వివిధ దశలలో వివిధ సంస్కా రములను వేదము నిర్దేశించినది.

అయితే యీ సంస్కారములు చేయకున్న ఏమి దోషములు కలుగును? అను ప్రశ్నయున్నది. ఇచట బంగారమును అగ్నిలో సంస్కరించకున్న ఏమగును? సహజకాంతి యుండును. కాని పంచ భూత జనితమైన కల్మషముచేత అది దోషభూయిష్ఠమై, కాంతి హీనమగును. అటులనే వేదవిహిత సంస్కారము లోపించిన మానవుడు ఇంద్రియ వ్యాపార నిమగ్నుడై తత్సంబంధ జనితము లగు సుఖదుఃఖములచేత పీడింపబడుచుండును. క్రమేణా జ్ఞాన తేజస్సు నశించి, అజ్ఞాన తిమిరావళి యావహించి తత్సంబంధము

లైన పశుపక్ష్యాది జంతుజన్మల నొందుచుండునని, బహుళ్లేశ పూరితములగు యట్టి జంతు జన్మలు కలుగకుండుటకు జ్ఞాన పథములో పరమాత్మ తత్త్వమును చేరగలుగుటకు వేదవిహిత కర్మాచరణ ప్రధాన సాధనమని చెప్పబడుచున్నది.

అదే లక్ష్యముతో వేదవిద్యను నేర్చుకొను విద్యార్థికి విద్యాప్రాభవము, విజ్ఞాన సంపన్నత వృద్ధియగుటకొరకు ఉపాకర్మాది సంస్కారము చెప్పబడినది. యిది శ్రావణ పౌర్ణమి దినమున నాచరించవలసియున్నది. కనుక శ్రావణ పౌర్ణమి భారత దేశమునందు ముఖ్య పర్వదినముగా చెప్పబడుచున్నది. ఆ దినమున ఉపనీతులగు ప్రతీవారు నూతన యజ్ఞోపవీతములను ధరించి, గాయత్రీ మంత్రమును పునశ్చరణ చేయుచుందురు వేదాచార్యులు, విద్యార్థులు ఉపాకర్మాది సంస్కారముల నాచరింతురు. కనుక ఈ దినము మహా పర్వదినముగా ప్రశస్తి నొందినది.

*శ్రీ శివకోట సత్యనారాయణమూర్తి*

# పాండీడు

శ్రీకృష్ణదేవరాయలు 'ఆముక్త మాల్యద'లో 'తత్పురం చేలు బాండ్య మత్స్యధ్వజుండు' 2–9; 'ఏలు నా పాండ్యుఁడు మహిని రీతిగాగ' 2–43; 'పాండీడు దివాణ మున్నెఅయ' 2–88; 'పాండ్యుఁ డిచ్చిన ధనము' 4–32; 'ప్రభువు లరిగిరి క్రమ్మఱఁ బాండ్య నగరి' 4 37; ఇత్యాదిగ పేర్కొనిన మత్స్యధ్వజుఁడు, 'పాండీడు' అనే మధురాధిపతి ఎవడు? పాండ్యులందరు మత్స్య ధ్వజులే కదా. అట్టియెడ కేవలము పాండీనిని రాయఁట్టి బిరుద, దేశవాచకములచేతనే ఏల పేర్కొనెను? ఇవి యల్పబుద్ధుల సందేహములే యయిననూ విషయ మనల్పమే.

ఆముక్తమాల్యదను గూర్చి పలు వ్యాసములు, సిద్ధాంత గ్రంథములు వెలువడినవి. కాని వానిలో నిందులకు సమాధానము గానరాదు.

రాయల రచనమునకు 'దివ్యసూరి చరిత్ర', 'గురు పరంపరా ప్రభావము' మూల గ్రంథములై యుండునని యొక సిద్ధాంత గ్రంథము పేర్కొనినది.

ఆ గ్రంథములలో పాండీడు 'వల్లభదేవః' అని 'వల్లభ రాయన్' అని యున్నదే. రాయలా నామము నేల స్వీకరింపలేదు ?

విష్ణుచిత్తుడు 8 వ శతాబ్దిలోనివాడని పలువురు సిద్ధాంతీకరించిరి. 740–767 క్రీ॥శ॥ ప్రాంతములో మధుర నేలినవాడు 'కోనెడు మారన్' అనియు, అతడే విష్ణుచిత్తునకు శిష్యుడైన పాండ్య రాజని శ్రీ ఎమ్. రాఘవయ్యంగారను చరిత్ర పరిశోధకులు పేర్కొనిరి. అందుల కుపబలముగ పెరియాళ్వారుల రచనల యందును, ఆనాటి శాసనము లందును పెక్కు ఆధారములు గానవచ్చుచున్నవి.

శాసనము లందీ కొనెడుమారన్ (వల్లభదేవుడు) మారవర్మన, రాజసింహుడుగ గూడ చెప్పబడియున్నాడు.

పెరియాళ్వారనే విష్ణుచిత్తుడు తిరుమావిరుండోన్నైని ప్రశంసించుచూ "శత్రువులను జంపుటయే వృత్తిగాగల వేలాయుధము ను ధరించియున్న, దక్షిణ మధుర కధిపతియగు 'కోనెడు మారన్'ను శ్లాఘించుచు 'ఓ తిరుమావిరుం శోనై యే' అని చెప్పియున్నాడు.

'మారన్' అనేది (పాండ్యుల) పరాక్రమ సూచకమగు పదమగును. అయిననూ 7, 8వ శతాబ్దములందున్న పాండ్యులందరు ఆ 'మారన్'ను నిజనామ భాగంగానే ఉంచుకొని వ్యవహరింపబడ్డారు. కోమారన్–కోవర గుణమారన్–లు అట్టివారే గద !

కాన పెరియాళ్వారులు చెప్పిన "కొన్నవిన్ కూరవేల్ కోనెడు మారన్" అను పాశురమందలి కోనెడు మారన్ 'వల్లభదేవుడే' – అనగా మత్స్యధ్వజుడే–పాండీడే.

ఆనాటి శాసన మొకటి కోనెడుమారన్ (వల్లభదేవుడు) గంగరాజు పుత్రికయగు భూసుందరిని వివాహమాడినట్లు తెలుపుచున్నది.

పన్నిద్దరాళ్వారులలో నొకడగు తిరుమంగై యాళ్వార్ అనువాడును ఈ కోనెడుమారన్‌ను 'ఉలగుడై మన్నవన్ తెన్నవన్' అని పేర్కొనియున్నాడు. అందిట్లున్నది "కూడల్ వంజి కోత్తి యెన్నుమ్, కూడమామదిల్ పుదుక్కియవన్." కూడల్ అనగా మధుర, వంజి అనగా చేరుల రాజధాని, కోత్తి = చోళుల రాజధాని యగు ఒఱయూరు 'చేర చోళ రాజ్యములను పాలించినవాడని, చక్రవర్తియని చెప్పియున్నారు.

వేళ్వికుడి శాసనమునందు ఈ నెడుమారన్ (పాండీడు) పల్లవరాజును యుద్ధమున జయించినట్లున్నది. ఆ పల్లవరాజు పల్లవ మల్లుడే పల్లవ వంశీయుడగు చిత్రమాయునికి పట్టము కట్టుటకొరకే కోనెడుమారన్ పల్లవమల్లునితో యుద్ధముచేసెను. ఈ చిత్రమాయుడు వరుసకు పాండీనికి మేనమామట. కాని పల్లవ సేనాపతి యొకడు ఈ చిత్రమాయుని యుద్ధములో చంపివేసెను. పిదప కూడ అతని కొడుకులకై కూడ పల్లవ మల్లునితో యుద్ధము చేసెను.

ఈతని పరాక్రమమును రాయలే "ద్విద్వయోపాయ ధీవిద్యోతం సంబు," "ఇందు కులావతంసము," "పాటీర గిరిపనీ వాటిఁ గ్రీడించియు" – అను పద్యములలో ఘనముగనే కొనియాడియున్నాడు.

ఈ కోనెడు మారనునకు భగవంతుడే యుద్ధములలో తోడ్పడుచుండెడివాడు. కావున ఆసేతు హిమనగము జయించెనని తెలుపు ఈ క్రింది పాశురమును గమనింపుడు

''కుఱు గాదమన్నర్ కూ్కడు కటక్కి వెంగానిడై
చ్చిఱు కాల్ నెఱియే పోక్కు విక్కుం శెల్వన్.''

(పగలుఱ సందరిని చెదఱగొట్టి కీకారణ్యములకు తరిమి వేయునట్టి భగవంతుడు.)

యుద్ధ విజయములతో ప్రేమ కలాపములతో ('... నర్థి రథ్యాన్తరాంతః పురాంతరః నాభోగినీ సంగతికి రాజు పోవుచుండె' అని రాయలే పేర్కొనినాడు కదా)' పొందలేని మనశ్శాంతిని విష్ణు చిత్తుని ఉపదేశముచేపొంది విష్ణుభక్తుడై—మహాజ్ఞానిగ పరివర్తన మొందెను వల్లభదేవుడు.

మన పాండీడగు కోనెడుమారన్ తాత ''నిన్రడశీర్ నెడు మారన్.' అతనినె గూని పాండ్యు డందురు. తొలుత నితడు జైన మతావలంబియై యుండ తిరుజ్ఞాన సంబందరు అతనిని మెప్పించి యొప్పించి శైవునిగ జేసెను. ''నిన్రడ శీర్ నెడుమారన్'' భార్యయే మంగ యర్కరశి. పరమ శివభక్తురాలు. 'తిరుత్తొండ త్తొగై' అను గ్రంథములో నీ నిన్రడ శీర్ నెడుమారన్ పరమ శివభక్తుడుగ పేర్కొనబడియున్నాడు. శాసనములలో నితడు నెడు మార పాండ్యన్, నెడుమార కుబ్జ పాండ్యన్, అరికేశరి మారవర్మన్‌గ కూడ చెప్పబడియున్నాడు.

విష్ణుచిత్తునికడ వైష్ణవము స్వీకరించుటకు మున్ను వల్లభ దేవుడున్నూ తాతవలె శైవుడై యుండెను. ఈ తాతమను మల అంతరము సుమారు 30 ఏండ్లుట. కాన ఈలోగ మతాంతర పరివర్తనమునకు నవకాశము లేదనే చెప్పవచ్చును.

పాండిక్కొడు ముడిసెన్ ఱ్రెయ్‌దిప్పశు పతియదు
పదుమ పాదం పణిందేత్తి
క్కనక రాశియుమ్ కదిర్ మణియుమ్
మనగిత్తి క్కొడుత్తిట్టు —

పై శాసన భాగమును, పై విషయమును స్పష్టపరచుచున్నది.

జైన మతాభిమాని యగు శీర్‌నెడుమారన్ అను అరికేశ విమారవర్మ తిరుజ్ఞాన సంబందర్ వలన శైవుడయ్యెను. విష్ణు చిత్తుని వలన కోనెడుమారన్ అను పాండీడు వైష్ణవుడయ్యెను.

భూ సుందరీ వల్లభదేవుల కుమారుడు పరాంతకుడు. ఇతనిని నెడుంజడైయన్, మారన్ జయన్ అనియు నందురు. ఇతడు పరమ వైష్ణవుడనుటను ఈ క్రింది శాసనభాగము తెలుపుచున్నది.

'పరాంతకన్ పరమ వైష్ణవన్ తానాగి
నినెఱి లంగు మణినీళ్ముడి
నిలమన్నవన్ నెడుంజడయన్.'

ఈ పరాంతకుని మహాసామంతుడు 'మాఱంగారి.' అతని తమ్ముడు పరాంతకుడు. ఇరువురు తమ రాజు వలెనే పరమవైష్ణవులు. వీరే

కోనెడుమారన్. భూసుందరికై గంగరాజులతో జరిపిన పోరులో బాసటగా నిలిచి శత్రువులను దరిమివేసిరి. వీరు మధుర కతి సమీపమున నున్న యానైమలైలో నరసింహస్వామికై ఒక యాలయమును నిర్మించినారని యచటి క్షేత్రమాహాత్మ్యమున గలదు. ఈ సోదరులు 'కళక్కుడి' నివాసులు. అది పెరియాళ్వారవతరించిన శ్రీవిల్లిపుత్తూరున కతి సమీపమున గలదు. కాన బాల్యము నుండియూ వీరునూ తమ ప్రభునివలెనే విష్ణుచిత్తుని కృపకు పాత్రులై యుందురని మనమూహింపవచ్చును.

చరిత్రజ్ఞులు విష్ణుచిత్తుయి 85 సంవత్సరములు జీవించిరని తెల్పుచున్నారు. నెడుమారని తండ్రి కాలమున నా మహనీయుని బాల్య యౌవనములు గడచి యుండును. నడిమి వయస్సు నెడుమారనొనర్చు శిష్యరికముతో గడచి యుండును. అపుడే గోదాప్రాప్తి — ఆమె పాలనాదులు — రంగయాత్ర మున్నగునవియు జరిగి యుండును. పరాంతకుని శుశ్రూషతో నాతని వార్ధక్యము గడచి యుండును. ఈ స్థితినే 'గురుచరితకు కొండాడిన' వాడుగ, నెడుం జడయన్‌ను ఒక శాసనము పేర్కొనినది. అదే 'పాండియన్ కొండాడ భట్టర్ పిరాన్' అను సూక్తికిని వితై యుండును.

ఇట్లు విష్ణుచిత్తుని జీవితముతో ముడిపడియున్న కోనెడుమారన్‌ను, మారవర్మను, రాజసింహుని కేవలము పాండీడని, మత్స్యధ్వజుడని రాయలేల చెప్పెనో తెలియకున్నది. రాయలకన్న సుమారు 7, 8 వందల సంవత్సరములకు ముందున్న పాండ్యుల చరిత్రను బహుశ రాయలు గుర్తింపలేదేమో ? కనీసము దివ్యసూరి చరిత్రాదులందున్నట్లు వల్లభరాయుడనియైన చెప్పియుండవచ్చునే. అది నెడుమారన్ అను దానికి సంస్కృతానువాదమే కదా. ఆ మాత్రమెరుగడా మన రాయలు అనగా శ్రీకృష్ణదేవరాయలు.

## ఆధారములు :-

1. ఆముక్త మాల్యద — శ్రీకృష్ణదేవరాయలు
2. దివ్యసూరి చరిత్ర — శ్రీనివాస పండితుడు
3. గురు పరంపరా ప్రభావము.
4. భగవానై వళర్త భక్తర్ — పి. శ్రీ
5. శివభక్త చరిత్ర—విద్వాన్ పి. సూర్యనారాయణ శర్మ.

**శ్రీ టి. పి. భాష్యకారాచార్యులు**

## "గా రి ల్లా"

"Large powerful ferocious arborea lauthropoid ape native of westren eqwatorial Africa."

[Afr. Wd] "Wildman"కి

గొరిల్లా గురించిన నిర్వచనం ఇలాగ కూడా వున్నది:

"Authropoid Ape" అంటే మానవ సంబంధమైన రూప, గుణములు కలవని. అలా కానిపక్షంలో—,'Wild man"గా స్వీకరిస్తే శేషేంద్ర శాస్త్రంలోని గొరిల్లా ఏహారం స్పష్టమవుతుందనుకుంటాను. ఇప్పుడేవిధంగా చూచినా కూడా ప్రతీకలో దోషం లేదనుకుంటాను—

ఈ నిర్వచనాలు "The Readers Digest Great Encyclopaedic Dictionary" లోనివి.

**శ్రీ శా స్త్రి**

## శ్రీ వీరయ్యగారి విజ్ఞత

1977 అక్టోబరు 'భారతి'లో సోమసుందర్‌గారు రాసిన దాన్ని మా మంచి వీలుచేసుకుని బి. వీరయ్యగారు విప్లవ రచయితల సంఘం (వి. ర. సం.) మీదికి బండి మళ్లించారు (సోమసుందర్ విమర్శలోని నిజానిజాలు, 1978 జూన్, భారతి: కలగూరగంప) వి ర. సం. గురించిన వైఖరిలో సోమసుందర్‌గారికంటె తాము ఎందునా తీసిపోరని అక్షరాలా రుజువుచేసుకున్నారు. వ్యక్తిగత హింసావాదం, అతివాద దృక్పథం, 'చంపండి, నరకండి' కవితలు, అండర్‌టేకింగ్‌లు, వగైరా వగైరా కితాబుల విషయంలో, దొందూ దొందే. రాజకీయ మితవాదం ఆ యిద్దరిలో హెచ్చుతగ్గులుగా వుంది వి. ర. సం. మీది విమర్శలకు సాక్షికరను కలిగించిందల్లా యిదే. వీరయ్యగారి మనస్తాపం, 'జనపథం'లో సాంస్కృతిక విప్లవం సాగాలనే వాదంతో అనంతపురం మహాసభలో(1975 జనవరి) రగడచేసి, వి. ర. సం. చారుమజుందార్ వర్గీయుల సంస్థ అయిపోయిందని విమర్శించి, బహిష్కరణ పొందిన వారిని సోమసుందర్‌గారు ఎత్తి నెత్తికెక్కించుకోలేదని మాత్రమే. 1970 లోనే వీరిలో ఒకరి 'విప్లవ పదజాలాన్ని ("బృహన్నల") సోమసుందర్‌గారు స్వయంగా చవిజూచి ఉన్నారని వీరయ్యగారికి తెలిసినట్టులేదు. ఏ చారు మజుందార్‌నైతే ఇప్పుడు పాపాల భైరవుడుగా ఎంచుతున్నారో, ఆ చారుమజుందార్ మార్గాన్ని కవిత్వంలోనూ, ఉపన్యాసాలలోనూ మిన్నులకెత్తిన మహానుభావులు ఇప్పుడు 'జనపథం'లో వుంటున్నారు. ఇంతకూ చారూ మజుందార్ మార్గం రాజకీయ దుర్మార్గంతప్ప మరేమీకాదా? ఆధునిక భారత రాజకీయాన్ని నిశ్చితమైన మలుపుతిప్పి, బూర్జువా పార్లమెంటరీ పంథాకు ప్రత్యామ్నాయమైన సాయుధ ప్రజాపోరాట పంథాను చూపెట్టిన వారిలో కానూ సన్యాల్, జంగల్ సంతాల్ వగైరాలలో నైనా చేరడా చారు మజుందార్? ఆయన విప్లవ విద్రోహా? సి. ఐ. ఏ. ఏజెంటా? చారు మజుందార్‌ను, తరిమెల నాగిరెడ్డినీ పోటీ పెట్టవలసిందేనా? ఇలాంటి ప్రశ్నల కన్నిటికీ వీరయ్యగారు జవాబిచ్చుకున్నాకనే, ఇలాంటి విమర్శ చేసివుంటే బాగుండేది. వ్యక్తిగత హింసావాదానికి (టెర్రరిజం) 'వర్గశత్రు నిర్మూలన' (Annibilation of the class enemy) పేరిట చారు మజుందార్ నాయకత్వాన నక్సల్బరీ, శ్రీకాకుళం, ఖమ్మం — వరంగల్ ప్రాంతం, దేబ్రా—గోపీవల్లభ్‌పూర్, ఇంకా కొన్నిచోట్ల. దారుణ

పైన రాజకీయ దుష్ప్రేతాలతోనైనా సరే, అమలు జరిగిన ఒకా నొక పోరాట రూపానికి తేడాయే లేదంటారా వీరయ్యగారు?

వి. ర. సం. సాహిత్యం అంతాగాని, అధికభాగం గాని 'చంపండి, 'నరకండి' కవితలతో నింపి వుంగనడం, వీరయ్యగారికి సులోచనాల అవశ్యకతనే నిరూపిస్తుంది. సోమసుందర్‌గారి విమర్శలో 'నిజ-నిజాలు'ంటే వీరయ్యగారి విమర్శ (నిజానికి దూషణ) నిజం తప్ప తక్కినదే వుంది.

మార్క్సిజాన్ని (ఇప్పుడు మార్క్సిజం–లెనినిజం–మావో ఆలోచనా విధానం) తన ధ్యేయంగా చేసుకోవడమే వి ర. సం. మహాపరాధమైపోయినట్టుగా, "నేటి దశలో సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేకశక్తుల ఐక్య వేదికలు"గా సాంస్కృతిక విప్లవానికి నాయకత్వం వహించవలసిన సంస్థలు ఉండాలని వీరయ్యగారు చెబుతున్నారు. సామ్రాజ్యవాదం అఖండంగా వుందా? దానికి ఒకే కేంద్రమా? భూస్వామ్యానికి వత్తాసు నిస్తున్న ఇతర వర్గాల మాటేమిటి? అవన్నీ స్నేహానికి సహకారానికి అవకాశమిస్తాయా? మార్క్సిజం పేరు చెప్పకపోవడం, అదేసమయంలో భూస్వామ్య వ్యతిరేకతను, సామ్రాజ్యవాద వ్యతిరేకతను ప్రబోధించడం, నయవంచన కాదా?

"విప్లవం గురించి ఓనమాలు తెలియని కుర్రకుంకలో, అతివాద దుందుడుకు విధానంతో 'చంపండి', 'నరకండి' కవితలు వ్రాసి విప్లవ కవులుగా చలామణి అయిన మరే కొంతమంది కవులో సోమసుందర్‌కి తెలిసినవారు అండర్ టేకింగ్ ఇచ్చి బయట పడ్డారేమోగాని..." –వీరయ్యగారూ, బ్రూటస్‌లా ప్రవర్తిస్తున్నారెందుకు? మీ అభిమాన "ప్రజాకవులకు" ఉన్నపాటి విజ్ఞత వి. ర. సం. కవులకు లేకపోవచ్చు. అంతమాత్రాన వారు లొంగిపోయినట్టేనా? అందరూ? పోనీ, ఎక్కువమంది? ఎమర్జన్సీలో నిర్బంధంపాలైన 35 మంది వి ర. సం. సభ్యుల్లో ఎందరు అండర్ టేకింగు ఇచ్చిందీ వి. ర. సం. సర్వసభ్య సమావేశం (1977 ఏప్రిల్)లో కార్యదర్శి నివేదికలో వుంది. దాన్ని గూడా చూడరా తమరు?

"తమకు వ్యతిరేకమైనంతమాత్రాన అందరిమీదా అటువంటి అభాండాలు వేయడం నిజంగా దురదృష్టకరం."

వీరయ్యగారి నోటినుంచి గూడా కోటికొక్క మంచిమాట–సుభాషితం. అయితే అది సోమసుందర్‌గారికే గాని తమకుమాత్రం వర్తించని ధర్మం. ఔరా! ద్వేషమా, నువ్వెంత తెలివైన దానివి! నీది తేనెపూసిన కత్తి. మిత్రుడిలా ఉపదేశిస్తూనే నువ్వు కుటిలంగా వ్యవహరించగలవు. ఒక్కోమారు – ఆపద లేనప్పుడు – హంవీరుడిలాగా, లేదా వీరయ్యగారిలాగా రూపం ధరించగలవు. ప్రమాదాన్ని పసిగట్టగానే విజ్ఞతపేరుతో, నువ్వు ఎంచక్కా తోక ముడుచుకు బుద్ధిగా, జైళ్లబయట, అండర్ టేకింగ్‌లకు ఎలాంటి అవకాశమూ లేకుండా, గుడ్బాయి అనిపించుకోగలవు. 'జనపథం పేర' అహింసామార్గాన్ని, 'విప్లవం' పేర నిశ్చలతత్వాన్నీ అనుసరించగలవు. నువ్వు ఎంతకైనాతగుదువు!

'సుదర్శన్'

## ఏది సత్యం ? ఏ దసత్యం ?

ఈమధ్య తెలుగు పిహెచ్. డీలు డాక్టరేటు పట్టం కోసం సమర్పించిన సిద్ధాంత గ్రంథాలు ఎంత ప్రామాణికంగా ఉన్నాయో చెప్పటానికి మచ్చుతునకగా ఒకే అంశాన్ని తీసుకొందాం.

జాన్ ఎఫ్. ఫ్లీటు (1847 – 1917) ఎపిగ్రాఫికా ఇండికా 5 వ సంపుటంలో కర్ణాటక రాష్ట్రంలోని మనగోలి (మాణిక్యవల్లి ➔ మాణిగవల్లి, ➔ మణిగవల్లి ➔ మనగోలి), అబ్బలూరు గ్రామాలలోని శాసనాలను పరిష్కరించి ప్రకటించారు. కర్ణాటాంధ్ర రాష్ట్రాలలోని వీరశైవ, కాలాముఖ, పాశుపతశైవ శాఖల చరిత్ర పరిశోధనకు ఈ సంపుటంలోని శాసనాల ప్రాముఖ్యం ఎంతో ఉంది. బసవేశ్వరునిపై పరిశోధన చేసేవారు ఈ శాసనాలను క్షుణ్ణంగా చదివి, అర్థం చేసుకొని వ్రాయవలసి వస్తుంది. ఏ మాత్రం బద్ధకించినా, ఏమరు పాటుతో చదివినా, చదివినట్టు పాఠకులను భ్రమింప చేసినా ఆ వ్రాత సత్య సమ్మతం కాదు – చూడండి :

# I

''ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు'' – అనే పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథాన్ని ఆంధ్రా యూనివర్సిటీ వారు (సిరీస్. 140) ఫిబ్రవరి 1978 లో ప్రకటించారు. అందులో 'మతము–మత ప్రవర్తకులు' అనే అధ్యాయం (276.305)లో, 290 వ పుటలో ఈ క్రింది విధంగా వ్రాయబడి ఉంది.

''జైనుడైన బిజ్జలుని పరమత సహన గుణమును, తన వీరశైవ మత ప్రచారమునకు ఉపయోగించుకొని వీరశైవ మతోద్ధరణము చేసిన మత ప్రవక్తయగు బసవేశ్వరుని గూర్చిన చారిత్రకాధారము అంతగా లభించుటలేదు. బసవేశ్వరుని పేర్కొనిన కొన్ని శాసనములు మాత్రము కలవు. (శాసన వివరములన్నవి) ఈ శాసనములందు బసవని పేరు మాత్రమే పేర్కొనబడి యున్నది. బీజాపూరు జిల్లాలోని మనగోలి గ్రామమున గల క్రీ. శ. 1161 నాటి శాసనము వలన మాత్రము బసవన జీవిత విశేషములు తెలియుచున్నవి. ఈతడు సాటిలేని మాహేశ్వర భక్తుడని ఈ శాసనమున కలదు (Ei, vol V. 1898–99).

బాగవాడికి పదునొకండు మైళ్ళ దూరమునగల మనర్గోలి యందు బిజ్జలుడు తను రాజ్యమునకు వచ్చిన ఆరవ సంవత్సరమున వేయించిన ఒక శాసనమున, బసవన ఒక దేవాలయమునకు దానమిచ్చినటుల గలదు. అందు బసవన తలిదండ్రుల నామములున్నవి. అందు బసవన గొప్పతనము కీర్తింపబడినది. అతని మించిన శివభక్తుడు లేడని, ప్రపంచమంతటిచే పూజింపతగ్గవాడని కలదు (Edward P. Rice A History of Kanarese Literature. P. 53).''

పై ఉద్ధృతాంశాలలో మనగోలి, మనర్గోలి అని రెండు సార్లు శాసన ప్రసక్తి తేవటం చర్వితచర్వణమే. అది ఒకే శాసనం. పైగా ఈ శాసనంలో ప్రసక్తుడయిన బసవేశ్వరుడు వీరశైవ మత స్థాపకుడయిన బసవేశ్వరుడు కాడు. అతని పేరు బసవరసు. కాశ్యపగోత్రజుడు. తల్లిదండ్రులు చంద్రమాంబికా చంద్రిరాజులు.

ఫ్లీటుదొర వ్రాస్తూ మనగోలి శాసనంలో సందర్భవశాత్తు వచ్చిన బసవ, మాదిరాజుల పేర్లు బాగేవాడి సమీప గ్రామంలోని శాసనంలోనే దొరకడంవల్ల ''is rather suggestive of our having atlast met with an epigraphic mention of the original of that Basava'' అని కూడా వ్రాశారు. ఫ్లీటుదొర అదే సంపుటంలో (Ec. Vol 5.) అబ్బలూరు శాసనాలను ప్రకటిస్తూ

(Mamagoli Inscription) it really seems to give us the original of traditional Basava who figures in the lingayat puranas and the Jain book. And in disclosing the facts that the parents of Basava were, not Madiraja and Madalambika but Chandiraja of Kasyapa gotra and Chandrambika, and that Madiraja belonged to altogether a different family, namely the Harita gotra'' (Ei Vol 5. Page 242).

అని వ్రాశారు.

దీనినిబట్టి ఫ్లీటుదొర మనగోలి శాసనంలోని బసవరసు ఎంతటి గొప్ప శైవ భక్తుడైనా లింగాయత మతప్రవక్త బసవేశ్వరుడు కాడని అరటి పండొల్చి చేతి కందిచ్చినట్లు వివరిస్తే ఆ శాసనం పూర్తిగా చదవకుండా, కనీసం అదే సంపుటంలో ఏమున్నాయో తెలుసుకోకుండా సిద్ధాంత గ్రంథాల్లో విషయాన్ని కాచి వడపోసినట్లు వ్రాయడం క్షమింపరాని నేరం. పోనీ ఈ విషయం ఇక్కడితో సరిపోయిందనుకుంటే 'బసవేశ్వర వచనాలు II--సమగ్ర సమీక్ష' అనే సిద్ధాంత గ్రంథంలో (ఇది మైసూరు విశ్వ విద్యాలయానికి తెలుగులో పిహెచ్ డి. కోసం సమర్పించినది. ప్రకాశకులు 'తరళబాళు జగద్గురు విద్యా సంస్థ. సిరిగిరె. చిత్రదుర్గ జిల్లా, కర్నాటక. 1976–77) ''వచనములు వ్రాసిన బసవన యెవరు ?'' అనే అధ్యాయంలో''

''డా. ఫ్లీటు 1899 వ సంవత్సరమున మణిగవల్లి శాసన మొకదానిని (ఎపిగ్రా. సం 5. పు. 10. 11) వెలువరించి, దానిని విపులముగా చర్చించి విమర్శించియున్నారు. ఆ శాసనమున బసవరసయ్య అను శివభక్తుడు పేర్కొనబడియున్నాడు ... ...... ఈ శాసనమున వచ్చు శివభక్తుడగు బసవరసయ్యను ప్రజలు తండ్రిగా భావించి నమస్కరించి గౌరవించుచుండిరి. ఈ బసవడే లింగాయత మతస్థాపకుడు. వచనకర్త అని డా. ఫ్లీటు నిర్ణయించెను '' (పుటలు 6, 7) అని వ్రాయుటయేకాక సందర్భం వచ్చినప్పుడు ఈ తప్పుడు అభిప్రాయాన్నే వల్లెవేస్తూ వ్రాయడం జరిగింది. 9 వ పుటలో ''అర్జునవాడ శాసనము వెలువడుటకు పూర్వము ఫ్లీటుగారు మణిగవల్లి శాసనమునందలి బసవరసయ్యయే లింగాయత మత స్థాపకుడని యూహించిరి'' అని వ్రాశారు. అదే సంపుటంలోని అబ్బలూరు శాసనాలనైనా చూడకుండా.

ఈ రెండు గ్రంథాల్లోను ఈ విషయమే కాకుండా ఎన్నో అసత్యపు వ్రాతలు కుప్పలు తిప్పలుగా చోటు చేసుకున్నాయి. అందులో మొదట చెప్పిన సిద్ధాంత గ్రంథం మాట ఇహ చెప్ప నక్కరలేదు.

— శ్రీ సుందరేశ్వరరావు

# ''వైశ్వనాథీయ ఛాందస మౌఢ్యం''

ఫిబ్రవరి 1978 భారతిలో పై శీర్షిక క్రింద ప్రచురింపబడ్డ డాక్టర్ ఎర్నాప్రగడ తిరుపతిరావుగారి ఉత్తరంలో వారు 'గురిగింజల రంగును మెచ్చుకొనే కోయపడుచుకు ముత్యాల విలువ తెలియకపోవచ్చు' అని వ్రాసి యున్నారు. అంతకు ముందు వ్రాసిన వాక్యాల నాధారంగా తీసికొని చూస్తే ఇక్కడ 'కోయపడుచు' అజ్ఞానాన్ని ఎత్తిచూపేందుకు వాడబడినట్లు విశదమవుతున్నది. అదే ఉత్తరంలో మరొక పేరాలో 'కాని వర్ణాశ్రమ ధర్మమే

శ్రేష్ఠమైన ధర్మమని నమ్మేవారు ఇప్పటికీ కొద్దిమందియైనా వున్నారు' అని అన్నారు.

వర్ణాశ్రమ ధర్మాలను నమ్మేవారు ముత్యాల విలువ తెలిసిన అంతఃపురకాంతలైతే వాటిని నమ్మనివారంతా గురిగింజల రంగును మెచ్చుకొనే కోయపడుచులు కావాలి. ఆయన మాటల ప్రకారం తీసికొన్నా కోయపడుచులే కోకొల్లలే మనదేశంలో! ఆ పడుచు యొక్క బిడ్డడందించిన కావ్యమ్మన కీనాటికీ ఆరాధ్యమేనే! అంతఃపురాల్లోనికి రాగరంజిత రత్నాలెక్కడ నుండి వస్తున్నవి? మట్టిలో నుండి కాదంటారా? వేదాలను మనకందించిన వ్యాసుడు అంతఃపుర కాంత గర్భాన బుట్టినవాడు కాడే!

పోనీ, వారు కారణ జన్ములనుకొంటే, అప్పటి వర్ణస్థితిని యింకను పాటింపవలెననుకొంటే ఎందరు బ్రాహ్మణులు కేవలం వారి వంశపారంపర్య వృత్తులనే ఆధారంగా గొని జీవింపగలరు, ఎందరు క్షత్రియులు రాజ్యాలనేలగలరు ఎందరు వైశ్యులు వ్యాపార వాణిజ్య వ్యవహారాల జోలికి మరెవ్వరినీ రానీయకుండా జాగ్రత్త పడగలరు, ఎందరు శూద్రులు పొలాలదున్ని పండించి మిగతా పనులు చేస్తూ పంచములతో బాటు అగ్రజాతుల వారిని సేవించ గలరు?

భారతాన్ని అన్ని వర్ణాల వారూ పాలించిన సంగతి తెలియనిది కాదు. రాష్ట్రకూటుల పాలనలో బ్రాహ్మణులు వ్యాపార రంగంలో పాత్ర వహించినట్లు చరిత్ర చెబుతున్నది. పేదవారైన బ్రాహ్మలు నాహటంగాను, ఆస్తిపరులనిపించుకొన్నవారు పేహారుల ద్వారానూ వ్యాపార వ్యవహారాలను నడిపించేవారని ఆ చరిత్రే చెబుతున్నది. సనాతనంగా వస్తూన్న వృత్తులనే నమ్ముకొని జీవించడం కష్టమనీ, జీవన భృతిని సంపాదించుటకు న్యాయమైన మార్గమే దైనా అనుసరణీయమేనన్న ఆలోచన తొమ్మిది శతాబ్దాల క్రితమే మన వారికి వచ్చిందంటే అప్పటి నుండి వారూ మరి అందరూ అజ్ఞానులే కావాలి!

మహమ్మదీయులను, క్రైస్తవులను గురించి కూడా ప్రస్తావించినారు తిరుపతిరావుగారు. ఆ మతాల్లో ఒకరు మరొకరికి సేవలు చేయాలన్న సిద్ధాంతాలు లేవు. ముసల్మానులంటే వారిలో మళ్ళీ ఈ కులాల సంగతి లేదు. సయ్యదులు, షేకులూ అందరూ మసీదుకెళ్ళి సమానంగా మోకాళ్ళమీద పడి ప్రార్థిస్తారు. క్రైస్తవుల్లో కాథలిక్కులూ, ప్రొటెస్టెంట్లూ మొదలగు భేదాలు తప్ప, హిందువులలో నుండేనంత కులతత్వం లేదు. కాథలిక్కులు ప్రొటెస్టెంట్లనూ, ప్రొటెస్టెంట్లు కాథలిక్కులనూ అప్పుడప్పుడు ఎత్తిపొడుచుకొనడం మనం వినిందికాదే? అయినా ఎంతమంది హిందూమతాన్ని వీడి క్రైస్తవమతంలో చేరిపోలేదు? ఎందుకని? అందులో చేరిన వారందరూ అజ్ఞానులేనంటారా? జీవన భృతికే కష్టమై హిందూమతాన్ని వీడి పరదేశీయుల తాత్కాలిక ఆదరణను చూచి అందులో చేరినవారు కొందరైతే, హిందూమత సంప్రదాయాలంటే చిరాకెత్తి దాన్ని వీడినవారు మరికొందరు. ఇకపోతే, ఈ వర్ణాశ్రమ ధర్మాన్ని తప్పబడుతున్న వారు హిందువులే. ముసల్మానులూ, క్రైస్తవులూ వారివారి మత విశ్వాసాలను వారే దుయ్యబట్టుకొనుట లేదు. అందుకని ఎవరి 'అంతు' ఎవరూ 'చూచి' ఎక్కడా 'వదల' వలసిన అగత్యం అంతగా కనబడుటలేదు.

డిశంబరు 1977 భారతిలోని ''డాక్టరు భీమారావ్ అంబేద్కర్'' అన్న వ్యాసానికి కూర్చిన ప్రవేశిక నుండి కొన్ని వాక్యాలను ఇక్కడ వుదహరిస్తున్నాను:

''చిరుతప్రాయంలో అనేక అవమానాలకు, బాధలకు[1] గురియైన ఒక వ్యధిత హృదయం సామాజిక అసమానతను కూకటి వ్రే(వే)ళ్ళతో పెకలించేందుకు నడుంకట్టింది. సమాజంలోని అట్టడుగు వ్యక్తులను మహావీరులుగా తయారుచేసింది. మహోద్యమాలను నడిపింది. స్వాతంత్ర్య సంపాదనానంతరము, ఈ దేశపు రాజ్యాంగ రచనా భారాన్నంతా మోసింది. హిందూ ధర్మపరిధులను విస్తరింపజేసి మూఢ హిందూ సమాజానికి ''షాక్'' నే కాక వెలుగును కూడా ప్రసాదించింది...''

ఆ వ్యధిత హృదయం ఎక్కడ నుండి లేచిందంటారు? పదిహారణాల హిందూమతం నుండి కాదంటారా? ఎందుకు ఆ హృదయం ''వ్యధకు'' లోనైందంటారు? ''మూఢ'' విశ్వాసాల వ్యాప్తివల్ల కాదంటారా? ఈనాటి ఆర్థిక వ్యవస్థను దృష్టియందిడుకొని ఆలోచన చేసినప్పుడు ఎందుకూ కొరగానిదనిపించే ప్రాచీన వర్ణవ్యవస్థను సమర్థించే సంప్రదాయం 'పనికివచ్చేదని' భావించే వారంతా అజ్ఞానులేనంటూ, సహజావసరాలను సరకుచేయక, ఉచ్చి స్వర్గాన వున్న కవి సమ్రాట్‌నూ, పనికిరానిదిగా తయారవుతున్న సంప్రదాయాన్నీ 'సమర్థించాలి కనుక సమర్థించాలి' అన్నట్లు, తద్భిన్నంగా పెదవి విప్పేవారిని ఎంత తక్కువగా డాక్టర్ తిరుపతిరావుగారు రూహించినారో తెలుసుకొంటే, ఇంకా ఆ వర్గీయులు తామే మేధావుల మనుకొంటూ మిగతావారి నెంత తేలికగా చూస్తున్నారో విశదమవుతుంది. ఆ వ్యవస్థ అంటే నచ్చనివారు దురుసుగా మాట్లాడితే, వ్రాస్తే, సనాతన ధర్మాలను నిలబెట్టాలనుకునేవారు సంయమనంతో ఎందుకు వ్యవహరించకూడదు? ఎదుటివారు దురుసుగా ప్రవర్తిస్తే మేమూ మాత్రమెందుకు చూపించకూడదూ అనా?

''హిందూ దేశంలో హిందువుల మనుకొనేవారు అధిక సంఖ్యలో ఉన్నారు గనుక...'' అంటూ వ్రాసినారు. వివిధ మతస్థులు ఈ దేశంలో వున్నారు గనుక, వారి మనస్సులను నొప్పించకుండుటకై, హిందువులేదో ఈ దేశంపై ఆధిక్యత కలిగివున్నారన్న భావం కలుగకుండుటకై మనవారు ''హిందూ'' అన్న పదానికి స్వస్తి జెప్పి ''భారత్'' అనే పదాన్ని స్వీకరించాలని చాలకాలంక్రితమే ఒక నిర్ణయానికి రావడం జరిగింది. అటువంటప్పుడు డాక్టర్ రావుగారు యింకా ''హిందూదేశం'' అంటూ వ్రాయడం బాధాకర మైన విషయం.

*శ్రీ పద్మరాజు యానాది రాజు*

# మార్క్సిజానికి వక్రభాష్యం

జూన్ నెల భారతిలో క్రిష్ణారావుగారు మార్క్స్ని యుగ పురుషుడంటూనే ఖూనీ చేశారు. మార్క్సిజం ప్రధాన సూత్రాల పైన ఆయన చేసిన కామెంట్సు కొన్ని అర్ధరహితమయినవి; తప్పుదోవ పట్టించేవి కూడా.

## (1) చారిత్రక భౌతిక వాదం:

మార్క్స్ ఆర్థిక కారణాలు మాత్రమే చరిత్రను నిర్దేశిస్తాయని చెప్పాడని భ్రమించి అందులో ''కొంత అతిశయోక్తి మరికొంత అవాస్తవికత కనిపిస్తాయని'' వ్యాసకర్త అన్నారు. కానీ మార్క్స్ గానీ ఎంగెల్సు గానీ ఎక్కడా ఆర్థిక కారణాలు మాత్రమే చరిత్ర నిర్దేశకాలు అని చెప్పలేదు. పైపెచ్చు తమ సిద్ధాంతానికి కొందరు అలా వక్ర భాష్యం చేస్తున్నారని రాసేయారు. అలాంటి సందర్భాలను కొన్నింటిని ఉదాహరిస్తాను.

''చరిత్రమీద మా దృక్పథం దాని పరిశీలనకు ఒక మార్గదర్శకం మాత్రమే. చరిత్ర మొత్తం తిరిగి కొత్తగా చదవాలి. సమాజం భిన్న దశల ఏర్పాటుకి కారకాలైన పరిస్థితుల్ని క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యాలి.'' [1]

''చరిత్రకు సంబంధించి చిట్టచివరి నిర్ణాయక విషయం వాస్తవ జీవిత ఉత్పత్తి ప్రత్యుత్పత్తులు మాత్రమే (The ultimately determining factor in history is the production and reproduction of real life). ఇంతకు మించి నేను కానీ మార్క్స్ గానీ ఎప్పుడూ చెప్పలేదు. ఒకవేళ ఎవరన్నా దాన్ని వక్రీకరించి ఆర్థిక విషయమే నిర్ణాయక విషయం అని చెప్తే అది కేవలం అర్ధరహితం అస్పష్టం. హాస్యాస్పదం.'' [2]

''రాజకీయ, న్యాయ, తాత్త్విక, మత, సాహిత్య కళాభివృద్ధి ఆర్థికాభివృద్ధి మీద ఆధారపడి వుంటుంది. కానీ ఈ అన్ని రంగాలు కూడా పరస్పర ప్రభావితం చేసుకొంటూ ఆర్థిక పునాదిని కూడా ప్రభావితం చేస్తాయి. కేవలం ఆర్థిక పరిస్థితే ప్రత్యక్షమనీ, తక్కినదంతా అప్రత్యక్షమనీ (ప్రభావరహితమనీ) అనుకోవడం సరికాదు'' [3]

''ప్రకృతి స్వభావాన్ని గూర్చిన జ్ఞానాభివృద్ధి ఆర్థికం గూడా ఒక కారణమైనా మంత్రాలూ, తంత్రాలూ, దేవుళ్ళూ దయ్యాలూ ఇలాంటి వాటన్నింటికి కూడా ఆర్థిక పరమైన కారణాలను వెతకుతూ కూర్చోవడం అనవసరం'' [4]

ఆర్థిక పరమైన కారణాలద్వారా చరిత్రను విశ్లేషించడంవల్ల మానవుడి పని కేవలం యాంత్రికం అనిపిస్తున్నది. అది సరికాదు అన్నారు వ్యాసకర్త. కానీ ఈ క్రింది quotation చూడండి.

''మానవులు తమ చరిత్రను తామే నిర్మించు కొంటారు. అయితే తమను నియమితం చేసే పరిస్థితుల మీద, అప్పటికీ అమలులో ఉన్న వాస్తవ సంబంధాలమీద ఆధారపడి'' [5] మానవుణ్ణి ఏమీ చేతకాని యంత్రంలా వాళ్ళు భావించలేదనడానికి ఈ ఉదాహరణ చాలు. కాకపోతే ఆనాటి పరిస్థితుల ప్రభావం ఆలోచనలపై ఉంటుందన్నారు. భౌతిక పరిస్థితుల ననుసరించి ఆలోచనలుంటాయి అన్నది మార్క్సిజం ప్రధాన సూత్రీకరణల్లో ఒకటి. వ్యాసకర్త చేసిన విమర్శ ఎంగెల్సు చెప్పినట్లు 'చారిత్రక భౌతిక వాదం అన్న పేరులో తన చెత్తనంతా కాగితం మీద పెట్టడమే''. [6]

## వర్గపోరాటం:

ఇది కేవలం ప్రచారం కోసమే మార్క్స్ అన్నాడని ఒక నింద వేశారు. వివిధ కాలాలలో ధనిక, పేదల మధ్య ఈర్ష్యా ద్వేషాలు వున్నా సామాజిక జీవనంలో వీటి సంఘర్షణ పూర్తిగా ఉన్నట్లు మనం ఖచ్చితంగా చెప్పలేం అన్నారు వ్యాసకర్త. కమ్యూనిష్టు పార్టీ ప్రణాళిక' లో ''oppressor and oppressed stood in constant opposition to one another carried on an uninterupted, now hidden now open fight'' [7] అని ఉంది. సంఘర్షణ అనేది ఒక్కొక్క దశలో నిగూఢంగానూ, మరొక్కొక్క దశలో బహిరంగం గానూ జరుగుతున్నదని వాళ్ళే చెప్పారే. తరువాత వ్యాసకర్త ఆరోపించినట్లు మధ్య తరగతి ప్రజలు లేరని మార్క్స్, ఎంగెల్సు ఎక్కడా చెప్పలేదు. వాళ్ళని గురించి అనేక చోట్ల చర్చించారు కూడా. భారతదేశం విషయానికొస్తే కులాల మధ్య కూడా చీలిపోయిందని చెప్పారు. [8] అదీకాక ఈ మధ్యతరగతికి చెందిన వాళ్ళు అని వ్యాసకర్త చెప్పే విద్యార్థులు, అధ్యాపకులు మొదలయిన వాళ్ళలో మళ్ళీ శ్రామిక వర్గ పక్షపాతులు, బూర్జువా వర్గ పక్షపాతులు అనే విభజన వుంది. పీడకులకీ పీడితులకీ మధ్యజరిగే సంఘర్షణలో ఏ వర్గాభిమానులు ఆ వర్గం వైపు వెళ్ళిపోతారు. అంటే తటస్థ వర్గం వుండే ప్రసక్తేలేదు కాబట్టీ మానవాళి రెండు వర్గాలుగా చీలిపోతుందని మార్క్స్ అన్నాడు. అది గమనించకపోతే ఎట్లా? వ్యాసకర్త మళ్ళీ ఆరోపించినట్లుగా ఒక వ్యక్తి ఎల్లకాలం ఒకే వర్గానికి చెంది ఉంటాడని ఏ మార్క్సిస్టూ చెప్పడు. స్వభావం అనేది ఆ వ్యక్తి వున్న వర్గానికి చెందింది అయివుంటుంది కాని వ్యక్తిమీద ఆధారపడి ఉండదు. ఈనాడు పేదవాడుగా వున్నవాడు రేపు దొంగనోట్ల వ్యాపారంలో కోటీశ్వరుడు కావచ్చు. అప్పుడు అతనిది బూర్జువా స్వభావమే. ఇది మార్క్సిజం చెప్పే విషయం మరి వ్యాసకర్త చూపించే లోపం ఏ సిద్ధాంతానికి సంబంధించింది?

పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన రాజ్యాలలోని శ్రామిక వర్గం వెనుకబడిన సమాజంలోని శ్రామికవర్గంకంటే మెరుగ్గా ఉందంట. అందువల్ల ప్రతి రాజ్యంలో ప్రజలు రెండువర్గాలుగా విడిపోతారనడం సమంజసం కాదంట. సరే పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన అమెరికానే పరిశీలిద్దాం. అక్కడ ఈనాడు ఎంగిలి మెతుకులకోసం కుక్కలతో కాట్లాడేవాళ్ళు 20 లక్షలపైగా వున్నారు. 1975 నాటికి నిరుద్యోగులు 8 కోట్లు (ఇప్పుడు పది కావచ్చు) కార్మిక సంక్షేమ చట్టాలు అందరు కార్మికులకీ వర్తిం

వు. 75 శాతం వ్యవసాయ కార్మికులు దరిద్రంతో బాధ పడు తున్నారు. మరోకతట్టు సంపన్నుల హర్మ్యాలు ఆకాశంవైపు దూసుకుపోతున్నాయి[9] స్పష్టంగా వర్గాలు కనిపించడంలేదా? (చూడగలిగితే.)

## వర్గరహిత రాజ్యరహిత సమాజం

వాస్తవానికి ఈ శీర్షికకింద వెలువరించాల్సిన అభిప్రాయా లను వేరే శీర్షికకింద వెలువరించారు వ్యాసకర్త. కానీ నేను ఈ శీర్షిక కిందనే సమాధానం ఇస్తున్నాను.

వర్గాలు పోవాల్సిందిపోయి కొత్త వర్గాలేర్పడుతున్నాయట సోషలిస్టు దేశాల్లో. (1) జీవన విధానంలో (2) వేతనాల విష యంలో: ఉదాహరణకి చైనాని తీసుకొందాం. అక్కడవున్న "పని + చదువు" (Part work Part studies) అన్న విద్యా విధానంవల్ల విద్యార్థులు, సాంకేతిక నిపుణులు, ఉపాధ్యాయులూ అందరూ తప్పనిసరిగా శ్రామికవర్గంలో కలిసి పనిచెయ్యాల్సిందే.[10] కాబట్టి జీవన విధానంలో తేడాలు లేవనేది సుస్పష్టం. ఇక వేత నాల విషయం తీసుకొంటే విప్లవం రావడంతోటే అందరికీ ఒకే వేతనాలు ఇస్తాసని ఏ సోషలిస్టు దేశమూ చెప్పలేదు. మొదట కనీస మైన గ్యారంటీని కల్పించి తర్వాత జీతాలమధ్యవున్న అంతరాలని క్రమేపీ తగ్గించుకుంటూ వస్తుంది. పూర్తిగా సమంకావడానికి కొంతకాలం పడుతుంది. మొన్ననే (పోయిన సంవత్సరం) గదా జన చైనా వేతనాల అంతరాలను సవరించింది. ఇక రష్యాని తీసికొంటే ఒక కార్మికుడు ఒక పుపాధ్యాయుడికన్నా ఎక్కువజీతం తీసికొనే వాతావరణం అక్కడవుంది. మరి వర్గాలు పెరుగుతుందెక్కడ?

ఒక రాజ్యరహిత సమాజం రావడం ఎండమావులే అని ఒక పెట్టూర్పు విడిచారు పాపం. (70 సంవత్సరాలు గడిచినా రష్యాలో రాలేదుగదా అని) కానీ కొన్నివేల సంవత్సరాల మానవ జీవితంలో 70 సంవత్సరాలేపాటి? అందులోనూ 30 సంవత్సరాలకు పైగా అనేక ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సొచ్చింది. మిగిలింది 40 సంవత్స రాలకు లోపే. అదీగాక చుట్టూ పెట్టుబడిదారీ దేశాలు అదను చిక్కితే మింగేద్దామని చూస్తుంటే ఈ దశలో రాజ్యరహిత సమాజం ఎలా ఏర్పడుతుంది? ప్రపంచమంతా సోషలిస్టు సమాజం ఏర్పడి అది ఒక దిశకి అభివృద్ధి చెందినప్పుడు అది సాధ్యం. ఇది సిద్ధాంత అవగాహనవున్న ప్రతిఒక్కళ్ళకీ తెలిసిన విషయమే.

ఇన్ని విమర్శలుచేసి, అసలు చెప్పవలసిన విషయాన్ని చెప్ప లేకపోయారు. అదేమిటంటే విప్లవమనేది ప్రపంచమంతటా ఒకే సారి వస్తుందని, విడివిడిగా ఒక్కొక్క దేశంలోరాదు అన్నారు మార్క్స్, ఎంగెల్సు. కనీసం పెట్టుబడిదారీ విధానం బాగా అభి వృద్ధి చెందిన అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ దేశాల్లో మొదట వచ్చి తర్వాత వ్యాపిస్తుందని అభిప్రాయపడ్డారు.[11] పారిస్ కమ్యూన్ అనుభవాన్ని పురస్కరించుకొని ఏదో ఒక్క దేశంలో విప్లవం వచ్చినా పెట్టుబడిదారీ ప్రపంచం దాన్ని మననియ్యదని భావించి మార్క్స్, ఎంగెల్సులు అలా సూత్రీకరించారు. కానీ తరువాతికాలంలో లెనిన్ రష్యాలో విప్లవంతెచ్చి వాళ్ళ ఊహల్ని తారుమారు చేశాడు. విప్లవం ఒక్క దేశంలో కూడా సాధ్యమే అని నిరూపించాడు.

## గ్రంథ సూచిక


| | | |
|---|---|---|
| 1. | Marx and Engels Moscow 1975. | 'Selected correspondance' P. 393–94. |
| 2. | Marx and Engels Moscow 1975. | 'Selected correspondance' P. 394–95. |
| 3. | Marx and Engels Vol. 3, Moscow 1973. | 'Selected works' P. 502–03. |
| 4. | Marx and Engels Moscow 1975. | 'Selected correspondance' P. 400–01. |
| 5. | Marx and Engels Vol. 3, Moscow 1973. | 'Selected works' P. 502–03 |
| 6. | Marx and Engels Moscow 1975. | 'Selected correspondance' P. 393–94. |
| 7. | Marx and Engels Moscow 1975. | 'Manifesto of the communist party P. 41. |
| 8. | Marx and Engels Mascow 1975. | 'Articles on Britain' P. 279. |
| 9 | 'ప్రజాశక్తి' | 29–1–78. P. 14–17. |
| 10. | Rewi Alley Peking 1973. | "Travels in China" P. 547–48. |
| 11. | Engels Peking 1977. | Principles of Communist. P. 17. |


శ్రీ ఎం. వి రమణయ్య

## లేఖ

## రూపసామ్యం

నా వ్యాసం నాగిరాజు వంటి పండితులకి 'మెదడుకి మేత'ని కల్పించినందుకు సంతోషం. ఆయన వివరించిన 'చిన్న పొరపాటు' ఎలా దొర్లిందో నాకూ వింతగానే వుంది. నా లు గే ళ్ళ నాటి "రఫ్ కాపీ" చూస్తే అందులో అలాలేదు. ఎత్తి రాయడంలో జరిగిన 'స్లిప్' అయ్యుంటుంది. ఈ పొరపాటు గు రి ం చి చెప్పవే 'భారతికి ఉత్తరం రాసినట్టు గుర్తు — బహుశా అంద లేదేమో! ఈ పొరపాటు వ్యాకరణ సూత్రాన్ని సరిగా అర్థం చేసుకోకపోవడంవల్ల వచ్చింది కాదని నాగరాజుగారు గుర్తిస్తే చాలు.

వ్యావహారికంలో 'రన్నండి', 'తిన్నండి', 'విన్నారు' – ఇలా వుంటాయి గాని రనండి, తినండి (Thin), వినండి (Win) అని వుంటాయా?

– శ్రీ ద్వా. నా. శాస్త్రి

# గ్రంథ విమర్శలు

## నాటికా ద్వయం

### (1) అహం బ్రహ్మ

[రచన: శ్రీ. ఎస్. మునిసుందరం. క్రౌన్ సైజు టైటిల్ పేజీతో సహా 40 పుటలు. వెల రూ. 2. పంపిణీ – విశ్వప్రభ పబ్లిషింగ్ హౌస్, నేంద్రగుంట, చిత్తూరు జిల్లా.]

### (2) మూడు నాటికలు

[రచయిత : శ్రీ పోతుకూచి సాంబశివరావు, క్రౌన్ సైజు 80 పుటలు. వెల రూ 3–50. విశ్వ సాహితి ప్రచురణ. ప్రతులకు – పోతుకూచి ఏజన్సీస్, 208. న్యూ బోయిగూడ, సికింద్రాబాదు ]

(1) 'ధనమూల మిదంజగత్తని ప్రసిద్ధి ఉండనే ఉన్నది. ధనవంతుడికి అందరూ లొంగిపోతారు. తడు "అహం బ్రహ్మ" అని అనుకుంటాడు. అతనికి న్యాయాన్యాయాల విచక్షణ, యుక్తాయుక్త వివేకం ఉండదు. తెలివిలేనివారూ, తెలివైనవారు, రౌడీలు, హత్య చేసేవారూ – అందరూ ఆ "అహం బ్రహ్మ" కు దాసానుదాసులే. ఈ విషయమే యిందులో వివిధ పాత్రల ద్వారా వివరించబడింది. జన సమూహమంతా ధనిక పక్షమే! ఒక్క కవి మాత్రం ఆ ధనికునికి లొంగనట్లు ఈ నాటికలో చూపబడింది. రచయిత కవి పక్షపాతి కావడంవల్ల ఈ రీతిని చూపబడిందో యేమో! కవి తరచుగా యితరుల్ని చంపేస్తానని అంటాడు! అది నిజంగా చంపడం కాదనీ, ఆయా వ్యక్తులలోని దుఃస్వభావాలనూ, సంకుచితత్వాన్నీ చంపడమే అతని ఉద్దేశమనీ తోస్తున్నది. ఇందులో అసలు నాయకుడైన వరహావతారం తక్కిన వార్నందరినీ తన చుట్టూ తిరుగుతూ భజన చేసేటట్టున్న కథాంశం, తదనుగుణంగా ఉన్న ముఖ చిత్రం బాగా ఉన్నవి. ఈ నాటిక మూలంగా రచయిత లోకంలోని అవినీతినీ, కుళ్ళునూ, డబ్బుకోసం గడ్డి తినే మేధావుల ప్రవర్తననూ వెల్లడించారు.

ఇది యిదివరలో ఒక ప్రముఖ వార పత్రికలో ప్రచురితమై, రంగస్థలానికి కూడా ఎక్కి మన్ననలను అందుకొన్నది. సమాజం, స్వార్థం, అవినీతి, అన్యాయం మొదలైన వాటి చుట్టూ పరిభ్రమిస్తూ వంతపాట సాగిస్తే ఎలాంటి అనర్థాలు కలుగుతాయో ఈ చిన్న నాటిక అనే అద్దంలో చూపి, రచయిత కృతకృత్యుడైనట్లు మధురాంతకం రాజారాంగారు తమ ముందు మాటలో చెప్తున్నారు. అది ఒప్పుకోదగిన అంశమే!

(2) 'మూడు నాటిక'లను కూర్చిన రచయిత–పోతుకూచి వారు నాటక రంగంలో సుమారు ముప్ఫయి సంవత్సరాల అనుభవంలో వివిధ కార్యక్రమాలు నిర్వహించారు. నాటక కర్తగా, నటులుగా, ప్రదర్శకులుగా, రేడియో నాటక కర్తగా, ఆంధ్ర నాటక కళా పరిషత్తు మహా సభల నిర్వాహకులుగా, పోటీలలో నిర్ణేతగా, 'నాట్యకళ' సహాయ సంపాదకులుగా ఉండి పేరు తెచ్చుకున్నారు. క్రొత్త ప్రయోగాలు ఆధారంగా ఈ నాటికలు వ్రాశారు.

"వన్ - టూ – త్రీ – ఫోర్, ఏం ప్రేమలో ఏం గొడవలో, అంతరించే అంతరాలు" అనేవి ఈ మూడు నాటికలున్నూ. ఇందులో మొదటిది సాహితీ విద్యాలయం నిర్వహించిన నాటిక శిక్షణ తరగతుల్లో పాల్గొన్న విద్యార్థులు ప్రదర్శించినది. మూడో నాటిక – అంతరించే అంతరాలు – రేడియోలో ప్రదర్శించిన నాటిక. రెండవ నాటిక యింకా ప్రదర్శనను పొందలేదు.

మొదటి నాటికలో శోభ, తన బర్త్‌డే పార్టీకి వచ్చిన నలుగురితోనూ కలిసి డాన్సుచేసి, ఎంతగానో కలిసి మెలిసి వుండి, వారికి ఆశను కల్పించింది. తాను వన్, టూ, త్రీ, ఫోర్ అని చెప్పగా – రాత్రి ఆయా గంటల సమయంలో వచ్చిన వారికి తగిన శాస్తి చేసి, చివరికి వారిచే తనే హత్య చెయ్యబడుతుంది. రౌడీ అయిన ఆంజనేయులు దగ్గరే కత్తి వుండవచ్చునుగాని – ఆ సమయంలో యితరుల వద్ద కత్తులుండడానికి అవకాశం కనబడదు. చివరకు ఆమె మరణానికి రౌడీయే పశ్చాత్తపపడతాడు. ఇతరుల శుష్క హృదయం దీనివల్ల వ్యక్తమవుతున్నది. ఇందలి కథ – తన్ను నిర్బంధించిన నలుగురినీ నాలుగు జాములకు రమ్మని చెప్పి, మోసగించిన పాతకాలపు పతివ్రత కథ స్ఫురణకు వస్తుంది. విశేషమేమంటే – ఆ కథలో ఆ పతివ్రత జయిస్తుంది. ఈ కథలో శోభ ఓడిపోయి – ప్రాణాలు పోగొట్టుకొంటుంది. ఇదే యిందలి నూతనత్వమేమో!

ఏం ప్రేమలో – ఏం గొడవలో' అనే రెండవ నాటిక హాస్య ప్రధానమైనదట! హాస్యం మాటకేమిగాని యిది అసభ్యమైన నాటికగా కానవస్తున్నది. వ్యక్తుల ప్రవర్తనలు చాలా విచిత్రంగా కానవస్తాయి. ప్రేయసికోసం పెనగులాడే కామం తనకు తమ్మిఅంటే ఏమిటో తెలియదంటాడు. అతని బావగారు – అక్క పెనిమిటి, భార్యతోడి తన శృంగార విలాసాన్ని గురించి వివరిస్తూ "అదేనోయి అధరారుణామృతం – అందించగా – ఏదో అయిపోయి – 'మీ రెంత మంచివారండీ!' అని వాటేసుకుని ఒకటే పట్టు...ఒకటే పట్టు –వదలదు యింకా...ఉడుం పట్టు. దానికి అలసట వస్తేకాని వదలదు. ఈలోపుగా నేను నీరసించిపోయి దిగాలుగా భారంగా పడిపోతాను" (పేజి 28) అని చెప్పడం యే సభ్యలోకమూ హర్షించదు.

కారం తన సేవకుడితో తన వెనుకటి శృంగారాన్ని వివరిస్తూ పలికిన మాటలు వినండి. "నాకెంతకోపమో, దాని కంత శాంతం

కదా! ఇట్టే నన్ను నవ్వించేది. ఎంత కోపంతో ఉన్నా సరే నాకు కోపం వచ్చినప్పుడల్లా వెనక చాటుగా వచ్చి కితకితలు పెట్టేది! ఇంక పొట్ట పగిలేటట్లు నవ్వలేక ఏడ్చేవాణ్ణి. నవ్వు ఆగాక వేడి వేడి పాలు తెచ్చి - 'రండి శృంగార శయ్యకు' అని దగ్గరికి తీసుకొని, గదిపి, తడిపి చూసి, కూరిమితో ఒళ్లురాసి మెల్లిగా దగ్గర పడుకుంటే ఏమిటో స్వర్గంలా వుండేదిరా.'' (పుట 37) ఈ ప్రసంగం ఎంత అసభ్యంగా ఉందో గమనించవచ్చు. ఈ కారం (మామ) శని (అల్లుడు) దొందుకు దొందే! అన్నట్లున్నారు. ఇట్టి నాటిక ఎందరు ప్రేక్షకుల మనస్సును ఆకర్షిస్తుందో మరి!

'అంతరించే అంతరాలు' లో వివిధ వ్యక్తుల మనోభావాలు, లేత మనస్సులలోని ఊహాపోహలు, అంతరాలు నశించిన సర్వవర్ణ సమానత్వం, ఆసుపత్రుల్లో జరుగుతున్న దుర న్యాయాలు, నర్సుల ప్రవర్తన చూపబడినవి. సుపత్రిలో నర్సునేసర్వాధికారమైనట్లు, ఆపరేషన్ కూడా ఆ నర్సే జరుపుతున్నట్లు చెప్పడం అస్వాభావికంగా ఉంది. డాక్టర్ ప్రసక్తే లేదు.

బావను వరించి లక్ష్మి చివరను పాడిన వేడుక పాట
''బావా బావా పన్నీరు'' లో ''ముకామంచం
వేశారు — మూరూ గుద్దులు గుద్దారు''

అనేదాన్ని రచయిత 'నాలుగు గుద్దులు' గా మార్చడం వల్ల రైమ్గూ, రక్తీ చెడిపోయాయి.

రచయిత నాటక రంగంలో గొప్ప అనుభవజ్ఞులే కావచ్చు. ఎన్నో రసవంతాలైన నాటికలు రచించి ఉండవచ్చు. కాని యీ ''మూడు నాటికలు'' మాత్రం వారి అనుభవానికి తగినట్లు లేవని చెప్పవలసివస్తున్నది.

# అమృత మార్గము

[రచయిత : శ్రీ మోక్షానందస్వామి. పాకెట్ సైజు 10+83 పుటలు. వెల రూ. 2=75. ప్రకాశకులు — జననీ అద్వైతాశ్రమము. తిమ్మాపూర్, వయా మోర్తాడు, ఆర్మూర్ తాలూకా, నిజామాబాద్ జిల్లా.]

ముక్తి సాధనకు అనేక మార్గాలున్నవి. వాటిలో యోగ మార్గం ముఖ్యమైనది. యోగ సాధనచే కుండలినీశక్తిని మేల్కొల్పి షట్కమలాలను వేధించుకొని పరమాత్మతో ఐక్యాన్ని పొందజేసేదే యోగమార్గం. సామాన్యులు జగత్తు మిధ్య అనే భావాన్ని అవగాహన చేసుకుని, మనస్సును జయించడం సులభం కాదు. సంసారంలో ఉండే యోగ మార్గాన మోక్షాన్ని సంపాదించడం సాధ్యమవుతుందని చెప్పడానికి కొందరు మహాత్ములే దృష్టాంతం.

రచయితకు గురువైన శ్రీ నారాయణ మహర్షి నిజామాబాదులోని మోర్తాడ్ గ్రామవాసి. ఒకవైపు గృహస్థాశ్రమంలో ఉంటూనే పరతత్త్వ శిఖరాలను అధిరోహించిన మహనీయులు. ఆయన అనుగ్రహం వల్లనే రచయిత అయిన మోక్షానందస్వామికి యోగమార్గ రహస్యాలు అవగతమయాయి. ఈయన ఎలిఫెంటా కొండపై ధ్యాన నిమగ్నులై, సాధనచేసి, కార్యసిద్ధిని పొందారు. యోగ రహస్యాలీయనకు కరతలామలకాలు. తాము సత్యాలని తెలుసుకున్న యోగ పద్ధతులను సులభంగా అందరికీ అర్థమయే రీతిని యీ చిన్న పుస్తకంలో వివరించారు.

ఇందులో 11 ప్రకరణాలున్నవి. వాటిలో యోగ మార్గాన్ని గురించిన విషయాలున్నవి. తొలి ప్రకరణంలో మానవులకు యోగ సాధన చేయడానికి చేసిన ప్రోత్సాహం కానవస్తున్నది. రెండవ దానిలో సత్వరజస్తమోగుణాలు, పంచభూతాలు, ఇంద్రియాలు మొదలైన వాటి స్వరూప స్వభావాంశాదుల వివరణం ఉన్నది. మూడవ ప్రకరణం యోగంలోని కమలాలను సచిత్రంగా వివరిస్తున్నది. నాల్గవ దానిలో క్షేత్ర, క్షేత్రజ్ఞులను గురించి సప్రమాణంగా తెలుపబడింది. తర్వాతి దానిలో గురువును గురించీ, ఆ తర్వాతి దానిలో దివ్య జననిని గురించి ఉన్నది. సప్తమ ప్రకరణంలో యోగ సాధనకు అర్హతలు, తర్వాతి దానిలో సాధనా విధానం, తొమ్మిదవ ప్రకరణంలో యోగ సాధకుని ప్రాథమికానుభవాలు స్పష్టపరచబడినవి. పదవ ప్రకరణం నుండి యోగానుభూతి ఎట్టిదో తెలుసుకోవచ్చును. చివరి ప్రకరణం కర్మాచరణం గురించి హెచ్చరిస్తున్నది. ఈ విధంగా సులభ పద్ధతిలో యోగ మార్గాన్ని గురించి తెలుసుకొనుటకు ఉపయోగిస్తున్న యీ పుస్తకం బాలురకు బాల బోధ వంటిది దీనిని చదివితే పెద్ద పెద్ద యోగశాస్త్ర గ్రంథాలను సమన్వయం చేసుకొనుటకు తగిన ఆసక్తి లభించగలదు. నిజంగా ఇది అమృత మార్గాన్నే చూపిస్తున్నది.

రచన, వివరణ సక్రమంగా సాగాయి. కాని ముద్రణ విషయానికి తగినట్లు లేదు. ఇట్టి విషయాలను చదవడానికి గ్రంథ స్వరూపం కొంత ఆకర్షకంగా ఉండాలి. దోష రహితంగానూ ఉండాలి. అవి లేనపుడు పఠనాసక్తి సంకుచితమైపోతుంది. మరి ముద్రణ కయినా మంచి ప్రెస్సును చూడడం అవసరం.

*"ఆంగీరస"*

# "కయిత నా దయిత"

(రచన : 'పఠాభి', పుటలు : 152 — వెల రూ 8/— ప్రచురణ : వర్ధమాన సమాజము—టౌన్ హాలు—నెల్లూరు.)

'వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాలనడుం విరక్కొట్టే అసాంభావ కవి'గా ఆనాడు పేరు తెచ్చుకున్న పఠాభి, ఈనాటికి తన మరో కవితా సంపుటి 'కయిత నా దయిత' అనే పేరుతో వెలువరించారు. అయితే ఈ సంపుటిలోని కయితలన్నీ ఆనాటివే అంటే నలభై సంవత్సరాల పూర్వంనాడే 'ఫిడేలు—రాగాలడజన్'కు ముందే వ్రాసినవి.

శ్రీ శ్రీ సమకాలికుడిగా—సమవయస్కుడిగా పఠాభి 1939 లోనే 'ఫిడేలు రాగాల'ను ప్రపంచానికి వినిపించారు. ఆయనకు పూర్వమే శ్రీ శ్రీ కవితలు రచించినా 'మహా ప్రస్థానం' 1950

నాటికిగాని పుస్తక రూపంలో వెలుగుచూడలేదు. ఆమధ్య కాలంలో పఠాభి – శ్రీశ్రీల ప్రభావాల నడుమ కొట్టుమిట్టాడిన ఆరుద్ర చివరికి 'పఠాభి' అంత్యప్రాసల ప్రయోగాలకే అంకితమై, ఆయన శిష్యుడిగా మిగిలిపోయారు. అందువల్లనే ఆరుద్ర ఈ సంపుటానికి 'గోరంత కృతజ్ఞత' తెలుపుకుంటూ పీఠిక వ్రాసి 'ఒకరకంగా గురు దక్షిణ సమర్పించుకున్నారు'

'ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రయోగవాదం సాధించిన విజయాలకూ ఈ కవితలకు సంబంధం ఉండబట్టి' పీఠిక వ్రాయడం తనకు గర్వంగా వుందని ఆరుద్ర సంతోషం వెలిబుచ్చారు. అయితే పఠాభి కయితలను ఈ సంపుటిలో ఆమూలాగ్రం చదివితే వస్తువు రీత్యా అక్కడక్కడ ఏవో కొన్ని ఆధునిక ధోరణులు వుండవచ్చు కాని కవితా రూపంలో మాత్రం ప్రయోగ వాదం సాధించిన విజయాలకు ఎలాంటి సంబంధంలేదు. ఈ కవిత్వాన్ని ఎదివి ఆరుద్ర నలభై ఏళ్ళ క్రితం గర్వించి వుంటే అర్థం వుండేది. కాని ఈనాడు అనేక ప్రయోగ దశలుదాటి, వస్తువులో రూపంలో తెలుగు కవిత్వం విప్లవకరమైన పరిణామాన్ని సాధించిన ఈ దశలో, పఠాభి కయితలు ఆనాటి ముసుగు దయితలుగానే మిగిలి ఈనాటి తెలుగు కవితా పరిశోధకులకు అందుబాటులోకి వచ్చాయి.

''కయిత నా దయిత, మన్మనోహారిణి భావాంబర విహారిణి, నా బ్రతుకు మబ్బుల్లో విద్యుల్లత, నా మోడు జీవితములో ప్రపుల్లత, నా రక్తమున తీవ్రత జీవన దేవత, నా రాణి వాణి'' అంటూ కవిత్వాన్ని తన నెచ్చెలిగా – ప్రేయురాలిగా స్వీకరించిన పఠాభికి తన బాధలను ఉపశమింపచేసేది మాత్రమే కవిత్వం. అందువల్లనే ''ఏకాకిగ వసుధ – నుంటకు దుస్సహ విరహంపు మంటకు భీతిల్లిన కరుణ జీవిని, నీదు హస్తము నిటు నా కయి యందు నుంపుము– సఖీ !'' అని ఆయన కవితా కన్యను వేడుకుంటున్నాడు. ఆయన ప్రధాన సమస్య 'విరహంపు మంట'. ఆ మంటను చల్లార్చడానికి ఆయనను కవిత 'దివ్య మోహిని'గా ఆవహించాలి తప్ప 'గేహిని' గా జీవిత సహభాగిని కాకూడదు.

'......పువు తావులు నిండిన పున్నమ వెసలందు; చిక్కని రసాల కిసాల నికుంజములందు సరసిజ దళ పుంజములందు, సరసు అందు, చక్కని తీరములందు, భూమ్యాకాశములందు సుందరి ! నీ కోసము అనంతముగ నా పరిశోధన అది జన్మ జన్మాల సాధన' అంటూ చక్కని కవితాధారతో తన కవితను 'అరూప సుందరి' గా ఆరాధించిన పఠాభి భావనలో, పద్యం నడకలో ఆనాటి భావ కవుల్లోకి చేరిపోలారు కాని, ప్రయోగ శిల్పా, ఆధునిక చింతన రీత్యా ఆయన ఇటు అభ్యుదయ కవుల్లోకి లేదా ప్రయోగవాద కవుల్లోకి ఏమాత్రం చేరలేరు. ఇక ప్రయోగశిల్పా చూస్తే అంత్యప్రాసల్లో, ఆలోచనల్లో ఆరుద్ర ముందంజవేసి గురువును మించిన శిష్యులైనారు. కాని ఆనాడే శ్రీశ్రీ 'కవితా ! ఓ కవితా' అనే మహోన్నతా మానవతావేశంతో తన కవితను ''నక్షత్రాంతర్నిబిడ నిఖిల గానం, భూకంపాలు, ప్రభుత్వ పతనాలు, విప్లవం, యుద్ధం అన్నీ నీ చైతన్యం ! నీ విశ్వరూప సాక్షాత్కారం !''గా సర్వ లోకాల ఆవేదనను – తెరుగుబాటును వ్యక్తం చేసారు. ఆధునికతకు, ప్రయోగానికి, సామాజిక ప్రయోజనానికి శక్తివంతమైన అభివ్యక్తికి శ్రీశ్రీ ప్రతినిధిగా నిలిచారు. కాని పఠాభి మాత్రం సంవిధాన చాతుర్యంలో, మాత్రా ఛందస్సులను ఉపయోగించటంలో భావ కవుల్లో – ఒకరిగా మాత్రమే మిగిలిపోతారు. ఆరుద్ర స్వయంగా అంగీకరించినట్టు ''శ్రీశ్రీ లో కవిత సాంఘిక చైతన్య ఫణాలు విప్పిన కుండలినీ శక్తి, పఠాభిలో కయిత 'భావనా రాజ్య పాలిని'గా మిగిలిపోయింది.''

1935–37 నాటి పఠాభి శాంతినికేతన్‌లో టాగోర్ కవితాశ్రయంలో, సిలోన్ ఆ తర్వాత యూరోప్ దేశాల పర్యటనలో తన అనుభవాల 'ఆత్మాశ్రయ ధోరణి' లోనే చెప్పిపోయారు తప్ప ఆధునిక ఆంధ్ర కవిత్వానికి ప్రయోగరీత్యా సమకూర్చింది స్వల్పమే. సిలోనుపిల్ల, స్కాచిపిల్ల, ఎయినా యువతి, హవాయి కడుతీయు వాయ పడతి, రజస్వల అనే కయితా గయితలు ఆయన శృంగారాభిరుచికి అభివ్యక్తి తార్కాణాలు మాత్రమే. కాని ఆరుద్ర అంటున్నట్టు ఈ కవితా సంపుటిలో ('విపూత్న సంవిధాన ప్రయోగ ప్రయత్నాలు కనపడతాయి') ఎక్కడా విపూత్న ప్రయోగాలు కనపడలేదు. కనీసం 'ఫిడేలు రాగాల డజన్' లో వున్న అంత్యప్రాసల సర్కస్ ఫీట్లు కూడా ఇందులో లేవు. పాత ధోరణిలో 'అష్టవిధ నాయికా లక్షణాలను' రకరకాలు అంత్యప్రాసల పద్యాలుల్లో మురిసిపోడం తప్ప మరే 'వినూత్న'త గోచరించదు.

'విరహాంబుధి లో మునిగిన పఠాభికి మన్మధుడి వసంతుడి వివాదాలే దర్శన మిచ్చాయి. 'ప్రణయాభిషేకము' లో రోమియో జులియట్, శాకుంతల, రామాయణప్రేమగాధ, గిరికప్రత్యయం, వరూధిని మృదుపదాలు మొదలైన విరహశృంగార సాంప్రదాయాలు పఠాభికి 'బాహు పంజరమ్ములోన ప్రణయ రాజ్య మహీజాని పదవి నిచ్చి' ఎరింపచేసాయి.

'జాబిల్లి', 'బిచుకి'అనే రెండు కవితా ఖండికల్లో మాత్రం వినూత్న సంవిధానం – ప్రయోగపరత్వం కనపడతాయి. ''పిడిలేని కొడవలి, ఒక్క ఈక, కుక్కతోక, పగిలిపోయిన చేగాజుముక్క, ఎదలు జబ్బకొచ్చిక్కిన, కావడి, కాగితపడవ'' మొదలైన వాస్తవాలుగా 'జాబిల్లి' కవితగా మొలిచింది. ''నక్కసండ్లు నములబడ్డ శవము చెలిక పఘున పర్వునుదయకాంతి కనక జాలిక'' అంటూ బీద బాలిక చినిగిన పాత గుడ్డ పేలికగా నడుచుచున్నదని ' పుష్య మాస రాత్రి కాలిక శీతమందమంగి యుంది శవము పోలిక'' అని బిచుకి దీనరూపాన్ని చిత్రిస్తారు. సహజంగానే ఇక్కడ ఆధునిక కవితాభిమానులకు శ్రీశ్రీ రచించిన 'భిక్షు వర్షీయసి', 'బహుళ పంచమి జ్యోత్స్న' ఖండికలు జ్ఞాపకం వస్తాయి.

ఈ సంపుటిలో రవీంద్రునికి, హరీంద్రునికి, షెల్లీకి, షేక్స్పియర్‌కు, హెర్రిక్‌కు, రాబర్ట్ గ్రేవ్స్‌కు పఠాభి చేసిన కొన్ని తెలుగు అనువాదాలు కూడా వున్నాయి. హరీన్ ప్రసిద్ధ గీతిక ''ఘరూహావా''కు అనువాదం ఉత్తేజకరంగాలేదు. 'ఉదాయింతుం సదా హూ జండా' అనడం ఎబ్బెట్టుగా వుంది.

ఆయన ఆశించినట్టు — "ఈ పుస్తక ప్రచురణవల్ల ఆధునికాంధ్ర కవిత్వ పరిణామక్రమ చరిత్రలో కొన్ని లోపించిన ఘట్టాలు పూరించడానికి అవకాశం" కలిగితే కలుగవచ్చు. ఇక 'సంవిధానంలో మార్పు అన్నది కవితా వస్తువులో మార్పు కోసమే' అని చెప్పిన పఠాభి - సంఘంలో మార్పును వాంఛించాలని కాకుండా కేవలం తన వ్యక్తిగత 'వాంఛ'కు మాత్రమే అభివ్యక్తి నిచ్చారు. లోహియా సోషలిజం ప్రభావంలో వుంటూ కూడా ఆయనముందు ఆ తర్వాత కూడా ఈ కుళ్ళిన దోపిడీవ్యవస్థ మార్పుకోసం ఎలాంటి విలక్షణ ప్రయత్నం తన కవిత్వంలో చేయలేదు. పఠాభి తన "ఫిడేలు రాగాలు"కు 1972లో ఇంగ్లీషు వ్రాసిన పీఠికలో ఇలా అన్నారు:

"Only out of friction can progress be achieved. This also explains why I wrote all the poems in first person singular. Buffoonary, egoism and sex were all part of my arsenal." ఆనాటి ఛాందసులకు ఏదో ఒక చిన్న షాక్ ఇవ్వాలని పఠాభి తన కవితా యుద్ధాగారం లోంచి అంత్యప్రాసల ఆయుధాలు విసిరారు. అయితే అవి బఫూనరి, అహంభావం, సెక్స్ అనే ఆయుధాలు కాబట్టే కేవలం సంవిధానం కోసమే సంవిధానం లేదా ప్రయోగం కోసమే ప్రయోగంగా నిలిచిపోయి 'కొంటెతనపు భావాల'గా మిగిలిపోయాయి. చివరికి ఏదో 'అహంభావపు కవి'గా పేరు తెచ్చుకున్న ఆయన కవిత్వంలో మాత్రం యధార్థంగా 'భావకవి' మాత్రమే! ఆయన 'అంత్యప్రాసల సర్వస్వం' భావ కవితా యుగములోని అంతిమదశలో 'ప్రయోగవాద విజయకేతనం' కావొచ్చునేమో, కాని ఆధునిక కవిత్వానికి మాత్రం వస్తువులో, రూపంలో అవి అక్షరాల నలభై సంవత్సరాల వెనుక భావ కవితాంబరంలోనే తేలిపోతున్నాయి.

— నిఖిల్

## జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య (ఆంధ్రప్రదేశ్) ప్రణాళిక (ముసాయిదా)

33 పేజీలుగల ఈ చిన్న పొత్తంలో ఈ సంస్థ లక్ష్యాలను పొందుపర్చారు. ప్రజాసాహిత్యమూ, కళలూ — ప్రజావ్యతిరేక సాహిత్యమూ, కళలూ, ప్రజాసంస్కృతి ప్రజావ్యతిరేక సంస్కృతి, నేటిదోపిడీ సంస్కృతి- దాని పునాదులు, జనసాహితీ, సాంస్కృతికోద్యమం, జనసాహితీ, సాంస్కృతికోద్యమాన్ని ఆటంకపరుస్తున్న పాలకవర్గ సంస్కృతి, జనసాహితీ సాంస్కృతికోద్యమాన్ని బలహీనపరుస్తున్న కొన్ని ధోరణులు అభ్యుదయ సాహిత్యోద్యమంలో అ. ర. సం. పాత్ర, విప్లవ సాహిత్యోద్యమంలో వి. ర సం. పాత్ర, సాంస్కృతిక విప్లవం: జనసాహితీ, సాంస్కృతిక సమాఖ్యవంటి వివిధ అంశాలను గూర్చి ఈ సంస్థ తన స్పష్టమైన దృక్పధాన్ని వ్యక్తపరుస్తూ, ఈ సంస్థ కర్తవ్యాలను కూడా పాఠకుల కందించింది.

జనసాహితీ, సాంస్కృతికోద్యమానికి నాయకత్వం వహించే సంస్థ దేశంలో సామ్రాజ్యవాదమూ, భూస్వామ్య విధానమూ మొత్తంగా నిర్మూలించబడాలని చిత్తశుద్ధితో కోరే రచయితల్నీ, కళాకారుల్నీ, సాహితీ, సాంస్కృతిక కార్యకర్తల్నీ ఐక్యపరిచే ప్రజా సంస్థగా ఈ సమాఖ్య వుంటుందంటున్నారు నిర్వాహకులు, ఈ ముసాయిదా ప్రణాళికలో.

నేటి వ్యవస్థ పైకి ఎంత సుస్థిరంగా కన్పించినప్పటికీ, వాస్తవానికి ఎంతో దుర్బలమైందని, దిన దినం చైతన్యాన్నీ, ఐక్యతనీ పెంచుకొంటూ పోరాటాలు సాగిస్తున్న భారత ప్రజలు దీన్ని సమూలంగా రద్దుచేసి, తమ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే కొత్త సామాజిక వ్యవస్థను నెలకొల్పి తీరగలరని ఈ సమాఖ్య విశ్వాసం.

అయితే యిక్కడొక విషయం గమనంలోనికి తీసుకోవాలి. షిఫాన్ చీరెలు, గులాబీ తోటలు, బారుకార్లు, బొచ్చు కుక్కలు, విందులు, విలాసాలు వంటి వాటితో కూడిన యద్దనపూడిలు, ఆరిగపూడిల వంటి వారి వాస్తవ దూరమైన సాహిత్యం జనానికవసరమని ఎవరూ చెప్పరు. కానీ చిరకాలంగా తెలుగు నోళ్లలో నానిన వేమన శతకంలో నున్నదాన్ని మించిన సమతావాదాన్ని ఈనాడు అభ్యుదయ కవులమనీ, విప్లవ కవులమనీ విర్రవీగే వారెవరూ రూపొందించ లేక పోయారు. క్షేమేంద్రునివాటి జనసామాన్యంలోని రచనలు చేసిన వారెంతకన్నలేరు. ఒక మంగలిని గూర్చి లేక వేశ్యను గూర్చి లేక మరే బంట్రోతును గూర్చి, వారి సమస్యలను గూర్చి ఎప్పుడో క్షేమేంద్రుడు తన రచనలలో చెప్పాడు, వారినే ప్రధాన పాత్రలుగా తీసుకొని:

పై సమాఖ్యలో చేరగోరువారు వివరాలతోబాటు సభ్యత్వ దరఖాస్తు నమూనాను కూడా శ్రీ రవిబాబు, నగరం, తెనాలి (ఆర్. యమ్. యస్.)- 522 268 అనే చిరునామాకు వ్రాసి ఉచితంగానే పొందవచ్చు.

— శ్రీ శివాజీ

## మాండలిక వృత్తిపదకోశము

తెలుగు భాషకు నొక సమగ్ర నిఘంటువు రూపొందించుటకు "మాండలిక వృత్తిపదకోశము"లను వెలువరించుట అత్యావశ్యకమని గుర్తించి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ఈ క్రింది ప్రణాళికను చేపట్టినారు.

మొదటి సంపుటము — వ్యవసాయ పదకోశము

రెండవ సంపుటము — చేనేత పదకోశము

మూడవ సంపుటము — బెస్తపరిశ్రమ పడవల నిర్మాణము

నాలుగవ సంపుటము — వాస్తుపదకోశము

అయిదవ సంపుటము - కుమ్మరము

ఈ రీతిగా—కమ్మరము — వడ్రంగము అగసాలె పదకోశములు వెలువడును.

పై వానిలో 1) వ్యవసాయ పదకోశము, 2) చేనేత పద కోశము, 4) వాస్తుపదకోశము ఈవఱకు వెలువడినవి. ప్రస్తుతము వెలువడినది అయిదవ సంపుటము కుమ్మరము.

ఈ కుమ్మరము సంపుటమునకు సంకలనకర్త, సంపాదకుడు జి. యస్. రెడ్డి, సహాయ సంపాదకుడు—జి. నాగయ్య. ఈ పద కోశమున 4939 ఆరోపములు గలవు. 217 చిత్రములు నున్నవి.

ఈ కోశమున పదసేకరణకు ఏడుగురు పరిశోధకులు నియమితులైరి. వారు తెలుగుదేశమున 119 గ్రామములు పర్యటించి, కుమ్మరి వృత్తిలోనున్న వారివద్దకు వెళ్లి, వారివలన ఆ వృత్తికి సంబంధించిన ఉపకరణములను, చిత్రముల మూలము గ్రహించి వివరములనిందు చేర్చిరి. కేవలము పదములు — వస్తువులేగాక, కుమ్మరవృత్తి పుట్టుపూర్వోత్తరములు — దానికి సంబంధించిన కథలను వారి ముఖమునవేవిని గ్రంథస్థము చేసిరి. ఇందువలన నీ గ్రంథమున కొకవిధమైన సమగ్రత చేకూరినదని చెప్పవచ్చును.

పరిశోధకుల పర్యటన వివరములు పూర్తిగా నీయబడినవి. వారు పర్యటించిన గ్రామముల యునికిని దెలుపు పటము గూడ చేర్చబడినది.

ఈ కోశమునకు ''భూమిక'' యొకటియు, ''గ్రంథపరిచయము'' అను శీర్షిక యొకటియు గలవు. గ్రంథపరిచయమున పరిశోధకుల పర్యటన వివరములేగాక తెలుగు కావ్యాలలో కుమ్మరివృత్తి ప్రశంస, కుమ్మరివృత్తికి సంబంధించిన పదముల భాషా పరిణామము గూర్చి గలదు. ఈ భాషా విషయిక చర్చ భాషాశాస్త్ర సిద్ధాంతము లను గ్రహించుట కెంతయో తోడ్పడును.

పై వానివిబట్టి ఈ కోశము తక్కిన వానివలె శాస్త్రీయ పద్ధతులతో సంతరింపబడెనని తెలియగలదు.

## కుమ్మరి వృత్తి ప్రాచీనత

మానవ నాగరక చరిత్ర పరిశీలించిన — మానవుల వృత్తులలో కుమ్మరము తొలిదని చెప్పవచ్చును. నేడు వివిధ దేశాలలో, భూగర్భస్థమైన — అతి ప్రాచీన నాగరకతావశేషాలు కుండలు పెంకులు—బయలుపడుటయే యీ వృత్తి ప్రాచీనతకు తార్కాణ. కుమ్మరపని యనగా మట్టిపని. మట్టిలో పుట్టి, మట్టిలో కలసే మానవుని మనుగడకు ఆధారమైనది మట్టిపాత్ర.

వేదకాలము నుండియు, మనదేశమున నీ కుమ్మరి వృత్తి ప్రశంసగలదు. భారతీయ సంప్రదాయము ననుసరించి — సృష్టికర్తయైన బ్రహ్మయే — ఆది కుమ్మరి. అతడు బ్రహ్మాండ భాండమును సృజించును. బ్రహ్మాండము భాండము — అనగా మట్టిపాత్ర.

''పూని చరాచరంబులను పొల్పు వహింప యజాండ భాండముల్ వీసును'' అని ఆముక్తమాల్యద అవతారిక. ఇచట ''అజాండము'' అనగా బ్రహ్మాండము

నేటికిని శ్రీ తిరుపతి క్షేత్రమున శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి నైవేద్యమును పాలు కాచుటకు, ప్రసాదములు వండుటకు క్రొత్త మట్టికుండలనే యుపయోగింతురు దీనిని బట్టి కుమ్మర వృత్తి ఇతర వృత్తులకన్న విశేషముగా దేవతా సంబంధము గందని నిర్ణయింపవచ్చును

## కుమ్మరి వంశ చరిత్ర సంప్రదాయములు

పర్యటన పరిశోధకుల సేకరించిన కథలను బట్టి సంపాదకులు కుమ్మరి వారిలో రెండు సంప్రదాయాలున్నట్లు గుర్తించిరి.

1) గుండయ్య సంప్రదాయము

2) శాలివాహన సంప్రదాయము

సంపాదకులే, పై రెండు సంప్రదాయములను గూర్చి యిట్లు వ్రాసిరి :

''ఈ రెండింటిలో పౌరాణికమయింది గుండయ్య సంప్రదాయం. కొంత చారిత్రకంగా భాసించేది శాలివాహన సంప్రదాయం'' (భూమిక–పుట 3) సంపాదకు లిట్లు వ్రాసినను — మొదటిదైన గుండయ్య సంప్రదాయము పౌరాణికమెంత మాత్రమును కాదు. శివభక్తుడగు కుమ్మరి గుండయ్య కథ పాల్కురికి సోమనాథుని బసవ పురాణమున గలదు. బసవ పురాణము, పేరునకు మాత్రమే పురాణముగాని, ప్రాచీనమైన పురాణ లక్షణములేవియు దానికి పట్టవు. అది కేవలము చరిత్రాత్మకము. క్రీ. శ. 12 వ శతాబ్దము నాటిది. పాల్కురికి సోమనాథుడు జైన తీర్థంకరుల చరిత్రములు 'పురాణములు' అను పేర నుండుట గమనించి, తన గ్రంథమునకు పురాణము అని పేరు పెట్టినాడు. దానికిని, మన సంప్రదాయికమగు పురాణమునకు అణుమాత్రము సంబంధము లేదు. ఈ విషయము 1952లో బసవపురాణ పీఠికలో దెలుపబడినది.

## కావ్యసాహిత్యము - కుమ్మర వృత్తి

తెలుగు సాహిత్యమున సాంఘిక వ్యవస్థను నిరూపించు కావ్యములలో ప్రథమము పాల్కురికి సోమనాథుని బసవపురాణము. ఈ కోశమున, నా గ్రంథము నుండి కుమ్మర వృత్తికి సంబంధించిన పదములు నీయబడినవి. రెండవది అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి. ఇందు కుమ్మరి వృత్తికి సంబంధించిన పదజాలము మూడు పద్యములలో గలదు. ఇదియును నిందు వివరింపబడినది. కోశములో నున్న పదములు కొన్ని యందున్నవి. కాని కావ్యములో నున్న పదములు కొన్ని యిందు కానవచ్చుటలేదు. కొన్నింటి నుదాహరించుచున్నాను : అంబళ్ల పంటి గంజి వాగు — సువిపియమాత — చెవుల పెనము జిల్లుల సిబ్బి — దొవ, దొవకంచి లెసల — వంత మొదలగునవి — ఈ కోశమున కావ్యసాహిత్యమున ప్రయుక్తమైన పదములు.

ప్రస్తుతము సేకరించిన పదములతో సమన్వయము చేసి చూపిన యెడల నీకోశమెంకను గుణవత్తరము నుండెది. అయినను నేడు నిఘంటువులలో గానరాని కుమ్మర వృత్తి పదముల యర్థ వివరణ మిందుండుటచేత నిది యెంతయు నుపయోగకారిగా నున్నది.

## శాలివాహన సంప్రదాయము

ఇది అచ్చముగా చారిత్రకమే. శాలివాహనుడు కుమ్మర కన్యకకు బ్రాహ్మణుని వలన జన్మించి, కుమ్మరుల కందఱకు నాయకుడై, వారి సహాయమున – ఆ కాలమున రాజైన విక్రమార్కుని జయించి, ఆరాజ్యమును వశపఱచుకొని, రాజ్యమును పాలించి తన పేర శకమును నెలకొల్పెను. ఆ శకమునకే "శాలివాహన శకము" అని పేరు. ఇది క్రీ. శ. 78లో ప్రారంభమైనది. అంతకు ముందు విక్రమార్కుని పేర – "విక్రమ శకము" వాడుకలో నుండెడిది. ఈ శక కాలము క్రీ. పూ. 57. శాలివాహనుడు విక్రమార్కుని జయించి, రాజైన కాలము నుండియు, విక్రమశకము పోయి శాలివాహన శకము వ్యాప్తిలోనికి వచ్చినది.

నేటికి తెలుగువారు సంకల్పములలో – శాలివాహన శకమునే వాడుదురు. ఈ శాలివాహన శకము దక్షిణ భారతముననే గాక – ఉత్తర భారతమున వ్యాప్తిలో నున్నది. ఇందువలననే, స్వాతంత్ర్యానంతరము భారత ప్రభుత్వము వారు క్రైస్తవ శకముతో పాటు, శాలివాహన శకమును వాడుచున్నారు. ఈ విషయమొక్కటియే.

తెలుగు కావ్యములలో ప్రయుక్తమై, యిందు విడువబడిన రెండు కుమ్మరవృత్తి పదములను గూర్చి వివరించుచున్నాను.

## వాన కడవ

పూర్వకాలమున వర్షపాతమును తెలుసుకొనుటకు కడవల నుపయోగించెడివారు. ఈ కడవకే సంస్కృతమున "కుంభ ద్రోణము" అని పేరు.

"కుంభద్రోణముగాగ వానగురిసెన్ ఘోరాంబు

ధారాకృతిన్" వైజయంతీ విలాసము – (3-26) తెలుగున ప్రజావ్యవహారములో వర్షపాతమును తెలుపుటకు "కడవలతో ద్రిమ్మరించినట్లు వర్షము పడినది" అని వాడుక కలదు. నన్నెచోడమహాకవి కుమార సంభవమున నీ కడవనే 'కుండ'గా నిరూపించినాడు. "కుండ గూర్చిన భంగిన్" (5-78). ఈ సంప్రదాయ మీనాటి వారి కవగతిపరచుటకుటచే దానిని తెలుపుచున్నాను.

వానకాలమున వాన వచ్చుటకుముందు ఎరుబయిలను పెద్ద కడవను ఉంచెడివారు. కడవ అనగా వెడల్పు మూతిగల మట్టి పాత్ర. కడు + వాయి అని దాని వ్యుత్పత్తి. ఇవి వెడల్పు సాధారణపు కడవలకన్న విలక్షణముగా మూడడుగుల వెడల్పు మూతియు, రెండడుగుల లోతును గలిగియుండును కాబట్టి ఇవి ప్రత్యేకముగా కుమ్మరులు తయారుచేసెడివారు.

వర్షము ఆ పాత్రలోపడి అది పూర్తిగా నిండిన దానిని "కుంభవృష్టి" యందురు. అనగా పడవలసినంత వర్షము పడినది అని యర్థము.

## గడియ కుడుక
## గడియారపు కుడుక

పూర్వకాలమున కాలమును తెలుపు గడియారము కుమ్మరి వృత్తికి సంబంధించినది. ఆ గడియార స్వరూపము తెలిసినయెడల నీ విషయము వ్యక్తమగును.

ఒక పెద్ద బాననిండ నీరు నింపుదురు. ఆ నీరు బాన అంచులకు మోసియుండును ఆ నీటిమీద ఒక కుడుక నుంచెదరు. ఆ కుడుక మట్టిదే. దాని స్వరూపమిట్లుండును.



అది ఆరంగుళముల వెడల్పుండును. 4 అంగుళముల లోతు గలిగియుండును. దీని యడుగున మధ్యనొక చిన్న రంధ్రముండును.



రంధ్రము

చిన్న రంధ్రముగల యీ కుడుకను బాన నీటిమీద నుంచెదరు. ఆ రంధ్రముద్వారా నీరు కుడుకలోనికి వచ్చును. కుడుక నిండినప్పుడు అది బానలో మునిగిపోవును. కుడుకనిండి, బానలోపడిన కాలము – ఒక గడియ. అయితే ఆ విషయమునకు తెలియుటెట్లు? అందుకొఱకు ఒకనిని కాపలా యుంచెడివారు. కుడుక బానలో మునిగిపోగానే 'గడియ' యయినదని గంట మ్రోగించెడివారు. ఈనాడు గంటకాగానే గంటలు కొట్టునట్లుగా ఆ కాలమున గడియ కాగానే ప్రల గడియను కొట్టెడువారు.

## పెంకు

ఇండ్లకెత కుపయోగించునది. ఈ పెంకు ప్రత్యేకముగా ఆరోపమీయబడలేదు. "పెంకుటిల్లు" (పుట 97) గూనపెంకు, (పుట 82) నాగపెంకు (పుట 82) మాత్రమీయబడినవి. పాలిస్తి పెంకు (పుట 93) చూపుబడినది. కాని యిది విశేషముగా వాడుకలోలేదు. ప్రభుత్వ కార్యాలయములయు మాత్రమే వాడుదురు. సర్వే సర్వ ప్రజాసామాన్యములో వాడుకయుండునది నాగపెంకు మాత్రమే. ఈ పెంకుల ఆకార చిత్రములిందులేవు.

## జాజాలపాలిక

వివాహ కాలమునందు నవధాన్యములు మొలకలెత్తుటకు వాడు మూకుడులు. ఈ జాజాల పాలిక ఆరోపమిందులేదు. 'పాలిక'

మాత్రమున్నది. (93 పుట). 102వ పుటలో 142వ చిత్రము 'సాలిక' పై జాజాల పాలిక ఆకారమును తెలుపదు.

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

## వేమన సూక్తులు

[రచయిత: పల్లా రాధాకృష్ణశర్మ. డెమ్మీసైజు 148 పుటలు. వెల: రూ. 4-00. లక్ష్మీనారాయణ గ్రంథమాల, 5 నాగార్జుననగర్, కోడంబాకం, మదరాసు-24.]

క్రొత్త విషయాలు చెబుదామనే ప్రయత్నం చేసే కొద్ది మంది తెలుగు రచయితల్లో శ్రీ పల్లా రాధాకృష్ణశర్మగారొకరు అని ఈ పుస్తకాన్ని బట్టి తెలుస్తోంది. ఈయన తెలుగు తమిళ ప్రాంతాల మధ్య నున్న సాహిత్య సాంస్కృతిక సంబంధాలను నిశితంగా పరిశీలించి ఎన్నో వ్యాసాలను వ్రాశారు అవి యెంతో ఆసక్తిదాయకంగా ఉంటాయి.

'వేమన సూక్తులు' పందొమ్మిది వ్యాసాల సంపుటి. ఇందు లోని వ్యాసాలు ఇదివరకే 'భారతి' మొదలైన పత్రికల్లో ప్రచురిత మయ్యాయి. ఈ పుస్తకంలో మొదటి వ్యాసం వేమన సూక్తులు ఇదొక్కటే ఇందులో తక్కువ స్థాయిలో ఉన్న వ్యాసం. పుస్తకం పేరు గూడా 'వేమన సూక్తులు'. అట్టిపైన పేరుచూచిన వాళ్ళు ఈ పుస్తకంలో మంచి మంచి వేమన పద్యాలుంటాయేమో అని భ్రమించవచ్చు. కాని తీరా చూస్తే ఇది పది పేజీల వ్యాసం మాత్రమే! మనవి మాటల్లో రచయిత 'ఏదో ఒక ప్రత్యేకత ఉంటేనే తప్ప కొత్తగా వెలువడే సాహిత్య వ్యాస సంపుటికి పాఠకుల ఆదరాభిమానాలు లభించవని భావించవచ్చు'' అని చెప్పారు. ఇది నిజం. ఈ వాక్యం ప్రకారం చూస్తే వేమన సూక్తులు వ్యాసంలో ఏ ప్రత్యేకతా లేదని చెప్పవచ్చు. గత ఏభై యేళ్ళ నుంచీ పలువురు విమర్శకులు పలు కారణాలవలన పలుకుతూ వచ్చిన చిలక పలుకులే ఇందులోనూ ప్రతిబింబిస్తున్నాయి. ఈ వ్యాసం చదివేటప్పుడు వేమన పద్యాలతో పరిచయం ఉన్నవాళ్లకు అనేక సందేహాలు కలగవచ్చు. సార్వకాలికమైన విఖ్యాతి వేమన్న సూక్తులకు లభించిందని రచయిత అభిప్రాయపడ్డారు. కానీ వేమన్న పద్యాలను నేటి అభ్యుదయ పరిభాషతో పరిశీలిస్తే పరమ ఛాందసుడుగా గోచరిస్తాడు. అసలు ఆ వైరాగ్యమేమిటి? లోకాన్ని సంస్కరించదలుచుకున్నవాడు బట్టలు విప్పుకొని బజారున పడి తిరిగితే సరిపోతుందా? వేమన్నను ఆదర్శంగా తీసుకొని అంతా బైరాగులైతే లోకం నడిచేదెలా? అదే మనలాంటి వారెవరైనా కనబడిన ప్రతి విషయాన్నీ విమర్శిస్తే 'రాక్ వెధవ' అంటారా! వేమన్న తిడితే 'ఆహా ఏం తిట్టాడండీ' అని పంక లెగరవేస్తారా? ఇప్పుడెవరైనా దిగంబరుడై సంచరిస్తే మనం సహిస్తామా? ప్రశంసిస్తామా?? పైగా దొంగ సన్యాసి అని అభాండాలు వేయడం లేదూ? వేమన్నవిగా చెప్పబడుతున్న 7000 పద్యాలలో నిజంగా వేమన్న చెప్పినవెన్నో ఈ నాటికీ తెలియదు గదా! బ్రౌను ప్రతి పద్యాన్నీ పట్టుకొని, వేమన్నదిగా భావించుకొని, దాంట్లో అభ్యుదయమున్నదని, సంఘ సంస్కరణమున్నదని పాటి చెప్పడం ఇప్పుడెందరో విమర్శకులు చేస్తున్నపని ఆ మధ్య ఒక ప్రముఖ రచయిత వేమన్న పద్యాలకు ఒక పత్రికలో, సీరియల్‌గా వ్యాఖ్యానం గూడా వ్రాశారు. వేమన్న పద్యాలకు వ్యాఖ్యానం వ్రాయ వలసి వచ్చిందా! ఖర్మ! నిజంగా వ్యాఖ్యానం అవసరమైతే వేమన్న ప్రజాకవి ఎలా అవుతాడు?

జానపద గీతాలు ఎందరో నిరక్షరాస్యులకు వచ్చు. వేమన్న పద్యాలూ కొందరకు వచ్చునంటారు. భాష, భావాల్లో వేమన పద్యాలు జానపదులకు దగ్గరగా ఉండటమే ఇందుకు కారణం అంతమాత్రాన అందరూ మెచ్చిన మహాకవి, ప్రజాకవి అనడం కేవలం ఈ శతాబ్దపు విమర్శకుల సంప్రదాయం తప్పి, అందులో సత్యం మాత్రం లేదు. ''ఆయన పద్యం ఒకటైనా తెలియని తెలుగువాడు ఉండడు'' అని రచయిత వ్రాశారు. వేమన్నను గూర్చి వ్యాసాలు వ్రాసిన వాళ్ళలో ఎక్కువ మంది యిదే పాట పాడతారు. కానీ నాకు మాత్రం ఈ విషయమై ఈ మధ్య సందేహం కలిగింది. పెద్ద గ్రాడ్యుయేట్లలో గూడా చాలా మందికి వేమన పద్యాలు రావని తెలిసింది. మామూలు వాళ్లలో నాకు తెలిసిన ఎవరికీ వేమన పద్యాలు రావు! మన పెద్దల కాలంలో పోతన్నను గూర్చి ''ఒక్క భాగవత పద్యమైనారాని తెలుగు వాడుండడు'' అనే వాళ్ళు. మరి ఆయనా ప్రజాకవేగదా! పోతన్నకు, వేమన్నకు చాలా విషయాల్లో చుక్కెదురు. వీరిద్దరూ ప్రజాకవులే అయితే ఇక కాని వాళ్లెవరు? వేమన్నను గూర్చి రాస్తూ ''ఆయన ఏ ఊళ్ళోపుడితే మాత్రం ఏం? ఏ ప్రాంతం వాడయితేనేం?'' అని మన గ్రంథ రచయిత వ్రాసినట్లుగానే చాలా మంది తమ తమ వ్యాసాల్లో కవి జీవితాలు అంత ముఖ్యం కాదన్నట్లుకొట్టి పారేయడం జరుగుతూంది. కాని శర్మగారికి కవి జీవితపరిశీలన వివాద గూడా ఆసక్తి ఉందని, మిగిలిన వ్యాసాలను బట్టితెలుస్తూంది.

''వేమన్నలా భక్తి ప్రభావాన్ని సూటిగా, సుందరంగా వివ రించిన వారు చాలా మంది లేరని నా అభిప్రాయం'' అని రచయిత వ్యాసం చివరలో వ్రాశారు. కానీ వేమన్న చాలా పద్యాల్లో భక్తుల్ని లెగతిట్టి వదిలిపెట్టాడు. 'వేమన ఎన్నో మంచి మంచి విషయాలు అందరికి అర్థమయ్యేటట్లు వివరించా '' అని ఒకచోట వ్రాసిన రచయిత ''ఒక్కొక్కసారి వేమన పద్యాలు వింటుంటే ఇవి ఎందుకు చెప్పాడా? అనిపిస్తుంది మొదట్లో కానీ బాగా ఆలోచిస్తే వాటిలో ఎంతో అర్థం ఉందనే నిజం తెలుస్తుంది'' అని ఇంకోచోటన్నారు దీన్నిబట్టి వేమన ఒక వరసావాయీ లేకుండా పద్యాలు చెప్పాడని తెలుస్తూంది గదా! వేమన ఒకచోట భక్తుల్ని తిడతాడు, ఒకచోట భక్తిమార్గం గొప్పదంటాడు. ఒక చోట స్త్రీలను గౌరవించమంటాడు, ఇంకోచోట ఆడదాన్ని ఇంట్లోపడేసి గడి పెట్టేయమంటాడు. ఒకచోట అందరికీ అర్థమయేట్లుపద్యం చెబుతాడు, ఇంకోచోట ఎవరికీ అర్థం గాకుండా పద్యంచెబుతాడు. కాబట్టి విమర్శకుడు వేమన్నను గూర్చి ఎలా వ్రాయదలుచుకుంటే అలా వ్రాయవచ్చునన్నమాట! ఇక ఏం వేమన్నసూక్తులండీ?

మిగతా వ్యాసాల దగ్గరకు వద్దాం. నన్నయ చేసిన 'ఇంద్రోత్సవ ప్రశంస' రెండవ వ్యాసం. మణి మేకలైలోని అయితిహ్యాన్ని ఉటంకించి చోళరాజులు ఇంద్రోత్సవం చేయడానికి గల కారణాన్ని చెప్పారు రచయిత. నన్నయ భారతంలో ఆదిపర్వం తృతీయాశ్వాసంలో ఇంద్రోత్సవ వర్ణన ఉంది. చాళుక్యులు చోళులకు బంధువులవడం వలన ఈ సంప్రదాయం మన ప్రాంతానికి గూడా వచ్చివుండవచ్చునని రచయిత చెప్పారు. తరువాత వ్యాసం 'శ్రీనాథయుగము — రచనా ప్రక్రియా వైవిధ్యము'. సాహిత్యాధ్యయనం చేసే వారందరికీ ఈ యుగ ప్రాధాన్యం తెలుసు. అందుకే రచయిత గూడా "శ్రీనాథ యుగానికి ప్రత్యేకత ఉన్నదనడం పర్విత చర్వణమే అవుతుంది" అన్నారు. పురాణేతిహాస కావ్యాలతో పాటు, పామర రంజకమైన రచనలు కూడా వెలువడిన శ్రీనాథ యుగం నిజంగా తెలుగు సాహిత్య చరిత్రలో విశిష్టమైనది" అని వ్యాసాన్ని ముగించారు. తెలుగు కావ్యాలలో శరదృతువర్ణన తరువాత వ్యాసం. ఇది మామూలు వ్యాసం. దేశి సంప్రదాయ సమన్వితమూ, స్తుతి ప్రధానమూ, గానాను కూలమూ అయిన 'ఉదాహరణం' ను గూర్చి వ్రాసిన 'తెలుగులో ఉదాహరణ కావ్యాలు' లోనూ, 'సరస్వతీ మహలు' వ్యాసంలోనూ పాఠకులు తెలుసుకోదగిన విషయాలున్నాయి.

ఇక ఇక్కడ నుంచి ఉన్న వ్యాసాల్లో అనేకం రచయిత ప్రతిభావ్యుత్పత్తులను ప్రతిబింబిస్తున్నాయి. ఆయన పరిశోధనా పటిమ బాగా వెల్లడి అవుతూంది. తెలుగు సాహిత్యంలో తిరువత్తూరి ప్రశంస అనే వ్యాసం చూడండి. ఒక చిన్న వాక్యాన్నో, విషయాన్నో ఆధారం చేసుకొని సమగ్ర పరిశీలన గావిస్తారు రచయిత. చెన్న పట్టణానికి అయిదు మైళ్ల దూరంలో సముద్ర తీరాన ఉన్న తిరువత్తూరును గూర్చి ఓ వ్యాసం వ్రాశారు. అది చదివిన తరువాత మనకు "ఓసారి తిరువత్తూరు చూచి వస్తే బావుంటుందను" అనిపిస్తుంది. ఇంతకంటె రచయిత గొప్పతనానికి నిదర్శనమేముంటుంది! త్యాగయ్య గారు తిరువత్తూరులోని ఆదిపురీశ్వరునీ, త్రిపుర సుందరినీ దర్శించి కృతులు రచించారనే విషయాన్ని శర్మగారు సోదాహరణంగా వివరించారు. తమిళనుపై తెలుగు వెలుగు మొదలైన వ్యాసాలవలన రచయితకున్న తమిళ భాషా పాండిత్యం పాఠకులకు సుస్పష్టమవుతుంది. ఈ వ్యాసంలో ప్రతి వాక్యమూ సారవంతమైంది. "బెంగాలీ, హిందీ మొదలైన భాషల నుంచి వస్తున్న అనువాదాల సంఖ్యతో పోల్చి చూస్తే, తెలుగు నుంచి తమిళంలోకి వెళ్లిన పుస్తకాల సంఖ్య అత్యల్పమనక తప్పదు". ఆలోచనలు రేకెత్తించే ఇలాంటి వాక్యాలు ఈ వ్యాసంలో పుష్కలంగా ఉన్నాయి. ఎన్నో వందల పేజీల పరిశోధన గ్రంథాలలో కంటే ఈ 16పేజీల వ్యాసంలో ఎన్నో తెలుసుకోదగ్గ సంగతులున్నాయి. ఇటువంటి వ్యాసాలను ప్రమాణంగా తీసుకొని, యూనివర్సిటీలు దిండు సైజు పుస్తకాంటే డాక్టరేటు పట్టా ఇవ్వడం మానివేసిన నాడు తెలుగు పరిశోధకులకు మరికొంత హుషారు వస్తుంది. ఇలాంటిదే తెలుగువారి తమిళ సాహిత్య సేవ. తెలుగు రచయితలు తమిళ రచనలు చేసి ఎలా ప్రఖ్యాతి చెందిందీ రచయిత ఈ వ్యాసంలో వ్రాశారు. "వీరిని తెలుగు దేశంలోని సాహిత్య సంస్థలూ, తెలుగు రచయితలూ గుర్తించి ప్రోత్సహించడం సముచితము"ని రచయిత మనవి చేశారు. దురదృష్టవశాత్తు మన కలాటి సదాచారం లేదు గదా! 'కురవంజి' అనేది గూడా పరిశోధనాత్మకమైన వ్యాసం. అయితే కురవ అంటే 'ఎరుకుల' అనే అర్థంమాత్రం కనబడుతున్నట్లు రచయిత చెప్పారు. రాయలసీమలో కురవ అంటే యాదవకులం అనే అర్థం గూడా ఉన్నదని వారు గమనించినట్లులేదు. తమిళ సాహిత్య పరిశీలనతో ఈ కురవంజిని రచయిత సంతరించారు. 'చిలకమర్తివారి ప్రతిభ' వ్యాసంలో లక్ష్మీనరసింహంగారు తెలుగుసాహిత్యంలో చిరంజీవి ఎలా అయినదీ సంక్షిప్తంగా చెప్పారు. ఆంధ్రుల సంస్కృతిలోని విశిష్ట లక్షణాలు అనే వ్యాసం తరవాత 'స్వతంత్ర భారతంలో రచయిత పాత్ర'ను గూర్చి శ్రీ శర్మగారు తమ అభిప్రాయాలను ప్రకటించారు. వ్యాసాన్ని ముగిస్తూ "ప్రభుత్వపు ప్రోత్సాహం రచయితలకు కావలసిందే. ఎవరూ కాదనరు. కానీ అటువంటి ప్రోత్సాహంవల్ల ప్రచార సాహిత్యం బాగా ప్రచారంలోకి రావచ్చునేమోగాని, ప్రగతి శీలాత్మకమైన ఉత్తమ సాహిత్యం వెలుగులోకిరాదు. రాత్రికి రాత్రే ఉత్తమ సాహిత్యం తయారుకాదు" అని చెప్పారు. అత్యవసర పరిస్థితిని కీర్తిస్తూ మన ప్రగతి శీలురుగా ఖ్యాతిగాంచిన కవులెంతమంది గీతాలు రచించలేదు? ఆలోచించాలి!

సాహిత్యంలో సామాన్యుడు-వ్యాసాన్ని ప్రారంభిస్తూ "క్లిష్టమైన సాంఘిక పరిస్థితుల్ని ప్రదర్శించే ఆధునిక జీవితాన్ని నాటక కర్తలు నిర్లక్ష్యం చేశారు" అని గురజాడ అప్పారావుగారు తమ 'కన్యాశుల్కం' ద్వితీయ ముద్రణ పీఠికలో ఒకచోట పేర్కొన్నారు. సుమారు ఏడు దశాబ్దాల క్రితం ఆయన అన్న ఈ మాటలు ఆనాటి వారికే కాదు ఈనాటి వారికి వర్తిస్తాయి' అని శర్మగారు వ్రాశారు. గురజాడ నాటికి స్వతంత్ర తెలుగు నాటకాలులేవు గాబట్టి, గురజాడ మాటకి అర్థంలేదు. పోనీ సంస్కృత నాటకాలను చూద్దాం. మృచ్ఛకటికం లాంటి నాటకాలు ప్రాచీనాలైనా కన్యాశుల్కంలాంటి ఆధునిక నాటకాలు వెయ్యి అయినా చెప్పలేని క్లిష్టమైన సాంఘిక పరిస్థితులను వర్ణించి ఉన్నాయి. ఇక కన్యాశుల్కం సంగతి చూద్దాం. కన్యాశుల్కంలో అసభ్యకరమైన విషయాలే ప్రాధాన్యం వహించాయి. అదీ సార్వ కాలికమైన సమస్య

రాదు. ఇప్పుడెవరైనా కన్యాశుల్కం యథాతథంగా ప్రదర్శిస్తే సామాన్య జనంగూడా అందులోని బూతులను చూచి తుపుక్కున ఉమ్మేస్తారు. సరే! గురజాడ సంగతి అటుంచండి. ఇప్పుడు వచ్చే సాహిత్యం అంతా సామాన్యులను గురించేగదా! ''సామాన్యుడు... సామాన్యుడు...'' అనే గోలతో మన సాహిత్యాన్ని ఒకవైపు రచయితలూ, ఇంకొకవైపు విమర్శకులూ దిగజార్చి పారేస్తుంటే, ఇక సాహిత్యంలో సామాన్యుడు లేడంటారేమిటండీ? శ్రీ శర్మగారు గూడా ఇంకోచోట ''సామాన్య మానవుడు నేటి రచయితకు ఆరాధ్య దైవం'' అని చెప్పారు. చాలా చోట్ల ''సామాన్యుడే నేటి కథా నాయకుడు'' అని చెప్పారు. కానీ మళ్లా చివర ''గురజాడ వారన్నట్లు ఆధునిక జీవితం తాలూకు సమస్యలను ఇతివృత్తాలుగా స్వీకరించి రచనలు సాగించడానికి మీనమేషాలు లెక్కపెడుతున్నారు'' అవి ఎందుకన్నారో పాఠకులకు అర్థం కాకపోవచ్చు. ''సామాన్యుల్ని ఉద్దేశించి సంతరించబడుతున్న రచనలు కూడా ఆ సామాన్యుల వద్దకు చేరలేకపోతున్నాయని నా అభిప్రాయం'' అని రచయిత వ్రాసిన వాక్యంతో అందరమూ ఏకీభవిద్దాం.

'తెలుగులో కవిత చెప్పిన తమిళుడు' ఆణిముత్యం. తి. సు. మురుగేశం పిళ్లైను గురించిన వ్యాసం యిది. మన కవులదృష్టిలో భక్తిభావం భక్తకవులు — జాతీయ సమైక్యం అనేవి ఉత్తమ వ్యాసాలు. వీటిల్లో తమిళకావ్యాలనుంచి ఉదాహరణలూ, పోలికలూ ఇచ్చారు. ''భక్తిభావం మన దేశంలోని వివిధ ప్రాంతముల వారినీ, వివిధ వర్గముల వారినీ సన్నిహితం చేసినట్లే, వివిధ భాషలలోనూ ఉత్తమ సాహిత్య సృష్టికి కూడా తోడ్పడింది. ఈవిధంగా భావ సమైక్యానికి భక్తిభావం పునాదివేసింది'' అని అక్షర లక్షలుచేసే మాటలు వ్రాశారు శర్మగారు. భక్తిలోనే దేశభక్తి ఉన్నదనేది కొత్త ఆలోచన. 'తెలుగులో ఆనంద రామాయణం' మరొక పరిశోధనాత్మక వ్యాసం. అందులో అవాల్మీక గాథలను గూడా వివరించారు. సరే! ఇహ చివరకు వద్దాం. 'త్యాగయ్య కృతులు'' వ్యాసంతో పుస్తకం పూర్తవుతుంది.

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారి దృష్టి సమగ్రమైంది. విమర్శలో చురుకుదనం ఉంది. వాక్య రచన మనోహరంగా ఉంది. ఆంధ్ర సాహిత్య ప్రాభవాన్ని దశదిశలా వ్యాపింపచేస్తున్న శ్రీ శర్మగారికి ఆంధ్రజాతి రుణపడి వుంటుంది. నేను ఈ సమీక్షలో కొన్ని విషయాలమీద సందేహాలు ప్రకటించాను. అవి శ్రీ శర్మగారి ప్రతిభా పాండిత్యాల నెంతమాత్రమూ కాదనడం కాదు. ఆయన సమైక్య దృష్టీ, భాషాభిమానమూ, పరిశోధనా పాటవమూ ఈ గ్రంథం చదివిన వారందరికీ సుస్పష్టమవుతాయి. ఆంధ్ర భాషాభిమానులందరూ చదువదగ్గ మంచిపుస్తకం వేమన సూక్తులు.

శ్రీ పులిచెర్ల సాంబశివరావు

# తొమ్మిది కవితా సంకలనాలు

ఈ తొమ్మిది పుస్తకాలు పరిమాణంలో చాలాచిన్నవి. పెద్ద సంకలనాలు చేసి ఉంటే — చేతికి నోటికి అరిపి ఉండేవి. వ్రాసినది అచ్చుపడాలనే కండూతి అణచలేనిదే! ప్రథమ గ్రంథ ముద్రణ కవికి ఒక ఆనందాన్ని గూరుస్తుంది. అయినా కాస్త ఓపికబట్టి పెద్ద పుస్తకాలు అచ్చువేస్తే మంచిదేమో—నవ్య కవులు యోచించాలి. తిరుపతి చెళ్లపిళ్లవెంకటశాస్త్రి ''మేము వ్రాసిన పుస్తకాలు గోదావరికి అడ్డకట్ట కట్టవచ్చు'' అని అంటుండేవారు. అంటే— సాధన పద్యాలన్నీ అచ్చు పడవలసిన అగత్యం లేదని పెద్దల మతం. ఈ కసుగాయ కవిత్వం ముక్కబారితే మధురం అయినా వీరి ఉత్సాహశక్తి ప్రోత్సహింపదగినదే !

## 1. హాస్యగాథా ద్విశతి

[తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు, క్రౌన్ 1/16 — 48 పేజీలు. వెల రు. 3; ప్రతులకు — త్రివేణి పబ్లిషర్సు — మచిలీపట్టణము—1 ]

గాథ అన్నది దీనికి ఒప్పిన పేరు. గాథంటే — దేనికదే వేరుగా ఉండే పద్యం — గాథా సప్తశతి వంటివి ఇవి ఛలోక్తులు నర్మోక్తులు సామెతలవంటి పద్యాలు. సామెతకుగాని, ఛలోక్తికిగాని కుదింపు (బిగింపు)బిగువు ప్రాణాలు. వేమన పద్యాల అమరత్వానికి వ్యాప్తికి ఈ గుణమే జీవం. కొన్ని హాస్యోక్తులను ఛందోబద్ధం చేసిన ఈ కవి ప్రయత్నం మంచిదేగాని, అల్లికలో స్నిగ్ధత ఓజస్సు తగ్గి, నాలుగు పాదాల పద్యమంతా పరచుకొనిపోయి చాలా పద్యాలు పేలవమైపోయినవి. పదో పన్నెండో తప్ప మిగతవి మనస్సులో నాటుకోవు. స్పెల్లింగు తప్పును ఆక్షేపిస్తూ అజిటేషనుకు యాజిటేషన్ అంటాడు; ఇది గణాలకు పడిన యాతనో! అలవాటో!

ద్విశతి అని పేరుబెట్టి 216 వ్రాస్తాడు. ఇదీ ఒక ఛలోక్తి కాబోలు.

## 2. కిరణాలు

[నలుగురు కవుల కవితలు. క్రౌన్ 1/16; 30 పేజీలు; ధర : ఒకటిన్నర రూపాయి; ప్రతులకు — సహజ కళానికేతన్‌శాఖ — ఎల్లారెడ్డిపేట — సిరిసిల్ల — కరీంనగర్ జిల్లా— 505 303.]

ఈ నలుగురూ, నేటి పరిపాటి పాట అయిన అభ్యుదయ కవితోపాసకులు. సమత నెలకొల్పాలని కిషన్‌రావు వాంఛ; ఈ వాదం కొత్తదా ? భగవద్గీత మొదలు భౌతికవాదుల దాకా వాడే వాదమే గాని, ఆచరణ మాత్రం ఆ పాత సంఘంలో, ఈ కొత్త సంఘంలో లోపించే ఉన్నది. వీరు దీనిని కార్యాచరణలో పెట్టాల, లేకుంటే వీరి ఆవేదన అక్కసు అంతా వేడినీళ్లబోసి ఇల్లు, గాల్చినట్లుంటుంది. కవిని గురించి సత్యనారాయణ చేసిన నిర్వచనం పట్టి మాటల పసే! భాస్కర్ సంఘదురాగతాన్ని ఈసడించందే సాహిత్యం కాదంటాడు. ఇది ప్రచారక కరపత్రంగాని, ఆనందాన్ని గొలిపే కవిత్వం గాదు.

సంఘాన్ని చెలకాని చెడుగుణాన్ని ద్వేషిస్తానంటాడు — రేగులపాటి. ఇది ఆదిమ మానవుని ఆరణ్యక ప్రవృత్తి; ద్వేషం ద్వేషాన్నే పెంచుతుంది; ఇక వీరు ప్రపంచాన్ని మరమ్మత్తు చేసేదే

...న్నది ? మానవుడు మన్నించి మరచిపొయ్యే మహిత గుణాన్ని నేర్చుకోవాలి. అంతేకూ తామే కర్తలమంటూ — ''ఇడుములకు తలవొగ్గే మనిషిగా జన్మింపనీయకు'' అని వేములు, తాను జేసిన కర్మను దేవునినెత్తిన రుద్దుతాడు. ఈ నాదకవులకు దేవుడున్నాడా? అంతా ఏదో ఆస్తికనాస్తిక భావసాంకర్యం—కుదుటబడని కవిత్వము ఈ ఆవేశపు పొంగు నురుగు అణగితేగాని వీరు బాగుపడి, ప్రజలను బాగుపరచలేరు. డాక్టర్ సి. నారాయణరెడ్డి అభిప్రాయంలో ''భావాలతోబాటు పలుకున్న సంవిధానం అలవరచుకో'' అన్న దానినే నేనూ అంటున్నా. కనువిప్పులో ''గడ్డ ఎద్దుకన్న చిన్నదైనా వాని రక్త మాంసం కోరుతుంది'' అన్న భావం, భాష బాగున్నవి. కృపీట కిరీటమేమిటో ? ముళ్ల కిరీటం విన్నాం, ఈ నీళ్ల కిరీట మేమిటో !

## 3. తెలుగు పూలు

[బాల సాహిత్యం చిరంజీవి. క్రౌన్ 1/16–40 పేజీలు; ధర:ఒకరూపాయి. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ–4.]

భావయుక్తంగా ఉన్నది — ముఖపత్రం. కవిత్వంలో గూడ తెనుగుదనం గుబాళిస్తున్నది. ధారాశుద్ధి గలిగి సరళమైన భాషలో బాల బాలికలకు బుద్ధి గరపే నీతి పద్యాలు—ఇవి. ముడికారం బిగువులో జ్ఞాపకం పెట్టుకోను వీలుగా పద్యాల నడక సాగినది. తెనుగు బిడ్డ అన్నమకుటంతో ఆంధ్రత్వాన్ని నూరిపోస్తున్నవి ''మొదటి పద్యాలు రాయప్రోలు సుబ్బారావు ఆంధ్ర ప్రబోధాన్ని గమనానికి తెస్తున్నవి. ఆంధ్రజాతి ఉన్నతిచి చరిత్రను మహిమపరచి శిశువుల మనసులలో, దేశాభిమానానికి అస్తి భారం వేస్తున్నవి — పద్యాలు. ప్రాధమిక పాఠశాలలో తప్పక గరపబడవలసినవి. 'సుమతి శతకానికే గతులుబోయిన ఈ కాలంలో ఇట్టి నీతి శతకాలకు చోటుండ బోతుందా ? కవి నిష్కపట గాంధీయ మార్గానికే మొగ్గు చూపు తున్నాడు. ముగింపుపద్యం బాగున్నది.

ఆంధ్రప్రదేశం అవతరించినదంటూ యాభై యేండ్లనాటి పాట — ''మూడుకోట్ల మంది ముద్దు బిడ్డలు'' అంటాడు. ఈ 12వ ముద్రణం నైనా ఐదుకోట్ల ఆంధ్రులు అని అనవచ్చునులేదా?

## 4. సాధన

[యువ కవితా సంకలనం, క్రౌన్ 1/16 – 90 పుటలు. ధర రు 2/–స్పందన సాహితీ సమాఖ్య; న్యూ మునిసిపల్ క్వార్టర్సు; మచిలీపట్నం – 521 001.]

37 మంది — వివిధ ప్రాంతాలవారు, వివిధ వర్గాలవారు (4 గురు ముస్లిములు) పట్టభద్రులై ఉద్యోగాలుచేస్తూ ఆత్మా నందం కోసరం కవితావేశం పొందిన చిన్న పెద్దల రచనలివి. పుస్తకం పేరే సాధన కాబట్టి వీరు అభ్యాసంచేసి, విశృంఖలత్వానికి కళ్లెములువేసి, భాషలో కొంత సంయమనం అలవరచుకొంటే మంచిదారిన పడురారు. ఈ సంకలన విధానమే సాధకులకు తగిన రంగం.

భావాలన్ని ఒక అమ్మున పోతపోసినవి—అంటే నేటి అశాంతి అరాజక ప్రేరక కవిత్వం. చంద్రమౌళి — ''కాలేకడుపుల గురించి రాసేవారు మేడలు మిద్దెలలో ఉంటారు'' అని అనుభూతిలేని కవిత్వం నెత్తిమీద సమ్మెటదెబ్బ కొట్టినారు. నేటి ప్రగతిశీల కవి కుమారులకు మా బోంట్లు చెప్పేమాటే ఇది. అనుభవంలేని ఆరాటంవల్ల ప్రయోజనమేమి? ''ప్రస్థానం''లో — చర్చి గంటలు వింటూ మసీదు మంటలుకంటూ అన్నది ప్రాసకు ప్రాకులాడిన వ్రాతగాక మరేమి?

వ్రాయంగా వ్రాయంగా గదా బాణీ కుదిరేది.

## 5. ఇది హృదయం

[సంకలన మాస్టర్ రవి. క్రౌన్ 1/16–70 పారటలు; మూల్యం రు 3/– ప్రతులకు: దేవరాజు రవి; ఏపురుపల్లి 532128.]

ఈ మాస్టర్ రవి రచనలు — అభ్యుదయ కవుల కడుపు మంటల, కన్నీటి కవిత్వాల ఆర్భాటం మధ్య ఒక ఉపశమన ప్రక్రియగా నున్నది. ఈయన ప్రేమ హృదయుడైన ఆశావాది ''ప్రతి ప్రాణిని సాకాలె'' అని, ''కుష్ఠురోగినైనా కమ్మగా తాకాలని'' పరను శత్రువునైనా ప్రియంతో చూడాలని, సర్వభూత హితాన్ని ఆకాంక్షిస్తూ ద్వేషాన్ని కక్కడు.

ఈ గీతాలు ప్రేమవాగురులలో ఇరుక్కొన్న రసహృదయాన్ని పూర్వం భావకవులవలె ప్రకటిస్తున్నవి. భాషపాటునబడి భావాన్ని రసవత్తరం చేస్తున్నది; ప్రేమ గుడ్డిదిగదా! ''తెరమీది తారలతో ఇల్లా అని పోల్చరాదు''అని పరసతి'మజ్నూ'లైన (ప్రేమోన్మాదులు) యువకుల వెర్రిని ఎగతాళి చేస్తున్నాడు. ప్రేమ ఏనాటిదో అని గౌరవం చూపుతాడు. ఇది ఏల పదాల (జానపద గేయాలు)వలె స్వచ్ఛప్రేమ పూర్ణాలు (అరికల్లు)

భావమును నుడికారాన్ని చూడండి:—నేరాలకు శిక్షవేసి చోరు లను బంధింతురు, నా మది దోచిన దొంగా నిన్నేవిధి శిక్షింతును, (ఏనాటిదో) కనురెప్పల చూరులు పట్టుకు సిగ్గన్నది మొగ్గలు వేసెను—ఎద ఎదతో కలయుటన్న మన్ను మిన్ను ఏకమగుట—మనసు మనసు విప్పనిదే...పెదవి పెదవి చేర్చనిదే ఎదలోపలి ముదిబాధలు ఎన్నటికీ తీరవులే (రసికతే)—పురి విప్పిన నెమలిలాగ ఈ మనసే ఆడెనులే—చందురుపై కోపంతో వెన్నెలెవడు చెరపగలడు — నీవు రావని మల్లె మొగ్గలు నవ్వవాయె.

## 6. ఎర్రపావురాలు

[కవితా సంకలనం, అలిశెట్టి ప్రభాకర్. డెమ్మి1/8–పార టల సంఖ్యలేదు, వెల, రు 2/–ప్రతులకు–స్టుడియో పూర్ణిమ; జగిత్యాల 505327.]

ఈ రచయిత ముడిసరుకును కళాస్వరూపంగా చేయడం తెలిసినవాడని ఈయన మిత్రుడు—శివారెడ్డి ''ముందుమాట''లో

అంటున్నారు. ఇవేగదా శిల్పచేసిన పని. ''ఇప్పుడు గొప్ప కవిత్వం వ్రాయలేదు, ముందు వ్రాయగలదు'' అని చెప్పిన ఇచ్ఛకాలులేని హితవాక్యాన్ని అచ్చు వేసుకోగలిగిన హృదయ దార్ఢ్యం ఉన్న ఈ కవి తప్పక బాగుపడగలదు. డెమ్మీసైజు పేజీలో ఒకే చిన్న వాక్యపు ఖండిక. ఇది ఒక కొసవెర్రితనం! కాగితం వేస్టు! (ఇంగ్లీషుపైన ఈ కవికి మోజున్నదిలే!)

పొదలో తళుకొత్తే కొన్ని మిడుగురు బూచులు:— గడ్డిపరకను విడిగాచూచి అసహ్యించుకోకు, అది ప్రకృతి శోభకు దోహదం చేస్తున్నప్పుడు చూడు—ప్రశ్న, వేశ్య శీర్షికలు బాగున్నవి. వంటింటి కప్పలట! వింతప్రయోగమే! వంటింటి కుందేలంటారు. ఆ పేజీలోనే కూపస్థ మండూకమంటారు. ఇది తెలిసిన తబ్బిబనుకొందాం.

## 7. సాహితీ స్రవంతి

[మినీ కవితల సంకలనమట! డెమ్మీ 1/8—సంస్కృతి సమాఖ్యవారి మూడో ప్రచురణ; పేజినంబర్లులేవు; అమూల్యం. విజయవాడ—521212.]

సంకర సమాసం లేకుండా శీర్షికకు ఏదో ఒక భాషను చేపట్టకూడదా? పేజికి మూడు—నాలుగువంతున నూర్గురు దేశదేశాలవారి రచనా సంకలనమిది. సాధనలో తొలి మెట్టుగా ప్రోత్సహించవలసి తీరే ఇది. చాలామందికి ప్రకాశనావకాశం కల్పించిన దానికి ప్రకాశకులను ప్రశంసించవలసినదే.

ముమ్మందు వ్రాతలో స్పెలింగ్ తప్పులు (అచ్చు తప్పులు గాదు) సవరించుకొంటే బాషాసేవ అనిపించుకొంటుంది.

## 8. దీప్తి కవిత

[జ్యోతిర్మయి—డెమ్మీ 1/8—పొరటలు 60; వెల రు 3/– ప్రతులకు—ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్—సికిందరాబాద్.]

ఈ కవయిత్రికి ధర్మావేదనమున్నది. నేటి కవుల క్రోధ ద్వేష భావ మరుభూమిలో ఈ వ్రాత ఒక మంచినీటి చలమగా మున్నది. ''చైతన్యంకోసం తపించే ఉన్మాదిని'' అని చెప్పుకొంటూ ''సమత్వం కావాలంటూ సాటివారిని శపించను'' అని బంగారు వంటి ఉపదేశం చేస్తున్నది. ''ఆశయాల హారం వేసుకు ఊరేగే మనిషి'' అని నినాదప్రియులను బాగా ఎత్తిపొడుస్తున్నది.

ఈ భావ సౌభాగ్యంతోబాటు మంచి నుడికారమున్నది:— కాలానికి కళ్ళెంలేదు—మేడినందుగా మారిన మానవతావాదం—శోకం రాగాలాపన చేస్తున్నది. ఇటువంటి సహృదయ కవిత్వమే సంఘాన్ని బాగుపరచి పదికాలాలపాటు మనేది. ద్వేషం ఆశ్రయాశుడు (ఆశ్రయించిన దానినే తినే అగ్ని) గదా!

## 9. చూపు (వచన కవితలు)

[హిమజ్వాల—డెమ్మీ 1/8. 95 పేజీలు; వెల రు 5/– ప్రతులకు: హిమజ్వాల, లింగాల, మహబూబునగర్, 509401]

గ్రంథకర్త పేరు—హిమజ్వాల, ఇటువంటి విరోధాభాసలు నేటి సైన్సుకు పరిచయాలేగదా! Cold burns అని అంటున్నారు గదా. అంటే ఈ కవిత్వం చల్లగా కాలుస్తుందని కాబోలు. ఏమైతేనేమి? ద్వేషించి నెత్తురు చిందించి సమత నెలకొల్పాలనే కవుల గోత్రానికి చెందినవారు వీరు. తప్పుచేసిన వారిని మన్నించి మానవులుగాచేస్తే, వసుధైక కుటుంబంగా అందరమూ వాసపడలాము గదా. చదువుతూనే ఉంటాము—వీరి కవితలు ఏనాటికైనా సౌజన్య మూర్తులు కారా అన్న ఆశతో.

శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

## 'కన్నడ సాహిత్య చరిత్ర'

[మూలం : డా. రం. శ్రీముగళి, అనువాదం : ఎం. ఎస్. మహంతయ్య, ప్రచురణ : సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ, వెల : రు. 12—00, పుటలు : 318.]

బహుముఖమైన భారతీయ సంస్కృతిని అవగాహన చేసికొనుటకు వివిధ భారతీయ భాషా సాహిత్యాల అధ్యయనం అవసరం. ఈ అవసరాన్ని గుర్తించిన కేంద్ర సాహిత్య అకాడమీ, రాష్ట్ర సాహిత్య అకాడమీలు భారతీయ సాహిత్యచరిత్రలను ప్రచురిస్తున్నవి. కేంద్ర సాహిత్య అకాడమీ యిదివరకే అస్సామీ, ఒరియా, డోగ్రీ, తెలుగు, మలయాళం, మైథిలీ, వంగ, సింధీ, కన్నడం మున్నగు సాహిత్యాల చరిత్రలను ఆంగ్లంలో ప్రచురించింది వాటి అనువాదాలు ఆయా భాషలలో కూడ వెలువరించే ప్రయత్నం చేస్తున్నారు.

కేంద్ర సాహిత్య అకాడమీ వారి ఆదేశం మేరకు విఖ్యాత కన్నడ రచయిత డా. రం. శ్రీ. ముగళిగారు ఆంగ్లంలో రచించిన కన్నడ సాహిత్య చరిత్రను ఎం. ఎస్. మహంతయ్యగారు తెనుగు చేశారు. ఈ రచనలో కేవలం సాహిత్య చరిత్రయేకాక, కన్నడభాష, ఉత్పత్తి, వికాసములను గురించిన ప్రత్యేక ప్రకరణమును కూడ చేర్చడం సముచితంగా వుంది.

గ్రంథకర్త తమ పీఠికలో ''అనావశ్యకమగు వివరములతో గాని, అతివిస్తరమైన విమర్శలతోగాని దీనిని గురుతరము చేయరాదు. ఆయా సాహిత్యముల వికాసమున ప్రముఖముగ కనిపించు ముఖ్య లక్షణములను, సరళముగను, స్పష్టముగను వివరించి చెప్పుచు తగిన ఉదాహరణలతో దాని రసదృష్టి నెత్తిచూపుట దీనిలక్ష్యమై యుండవలెను'' అన్నారు. ప్రతి ప్రకరణముపై అభిప్రాయము ననుసరించి వ్రాయబడింది.

ప్రాచీన కాలము — ఒకటి; ప్రాచీన కాలము — రెండు; మధ్య కాలము — ఒకటి; మధ్య కాలము — రెండు; మధ్య కాలము — మూడు; అర్వాచీన కాలము అను ఆరు విభాగాలలో ఈ సాహిత్య చరిత్రను విభజించినారు.

'కన్నడ భాష; ఉత్పత్తి వికాసము' అనే అధ్యాయములో కనీసం రెండు వేల సంవత్సరముల నుండి కన్నడము వాడుకభాషగా వున్నదన్నారు. కర్‌నాడు (కర్ = నల్లని నేలతో కూడిన, నాడు = ప్రదేశము) కమ్మితునాడు (పరిమళముతో కూడిన ప్రదేశము) అను శబ్దములు రాను రాను 'కన్నడ' మై దేశం, భాష రెండింటిని సూచించు శబ్దముగ పరిణమించినవన్నారు. ఇది వరకు లభించిన కన్నడ శిలా శాసనాలలో క్రీ.శ. 450 నాటి హల్మిడి శిలాశాసనము అతి ప్రాచీనమైనది.

మూల ద్రావిడ భాష యొకటి వుండి దాని నుండి తమిళ, మలయాళం మున్నగు భాషలు జనించినట్లు భాషా శాస్త్రజ్ఞులు పేర్కొన్నారు. 'కన్నడ కైపిడి కారుదు' మూల భాష నుండి మొదట విడివడినది. తెలుగు భాష లనియు, లటు పిమ్మట తమిళ కన్నడములు వేరైనవనియు తరువాత తమిళమునుండి మలయాళము పుట్టెననియు చెప్పవచ్చునన్నారు.

'కన్నడ సాహిత్యారంభము' అను మొదటి ప్రకరణములో కన్నడమున యింతవరకు లభించిన ప్రాచీన గ్రంథాలలో కవి రాజ మార్గము మొదటిదని, దీనిని నృపతుంగుడు (క్రీ. శ 814—77) రచించెను. కవిరాజ మార్గము దండికవి రచించిన కావ్యాదర్శము అను అలంకార శాస్త్రానువాదము. ఈ కృతి భారతీయ సంస్కృతికి వేయివత్సరములకు పూర్వమే పట్టిన కన్నడ దర్పణము వలె వున్నదన్నారు.

'వడ్డారాధనె' (వృద్ధ ఆరాధన) (క్రీ. శ. 1920) ప్రప్రథమ కథా గుచ్ఛముగ గ్రహింపబడినది. వైదిక కుటుంబములో జన్మించి, జైన మతమును స్వీకరించిన పంపకవి రెండు మతముల సారభూతమగు అంశములను మేళవించినాడు. పంపకవిలో 'రసికత వైరాగ్యము, హద్దు మీరని వివేక సంపద' వుండెను. పంపకవి ఆది పురాణము, విక్రమార్జున విజయము (పంప భారతము) అను రెండు కావ్యాలను రచించినాడు. మొదటిది ధార్మిక కావ్యము. రెండవది లౌకిక కావ్యము.

ఆది పురాణములో శాస్త్ర జగడమను నీరసమైన భాగంతో పాటు పాండిత్య ప్రదర్శనావేశమున్నది.

పంప కవికి విరయశస్సును సంపాదించి పెట్టిన పంప కావ్యము 'విక్రమార్జున విజయము.' ఇది మహాభారత ముఖ్య కథానకము. అముఖ్య భాగములను కోల్పోక, సంగ్రహమైనను, సమగ్రతకు బాధ కలుగకుండ సమస్త భారతమగుట; బుద్ధికి ఒప్పరీతిని మహాభారతమునందలి మానవీయ సంఘర్షణల చిరంతన చిత్రమును ప్రభావయుతముగ యిచ్చుట. పంపకవి ఉజ్జ్వల ప్రతిభ సన్నివేశ నిరూపణలోను, పాత్ర పోషణలోను వ్యక్తమై వుండును. దుర్యోధనుడు దుష్టుడు, దురభిమాని, కాని పంపకవి చేతిలో అతడు రాజసవ్యక్తి సర్వాంశముగల అభిమానధనుడైన వీరుడు ధీరుడు. పంప భారతము కన్నడ మహా కావ్యములలో నొకటి.

పొన్న—రన్నలు 10వ శతాబ్దికి చెందినవారే. ఇంచుమించుగ సమకాలికులు. చిత్తూరు జిల్లా పుంగనూరు ప్రాంతము వాడైన పొన్నకవి 'శాంతి పురాణ' అను ధార్మిక కావ్యంతోపాటు 'భువనైక రామాభ్యుదయ' అను లౌకిక కావ్యమును రచించినాడు. రన్నకవి రచనలలో అజిత పురాణము, గదాయుద్ధ కావ్యాలు ప్రముఖమైనవి. నాటకీయత వుట్టిపడే గదాయుద్ధ కావ్యమున దుర్యోధనుని ధీర వృత్తి, బంధుప్రేమ, ఆదర్శ మిత్రత్వము, అసహాయ శూరత మనల నెంతగానో ఆకర్షించును. 10వ శతాబ్దికి చెందిన యితర కవులలో చావుండరాయుడను గద్యకారుడు, ఛందోంబుధి కర్నాటక కాదంబరి కర్త, ఒకటవ నాగవర్మ ప్రముఖులు. నాగచంద్రుడు రామచంద్ర చరిత పురాణమను పంప రామాయణమును రచించినాడు. నయసేనుడు, బ్రహ్మ శివుడు, రెండవ నాగవర్మ 12వ శతాబ్దికి చెందిన ప్రముఖ కవులు.

12వశతాబ్ది మధ్యకాలము కన్నడసాహిత్య చరిత్రలో విశిష్టమైనది. ఆధ్యాత్మిక, నైతిక పరంపరల నుపదేశించిన వచన కవితా వివర్తనము జరిగిన కాలమిది. అల్లమప్రభు, బసవేశ్వరుడు, అక్క మహాదేవి, హరిహరుడు, రాఘవాంకుడు, నేమిచంద్ర, రుద్రభట్టు, జన్న ఆండయ్య మున్నగు వారలు కన్నడ వాఙ్మయమును సుసంపన్న మొనర్చిరి.

15వ శతాబ్దిలో జన్మించి 'కుమార వ్యాసకవి' 'నభూతో నభవిష్యతి' అనిపించుకొన్న రసవత్కవి. కుమారవ్యాసుడు (క్రీ.శ. 1430) తన భారతము నవరస భరితమై 'కావ్యకెగురు' (కావ్యమునకు గురువు) అన్నట్లున్నదని పేర్కొన్నాడు. ఈతని భారతము విభిన్న స్వభావంగల మానవుల భావ ప్రదర్శనాలయం. ఈ రసవత్కృతి ఆదిపర్వమునుండి గదాపర్వము వరకు విస్తరించి 8500 భామినీ షట్పదులతో కూడినది. తక్కిన ఎనిమిది పర్వాలను తిమ్మణకవి (క్రీ. శ.1510) పూర్తిచేశాడు. కుమారవ్యాస భారతమును గురించి డా. ముగళి వ్యాసభారతమును కుమార వ్యాస

భారతము సార్థకముగ కన్నడీకరించినది. కృతియందు కొన్ని యెడల బంధము శిథిలమైయున్నది. విసుగెత్తించు బోధనలున్నవి. కళా దృష్టితో సామాన్యమనదగు కథనమున్నది. కాని మొత్తముమీద ప్రదర్శించిన ఉత్కటత, సజీవత్వము, ప్రతిభ, దేశి సహజత—అన్నిటి కంటె మించిన అద్భుత తాదాత్మ్యము – వీనితో కుమారవ్యాస భారతము కన్నడ మహాకృతులలో ఒకటై నిలచినది.

కుమార వ్యాసయుగమనబడు 12–14 శతాబ్దముల మధ్య కాలమున శివకవులగు చామరసు, నిజగుణ శివయోగి, ముప్పిన షడక్షరి, సర్పభూషణ శివయోగి, సర్వజ్ఞుడు మున్నగువారు వెలసిరి. విశ్వధర్మము నిత్య నీతియందు వుండవలసిన సద్గుణములను సర్వజ్ఞుడు మరల మరల చెప్పినాడు. కురళ్ వ్రాసిన తిరువళ్ళువర్‌వలె, తెలుగువారి వేమనవలె కన్నడిగుల జనప్రియకవి సర్వజ్ఞుడు.

శివశరణుల వచన వాఙ్మయమువలె ప్రజలలో పాదుకొన్న దాస వాఙ్మయమునకు ఆద్యులు నరహరి తీర్థులు. సంకీర్తనాచార్యుడగు పురందరదాసు త్యాగరాజుకు స్ఫూర్తి నిచ్చినవాడు. అసంఖ్యాకములైన భక్తి కీర్తనలను రచించిన మహనీయుడు పురందరదాసు

కనకదాసు, జగన్నాథదాసుల తరువాత భాగవత కవులగు కుమార వాల్మీకి, జైమినీ భారతకర్త లక్ష్మీశకవి, చిత్రభారత కర్త గోపకవులను గురించి జైనకవి రత్నాకర వర్ణిగారల రచనల విశేషాలను గ్రంథకర్త చక్కగా వివరించినారు

'మధ్యకాలము—మూడవ భాగము'న షడక్షరి, తిరుమలార్య, సంచియ హొన్నమ్మ, ముద్దణ, మున్నగువార్ల రచనల విశేషాలను పేర్కొన్నారు. హొన్నమ్మ రచించిన 'హది బదెయ ధర్మ' సతీ ధర్మములను వివరించు కావ్యము. ముద్దణ రచించిన రామాశ్వమేధ కావ్యము భార్యాభర్తల సంవాద రూపములో సాగిన రామకథ.

క్రొత్త సారస్వల కవుల తొలిమెట్టు (క్రీ. శ, 1820–1920) కొత్త సారస్వత కవుల మలిమెట్టు (1921 1958) అను శీర్షికల క్రింద కన్నడములో నవీన సాహిత్యోదయ చరిత్రను విపులంగా చర్చించినారు. కొత్త కావ్యము శీర్షికలో శ్రీ బి. యం శ్రీ కంఠయ్య, గోవిందపై డి. వి. గుండప్ప శ్రీనివాస (మాస్తి వెంకటేశ అయ్యంగార్) సాలి రామచంద్రరాయ, దత్తాత్రేయ రామచంద్ర బేంద్రె, ఆనందకంద, మధురచెన్న, వి సీతారామయ్య కువెంపు, పు. తి. నరసింహాచార్య, జి. పి. రాజరత్నం, తీ నం శ్రీ కంఠయ్య, కడెంగొడ్లు శంకరభట్ట, వి. కె. గోకాక్ (వినాయక) రం. శ్రీ ముగళి (రసికరంగ) ఈశ్వర సణకల్, కె. యస్. నరసింహస్వామి గోపాలకృష్ణ అడిగ, చెన్నవీర కణవి, జి. యస్. శివరుద్రప్ప మున్నగు వారల కవితలలోని వైశిష్ట్యమును చక్కగా సమీక్షించినారు.

'చిన్నకథ—నవల' అను శీర్షికలో మాస్తి వెంకటేశ అయ్యంగార్, ఎస్. జి. శాస్త్రి, శివరామకారంత్, దేవుడు నరసింహశాస్త్రి, సి. కె. వెంకటరామయ్య, అ. న. కృష్ణారావు, గొరూరు రామస్వామి, అయ్యంగార్, బేంద్రె, కువెంపు, పు. తి. న. తరాసు, నిరంజన, రాజరత్నం, బీచిగార్ల కథానికా సాహిత్యమునకు సమర్పించిన కృతుల సమీక్షతోపాటు యిటీవల వారైన ఈశ్వరన్ వరదరాజు హుయిలగోళ, వ్యాసరాయ బల్లాళ, మున్నగు వారిని పేర్కొన్నారు.

కన్నడ నవలా రచయితలలో శివరామకారంత్ అగ్రగణ్యులు. అరువదికి మించిన వారి నవలలలో 'మరళి మణ్ణిగె' ('మరల సేద్యానికి' తిరుమల రామచంద్రగారిచే తెనిగింపబడినది) చోమన దుడి అత్యంత ప్రసిద్ధములు. భారతదేశమునకు గర్వకారణమగు కన్నడ నవలా రచయితలలో కారంత్ ఒక్కరనుట నిక్కము అన్నారు డా. ముగళి.

నవలా రచయితలలో కువెంపు, అ. న. కృష్ణారావు, దేవుడు. తరాసు, బసవరాజు కట్టీమనె, కృష్ణమూర్తి, పురాణిక్, మిర్జి అణ్ణారాయ, ఎం. వి. సీతారామయ్య, శ్రీరంగ, కె. వి. అయ్యర్, గోకాక్, మున్నగువారు. నాటక కర్తలలో బి. యం. శ్రీ డి వి. గుండప్ప, మాస్తిగార్లు. ఆధునికులలో టి. పి. కైలాసం, ప్రసిద్ధులు. కైలాసం రచనలను సమీక్షిస్తూ గ్రంథకర్త 'భారతీయ' విశ్వ వాఙ్మయ చరిత్రలో కైలాసం ప్రతిభ అనాదిమ, ఉజ్వలము అని నిస్సందేహంగా చెప్పవచ్చును అన్నారు.

ఆద్య రంగాచార్య, శివరాయ కారంత్‌నంస, కువెంపు, ఎం. ఆర్. శ్రీనివాసమూర్తి, బేంద్రెగార్లు, చక్కని నాటకాలెన్నో రచించినారు.

'వ్యాసములు—ఇతర గద్యములు' అను శీర్షికలో వివిధ రీతుల గద్యరచనలను వెలువరించిన రచయితలను—వారి రచనలను పేర్కొన్నారు. ఉపసంహార వాక్యములలో గ్రంథకర్త 'కన్నడిగులు సర్వమందలి అన్ని ఉత్తమ సారస్వతములనుండి స్ఫూర్తి పొందినట్లే, ఇతరులు కూడ కన్నడ సారస్వతములోని మంచి భాగములనుండి స్ఫూర్తినొందుదురు గాక' అనటం వారి సమన్వయ దృష్టికి సంకేతము.

గ్రంథకర్త డా. రం. శ్రీ ముగళి సంగ్రహంగా అయినప్పటికీ ప్రధాన ఘట్టాలను చక్కగా చర్చించుటతోపాటు తమ అభిప్రాయాలను కూడ తెల్పినారు. ఈ విధంగా యీ రచనలలో సద్విమర్శన కూడా సాగింది. ఎం. ఎస్. మహంతయ్యగారి అనువాదం సరళంగా వుంది. బసవేశ్వర వచనముల కొన్నిటి అనువాదం హృద్యంగావుంది.

కన్నడ భాషేతరులైన విద్వాంసులనే కాక సామాన్య పాఠకులను కూడా అలరించే చక్కని రచన యిది.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

